The one and only Magazine devoted to Humour & Music

# హాసం

హాస్య-సంగీత పత్రిక

వెల : రూ. 10
పేజీలు 68+8

1-15 సెప్టెంబరు
2003





అందమైన కళ్లే కాదు
వారసత్వంగా వచ్చేది.....
అపాయకరమైన వ్యాధులు కూడా...
హెపటైటిస్-బి వ్యాధి సోకిన తల్లి తనకు తెలియకుండానే గర్భస్థ శిశువుకు కూడా సంక్రమింపచేస్తుంది - ఆ కాలేయపు వ్యాధిని. మీ డాక్టర్‌ను సంప్రదించండి. సకాలంలో టీకా వేయించుకోండి. ధర అందుబాటులో ఉండే అంతర్జాతీయ శ్రేణి వ్యాక్సిన్ గురించి తెలుసుకోండి.
ప్రజాహితం కోరి విడుదల చేసినది
ప్రాణాంతక హెపటైటిస్-బి వ్యాధి నిరోధక టీకా
శాన్‌వాక్-బి తయారీదారులు:
శాంతా
బయో టెక్నిక్స్ (ప్రై)లి.
3వ ఫ్లోరు, శిరీన్ ఛాంబర్స్, బంజారాహిల్స్, హైదరాబాద్
ఫోన్స్ : 040-23548507, 23608843, ఫ్యాక్స్: 040-23548476
హెపటైటిస్-బి
పసుపు వలయం
ప్రమాద సూచకం
Help. Stop HBV
Shanvac™ - B
r-DNA Hepatitis-B vaccine

# హాసం
హాస్య - సంగీత పత్రిక

# ఇవీ సంగతులు

47

**Also available on net:**
**www.haasam.com**



ముఖచిత్రం
'జానకి వెడ్స్ శ్రీరామ్' లో
రేఖ

## హాస్యం





'సెంటర్ స్ప్రెడ్' లో

బాయ్స్

సినిమా పాటల పుస్తకం
కలర్‌లో













## సంగీతం




రేలంగి తరువాత అంతటి హాస్య నటుడిగా ఖ్యాతి గడించి రెండు దశాబ్దాలుగా ఏడుకోట్ల ఆంధ్రులను బ్రహ్మానంద భరితులను చేస్తున్న బ్రహ్మానందం గారు తన విలువైన సమయాన్ని వెచ్చించి విజేతను ఎంపిక చేసినందుకు నా కృతజ్ఞతలు. నా సీరియల్ గురించి ఈ పూర్వ ఆంధ్రోపన్యాసకులు పలికిన ప్రశంసా వాక్యాలు నన్ను పులకింప జేశాయి. పండితులు మెచ్చుకుంటే ఆ ఆనందమే వేరు. విజేతకు అభినందనలు. 'హాసం' ఇస్తున్న ప్రోత్సాహాన్ని వ్యక్తపరచటానికి మాటలు లేవు.

**- ఇలపావులూరి మురళీమోహనరావు, హైద్రాబాద్**

'హాసం' మొదలైనప్పటి నుండి కొని చదువుచున్నాను. ప్రతి శీర్షికలోనూ మీరు తీసుకునే శ్రద్ధ అర్థమవుతోంది. నమోనమః ఇంతలోనే ముగిసినందుకు మాకు బాధ కలిగింది. మిస్టర్‌పెళ్లాం గురించి బాపు గారు ముందే ఆర్టిస్ట్ ఎక్స్‌ప్రెషన్స్‌తో సహా బొమ్మ వేసి పెట్టుకోవడం అనే వక్రియతో అనలైన చిత్రకారుడనిపించుకున్నారు. ఇంద్ర కథ మమ్మల్ని ఆనందింపజేసింది. హ్యూమర్‌బాక్స్, చౌచౌ చౌరస్తా శీర్షికల్లోని జోక్స్ చదివి తెగ నవ్వు కుంటున్నాము. మా అభిమాన గాయకుడు పి.బి.శ్రీనివాస్ గారు మా అభిమాన గాయని లతా జీవిత చరిత్రను ఎంతో హృద్యంగా అంది స్తున్నారు. **-రామ్‌మోహన్, అల్వాల్**

ఆంధ్రుల అభిమాన గాయని, కాబోయే స్టార్ సింగర్ కౌసల్య గురించి మీ పత్రికలో రావడం మాకు మహా ఆనందం కల్గింది. గొప్ప గొప్ప గాయకులు, మీరు గొప్ప సంగీత దర్శకులు గురించి వ్రాయడం, మేము తెలుసుకోవడం వల్ల "ఆత్మానందం" కలుగుతోంది.

**-ఎస్.నాగేశ్వర్‌రావు, ఆదిలాబాద్.**

నాపేరు "తాళాభక్తుల లక్ష్మీప్రసాద్" మాది విశాఖపట్నం. "హాసం" పత్రికలో పేరడీ పాటలు వ్రాసే నన్ను గుర్తు పట్టే ఉంటారు. 'హాసం'లో నా పాటలు ప్రచురింపబడినందుకు అదృష్టంగా, గర్వంగా భావిస్తున్నాను. మాప్రాంతంలో నేను చాలా మందికి హాసాన్ని రుచి చూపించాను. వాళ్ళంతా ఇప్పుడు 'హాసం' రసాస్వాదనలో హాయిని పొందుతూ తీయగా నన్ను పలుక రిస్తుంటారు. ఇట్టి 'హాసం' అభిమానులే కాక, హాస్య, సంగీతాలతో ప్రత్యక్షంగా, పరోక్షంగా సంబంధం ఉన్న అనేక మంది నా స్నేహ బృందంలో ఉన్నారు. వీరందరినీ ఒకచోట చేర్చి హాస్య, సంగీతాలకు ప్రాముఖ్యతనిస్తూ ఒక కళా సంస్థను స్థాపించాలనే సంకల్పం నా మదిలో మొలకెత్తింది. దానికి "హాసం క్లబ్" అని పేరు పెట్టాలనుకుంటున్నాను. దీనిపై మీ అమూల్య మైన సలహాలను, సంస్థపేరు పట్ల మీ అభిప్రాయాన్ని, అనుమతిని తెలియజేయమనవి. బేనర్ నమూనా తయారుచేసి ఉంచాను మీరు అనుమతిస్తే పంపిస్తాను. సభ్యుల వివరాలు, కార్యవర్గం వివరాలు కూడా పంపిస్తాను. కార్యవర్గం విషయంలో మీ సూచనలను, సలహాలను ఆశిస్తున్నాను. నవ్వు, సంగీతం ఈ రెండూ మనిషి నిరంతర, జంతర్ మంతర్, యాంత్రిక జీవనయానంలో మానసిక వత్తిడిని తగ్గించి, కొన్ని నిముషాలైనా ఆహ్లాదాన్నిచ్చే అమృతౌషధాలని మనసారా నమ్మే మనిషిని నేను. నేను స్థాపించబోయే ఈ సంస్థ హాస్య, సంగీత సౌరభాలను నిరంతరం వెదజల్లే వేదిక కావాలని ఆశపడుతున్నాను. నా ఆశ నెర వేరడానికి, ప్రారంభసంచిక నుండి ఈ పక్షం సంచిక వరకూ నా దగ్గర ఉన్న 'హాసం' పత్రికలే నాకు అండదండలుగానిలుస్తాయి. వాటిలో ఉన్న మెటీరియల్ చాలు నాకు జనాన్ని కట్టి పడేయడానికి. పక్షం, పక్షం క్రొత్త మెటీరియల్ ఎలాగూ జమ అవుతూనే ఉంటుంది.

**-తాళా భక్తుల లక్ష్మీప్రసాద్, విశాఖపట్టణం.**

**(మీలాగే 'హాసం క్లబ్' స్థాపిస్తామంటూ పాఠకమిత్రులెంతో మంది వ్రాస్తున్నారు. ఇటువంటి క్లబ్‌లకు మా సహాయ సహకారాలు ఎప్పుడూ వుంటాయి. ఆ వివరాలు అతి త్వరలో పత్రికా ముఖంగా ప్రకటిస్తాం. -ఎడిటర్)**

16-31 జులై 2003 కొని చదువుతూ ఈ ఉత్తరం వ్రాయవలసి వచ్చింది ఈ సంచిక 58వ పేజీలో "నవ్వించగల సెన్సారథం -2 రావి కొండలరావు గారు వ్రాసిన వ్యాసంలో ఒక ఫొటో వేస్తూ "దేవత (1941) చిత్రంలో కుమారి, నాగయ్య అని వ్రాసారు. ఆమె కుమారి కాదు. కళ్యాణి. ఆమె ఆ చిత్రంలో "తల్లిని మించే దైవము వేరే ధారుణి లేదోయి" అనే పాట పాడారు. నా వయస్సు 77 సంవత్సరాలు. ఇంకా జ్ఞాపకముంది.

**-వి.వి.రమణయ్య, విశాఖపట్నం.**

'హాసం' సామ్రాజ్యంలో సభ్యత్వం పొంది నెలకి రెండు సంచికలను పొందుతూ ఆసాంతం చిరు పద సవ్వడిని కూడా వదలక చదువుతూ సంగీతం-హాస్యం వంటి రసగుళికల వెనుక దాగివున్న అమూల్య సమాచారాన్ని ఆమూలాగ్రం ఆస్వాదిస్తూ మీరు 16-31 ఆగస్టు సంచికలో ప్రవేశ పెట్టిన 'సరిగపదమని -1' శీర్షిక ద్వారా అతి విలువైన, అమృత గుళికలైన పాట క్యాసెట్‌లను బహుమతిగా ప్రకటించడం నా వంటి వారికి మహద్భాగ్యం.

**-జె. నాగేష్, హైదరాబాద్.**

'హాసం'కి నేను రాస్తున్న మొట్టమొదటి ఉత్తరం ఇదే. సంచికలు చదువుతున్నప్పుడల్లా అందులోని విశేషాలను ఉటంకిస్తూ లేఖ రాయాలనుకుంటూనే వుంటాను. కానీ 'హాసం' చదువుతూ మైమరచిపోతూ... అభినందించాలన్న విషయాన్ని కూడా మరిచిపోతుంటాను. కానీ 16-31 ఆగస్టు సంచికలో ఎడిటోరియల్ చదివాక మెచ్చుకోకుండా వుండడం నా వల్ల కాదనిపించింది.



ఫెయిల్యూర్ అనే సినిమారథచక్రాల కింద పడి తమ అస్థిత్వాన్ని కోల్పోతున్న సంగీత సాహిత్యాల గురించి చాలా చక్కగా విశ్లేషించారు. మా గురువుగారు సీతారామశాస్త్రిగారు రాసిన 'పట్టుదల'లోని పాట విందామంటే నిజంగా మీరు చెప్పినట్టు కేసెట్ దొరకలేదు. ఓసారి ఆయన దగ్గరే కూర్చొని ఆ పాటని ఆయన చేత పాడించుకొని రికార్డ్ చేసుకున్నాన్నేను. అలాగే 'శ్రీకారం' సినిమాలోని 'మనసు కాస్త కలతపడితే మందు ఇమ్మని మరణాన్ని అడగకు...' కూడా. 'లగ్నపత్రిక'లో గురువుగారు అద్భుతమైన పాట రాశారు. ఆ పాట రాస్తున్నప్పుడు నేను ఆయనతో పాటే కూర్చున్నాను. వేదనలకు వేదికవకె ఆడపుట్టుకా... వెళ్ళి వేటగాణ్ణి వేడుకోకెజాలిగా' అనే పల్లవితో ఎంతో ఎమోషనల్‌గా సాగుతుందా పాట. కానీ సినిమా ఫెయిల్యూర్ వల్ల ఎవరికీ గుర్తుండడం జరగలేదు.

హిట్ సినిమానీ, ఫ్లాప్ సినిమానీ ఎవరూ ముందుగా ఊహించలేరు. హిట్ సినిమాలో రాసినా, ఫ్లాప్ సినిమాలో రాసినా పాట కోసం రచయిత ప్రసవ వేదనలో ఎలాంటి మార్పూ వుండదు. కానీ రచయిత ప్రమేయం లేకుండా- పరాజయం పొందిన సినిమావల్ల రావలసిన క్రెడిట్ ఆయా పాటలకు దక్కకపోవడం విచారించదగ్గ అంశమే. మంచి విశ్లేషణ చేశారు. గీత రచయితలు, సంగీత దర్శకుల పక్షాన నిలబడి మీరు ఈ ఎడిటోరియల్‌ని రాయడం అభినందనీయం.

ప్రేక్షకశ్రోతలారా! మంచి పాటని మీరు బ్రహ్మరథం ఎక్కించి ఊరేగించండి... మాలాంటి వారు మరిన్ని గొప్ప పాటలు రాసే ఉత్సాహాన్ని కలిగించండి ప్లీజ్!

- భాస్కరభట్ల రవికుమార్, సినీగేయ రచయిత.

సంపుటి : 2 సంచిక:23

**1-15 సెప్టెంబరు 2003**

పేజీలు: 68 + 8

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $50

జీవిత చందా : రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్) : $400

మేనేజింగ్ ఎడిటర్
**ఎమ్బీయస్ ప్రసాద్**

ఎడిటర్
**రాజా**

రిఫరెన్స్ కర్టెసీ
**డా॥ కె.వి.రావు**
**జె.మధుసూదన శర్మ**



**HAASAM HAASYA SANGEETHA PATHRIKA**
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com



Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018
Fax: 040-23541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82


The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య - సంగీత పత్రిక

47

తెలుగు భాష వాడకం గురించి ఎల్లెడలా చర్చ జరుగుతోంది. ఇంటా, బయటా మాతృభాష వాడకం పెరగాలన్న అభిలాష తీవ్రంగా వ్యక్తమవుతోంది. అలా మాట్లాడే పరిస్థితి ఏర్పడాలంటే కావలసినది భాషాభిమానం. ఇది పై నుండి దిగుమతి చేసుకోలేనిది, బలవంతంగా రుద్దలేనిది, చట్టాలతో సాధించలేనిది.

మరి తెలుగువారికి తెలుగుపై అభిమానం కలిగించేది ఎలా? ఇది చిన్నప్పుడే కలగాలి. అంటే తల్లిదండ్రులూ, ఉపాధ్యాయులూ పూనుకుని తెలుగులో సంభాషిస్తే సరిపోదు. భాషపై మక్కువ కలిగించేలా ప్రవర్తించాలి. తెలుగు భాషలో ఉన్న మాధుర్యాన్ని బాలలకు అందించాలి. ఆ మాధుర్యం చేత ఆకర్షితులైన బాలబాలికలు క్రమంగా అలవాటుపడి, భాషపట్ల గౌరవం పెంచుకుంటారు.

ఉదాహరణకు ఓ హిందీ సినిమాపాట వుందనుకోండి. మొదటిసారి వినేటప్పుడు మనం ఆకర్షింపబడేది దాని శ్రావ్యత వల్లనే. ఒకటికి నాలుగుసార్లు, తప్పుల తడకలుగానైనా పాడుకుని ఆనందిస్తాం. ఆ తరువాత ఆ పాటలో కవి ఏం చెప్పాడా అని ఆరా తీస్తాం. ఆ తరువాత ఫలానా మాట హిందీట, ఫలానా పదం ఉర్దూట అనుకుని వాటిల్లో కూడా మంచి కవిత్వం, గాంభీర్యం ఉన్నాయన్నమాట అనుకుని వాటిని గౌరవిస్తాం.

ప్రస్తుతం ప్రాథమిక పాఠశాలల్లో జరుగుతున్నదేమిటి? ఇంగ్లీషులోని నర్సరీ రైమ్స్‌ను భావయుక్తంగా పాడుతున్నారు, అభినయించి చూపమంటున్నారు. తెలుగుపద్యాలు, గేయాల వద్దకు వచ్చేసరికి భావరహితంగా పెద్ద గొంతుతో గట్టిగా పాడించి బట్టీ పట్టిస్తున్నారు. మరి పసిబాలురకు జాక్ అండ్ జిల్ మీద ఉన్న అభిమానం, గౌరవం 'తల్లీ నిన్ను దలంచి పుస్తకమున్ చేతన్ బూనితి' మీద ఉంటుందా? జాతీయస్థాయిలో ప్రఖ్యాతి చెందిన గాయనీమణులు పాడిన ఇంగ్లీషు రైమ్స్, చక్కటి ఆర్కెస్ట్రాతో సహా ఆడియో కాసెట్స్‌లో లభ్యమవుతున్నాయి. అన్నీ ఒకే ట్యూన్‌లో కాకుండా వేర్వేరు ట్యూన్స్ కట్టి వినిపించి ఆకర్షిస్తున్నారు. మరి తెలుగు పద్యాలు ఆ విధంగా దొరుకుతున్నాయా?

అందువల్ల తెలుగు కుర్రవాడికి తెలుగు పద్యాలపై ఆపేక్ష కలిగేట్లా చేసే బాధ్యత ఉపాధ్యాయుడి మీదనే పడుతోంది. వారికి కాస్తో, కూస్తో సంగీతజ్ఞానం ఉంటే పద్యాలను సొగసుగా, భావయుక్తంగా పాడి వినిపించిన సందర్భాలలో పరిస్థితి మెరుగ్గా ఉంటుంది. పద్యానికి కంఠవశం అయ్యే గుణం ఉంది కాబట్టి అది చప్పున వంటపడుతుంది. అందునా తెలుగును మ్యూజికల్ లాంగ్వేజి అంటారు కాబట్టి, సంగీతానికి చక్కగా ఒదుగుతుంది కాబట్టి పాడుకుని ఆనందించిన పిల్లలు భాషపై ప్రయత్నంగా అభిమానం అలవరించుకుంటారు.

కానీ నూటికి తొంభై కేసుల్లో ఇలా జరగదు. ఉపాధ్యాయుడు తెలుగు పద్యాన్ని రాగయుక్తంగా చదవడు, ముక్క ముక్కగా విరిచి, పలికి ప్రతిపదార్థం రాసుకోమని ఆదేశిస్తాడు. అందునా ప్రతిమాటకూ సమానార్థకాలూ, నానార్థాలూ, సంధులూ - ఇవన్నీ జరిగేటప్పటికి పద్యంలో స్వారస్యం పోయి అది చదవడం పెద్ద పని అని అనిపిస్తుంది. మరో పక్కనుండి 'లండన్ బ్రిజ్ ఈజ్ ఫాలింగ్ డౌన్' ట్యూన్ ఊరిస్తూంటుంది. అందుకే సాధారణ తెలుగువాడు క్లాసు పుస్తకాల స్టేజి దాటాక నన్నయ, తిక్కనల జోలికి పోడు. కవిసమ్మేళనాలలో కూడా పద్యకవిత్వం చెపుతూంటే అసహనంగా ఉంటాడు. వచన కవిత్వంలో అర్థమయ్యే మాటలుంటాయి కాబట్టి కాస్త ఓపికపడతాడు.

ఈ పరిస్థితి మారాలంటే తెలుగు ఉపాధ్యాయులకు కాస్త సంగీతజ్ఞానం ఉండాలి. పద్యాన్ని భావయుక్తంగా, రాగయుక్తంగా పాడగల నేర్పు వుండాలి. ముందే సంగీతం నేర్చుకోకపోయినా ఫర్వాలేదు, ఘంటసాలగారి పద్యం ఏదో ఒకటి ముందు పెట్టుకుని ఆ ట్యూన్‌లో పాడేసినా చాలు, విద్యార్థులను ముగ్ధులను చేయడానికి. గేయాన్ని కూడా ఏ పుష్పవిలాపం స్టయిల్లోనే ఆలపిస్తే చాలు. తరువాతి 'సంగతులు' పిల్లలే చూసుకుంటారు.

ఇది చిన్న చిట్కాగానే అనిపించినా తెలుగుభాషాభివృద్ధికి ఎంతో దోహదపడుతుందని 'హాసం' నమ్మకం. ఈ పక్షంలో రాబోతున్న ఉపాధ్యాయదినం నాడు ఉపాధ్యాయులందరూ ఈ విషయమై ఆలోచించి తగిన నిర్ణయం తీసుకుంటారని మా ఆశ.



ఇది వినాయక చవితి తర్వాత నిమజ్జనానికి ముందు చదవ వలసిన కథ...

# నీలాపనిందలు

-సరసి



పానకాలుకి పిల్లల్లేరు. పానకాలు భార్య వెంకటల్లక్ష్మి నోచిన నోములు నోచకుండా నోచింది. 'వయసేవంత ఎక్కువనీ.... ఊహూ ఇదైపోడానికీ?' అని ఎవరన్నా అన్నప్పుడు ఇద్దరికీ ఆశలు మళ్లీ చిగురించి, ఎంతో ఆనందం కలుగుతూ ఉంటుంది.

వినాయక చవితి రోజున పానకాలు, వెంకటల్లక్ష్మి శ్రద్ధగా పూజ చేసుకున్నారు. పూజ అయ్యాక సూతుల వారు శౌనకాది మునులకు చెప్పిన వినాయక వ్రత కథనంతా చదివింది వెంకటల్లక్ష్మి. చవితి చంద్రుణ్ని ఎవరైనా చూస్తే ఇహ ఇంతే సంగతులని శాపం పెట్టడం, దరిమిలా శ్రీకృష్ణుడంతటి వాడు పాలల్లో చంద్రుణ్ణి చూసి నీలాపనిందలకు గురి కావడం, తర్వాత దేవతలంతా మొరపెట్టుకుంటే ఆ శాపానికి కాస్త రిలాక్సేషనిచ్చి, కథాక్షతలు వేసుకుని చంద్రుణ్ణి చూస్తే డేంజరుండదని చెప్పడం - ఆ వృత్తాంతం అంతా చదివింది.

పానకాలు అంతవరకూ శ్రద్ధగా విన్నాడు. అయితే కథ చివరకు వస్తున్న టైములో బెడ్రూములో ఉన్న ఫోను మోగేసరికి లేచి వెళ్లాడు. ఫోను మాట్లాడి వస్తూనే 'ఆలస్యం అయిపోయింది అన్నం పెట్ట'మని తొందర పెట్టేసరికి అక్షింతలు వేసుకోమని భర్తకి చెప్పడం మరచిపోయింది వెంకటల్లక్ష్మి.

ఉండ్రాళ్లు తింటూ రోజల్లా టీవీ ప్రోగ్రాములు చూస్తూ గడిపేరిద్దరూ. సాయంత్రం సినిమా పాటల కార్యక్రమంలో 'మిస్సమ్మ' సినిమాలో రామారావూ, సావిత్రి కలిసి పాడిన 'రావోయి చందమామా మా వింత గాధ వినుమా....' పాటొచ్చింది. అంతవరకూ టీవీ చూస్తున్న వెంకటల్లక్ష్మి ఉన్నట్టుండి ఓ వెర్రి కేక పెట్టింది. "కొంపలంటుకు పోయాయండోయ్. కథాక్షతలు వేసుకోకుండా మీరిప్పుడు టీవీలో చంద్రుణ్ణి చూసేశారు. ఏం కొంపలంటుకుంటాయో ఏమో! ఏం నీలాపనిందలొస్తాయో ఏమిటో!" అంటూ హడావిడిగా దేవుడి దగ్గర అక్షింతలు కాసిని తెచ్చి పానకాలు కిచ్చి వేసుకోమంది.

"టీవీలో చంద్రుడే కదే. నేనేవన్నా డైరెక్టుగా చూశానా ఏం?"

"డైరెక్టుగా కాకపోయినా చంద్రుడు చంద్రుడే నండీ. కృష్ణుడు కూడా చంద్రుణ్ణి ఇన్‌డైరెక్టుగానే చూశాడు కదండీ పాలల్లో. అయనకే అన్ని తిప్పలొస్తే - ఇక సామాన్యులూ, అసమర్థులూ అయిన మీకెన్ని వస్తాయో నాయనోయ్!" అంటూ వెంకటల్లక్ష్మి శోకాలు తీయడం ప్రారంభించింది.

రాత్రంతా నిద్ర పట్టలేదావెకి. ఏం జరుగుతుందో ఏమో అని భయపడుతూనే ఉంది.

మర్నాడు చీకటితోనే పానకాలు నిద్రలేచి రోజులాగే మార్నింగ్ వాక్‌కి బైల్దేరి వెళ్లాడు.

తనలాగే రోజూ మార్నింగ్ వాక్‌కి వచ్చే ఇద్దరు ముగ్గురు పానకాలుని దార్లో విష్ చేశారు. కొంచెం దూరం పోయాక - కాలనీ ఎగ్జిక్యూటివ్ మెంబర్ ఇస్మాయిల్ ఎదురుగా రావడం చూసిన పానకాలు గతుక్కుమన్నాడు. వారం క్రితం కాలనీ జనరల్ బాడీ మీటింగ్‌లో అతనితో తగువైంది

తనకి. అప్పట్నించి అతడితో మాట్లాడటం లేదు తను. ఇప్పుడు విష్ చేయాలా అక్కర్లేదా? ఏమైతే అవుతుంది. తను మాత్రం విష్ చేయకూడదు అనుకుని చూడనట్టే వెళ్లిపోబోయాడు పానకాలు.

కానీ ఇస్మాయిల్ అలా అనుకునే మనిషి కాదు. "గుడ్ మాణింగ్ భాయ్!" అంటూ తనే ముందుగా విష్ చేశాడు.

"సుప్రభాతం!" అన్నాడు పానకాలు అప్రయత్నంగా. వీలుని బట్టి తమాషాగా అలా తెలుగులో గానీ, ఇంగ్లీషులో గానీ విష్ చేయడం పానకాలకలవాటు.

అలా అనేసి ముందుకు వెడుతున్న పానకాలుని చటుక్కున ఆపి చొక్కా పట్టుకున్నాడు ఇస్మాయిల్ - క్యా బాత్ కర్రే తూ? అంటూ.

సడన్‌గా అతడు దాడి చేసేసరికి బిత్తరపోయిన పానకాలు చొక్కా విదిలించుకుని 'ఏయ్ ఏంటిది?' అని గట్టిగా కేక పెట్టాడు. ఆ కేకకి అటువైపు వెడుతున్న ఇద్దరు పరుగెట్టుకొచ్చి పానకాలుని విడిపించేరు.

'చూడు భాయ్. మా ఇద్దరిదీ ఒకే కాలనీ. మొన్న మీటింగులో మా ఇద్దర్కీ మాటా మాటా వచ్చింది. అరె పోనీలే అని ఇప్పుడు 'గుడ్ మాణింగ్ భాయ్' అని నేనే ముందు పలకరించినా. నేను మంచిగా మాట్లాడినపుడు ఆయన కూడా మంచిగ మాట్టాడాలి కదా! 'చుప్ రహో తుం' అని నోరు మూస్కోమంటున్నాడు.. బద్మాష్." అన్నాడు ఇస్మాయిల్ చెయ్యి పైకెత్తి ఒక్కటిచ్చుకుందామని.

అతడి ప్రయత్నం సఫలం కాకుండా చూశారా పెద్ద మనుషులు. "ఏవయ్యా అట్లాగేనా మాట్లాడ్డం? చదువుకున్న వాడిలా కనిపిస్తున్నావ్? ఆ మాత్రం సంస్కారం లేదూ?" అంటూ పానకాలు చెప్పేది వినకుండా గడ్డి పెట్టే అవకాశాన్ని సద్వినియోగం చేసుకున్నారా ఇద్దరు.

తను 'చుప్రహోతుం' అనలేదని, 'సుప్రభాతం' అన్నానని, అది 'మిస్ హియరింగ్' అయిందని చెప్పి వాళ్లను, ఇస్మాయిల్‌ని నమ్మించి, బతిమాలి కన్విన్సు చేసే సరికి పానకాలుకి తాతలు దిగొచ్చారు. 'ఛీ.... పొద్దున్న పొద్దున్నే ఏవిటది?' అనుకుంటూ చేసిన మార్నింగ్ వాక్ చాల్లే అనుకుని, ఇంటి ముఖం పట్టేడు పానకాలు పాడైపోయిన బుర్రగలవాడై.

"నే చెప్పలా? అక్షింతల ప్రభావం!" అంది వెంకట్లక్ష్మి. "పోనీలెండి వాళ్లెవరో టైముకి ఉండబట్టి సరిపోయింది లేకపోతే, ఆ సాయిబు చెయ్యి చేసుకునే వాడేమో కూడా.' తర్వాత, పానకాలు స్థిమితపడి, పళ్లు తోముకుని, కాఫీ తాగేడు.




"యావండీ పైన ట్యాంకులో నీళ్లెక్కుతున్నాయో లేదో చూడండి, అసలు చుక్క పడటం లేదు కింద." అంది వెంకట్లక్ష్మి భర్తను ఏదో యావొగేషన్‌లో పట్టి మరిపించే ప్రయత్నం చేస్తూ.

పానకాలు డాబా ఎక్కి ట్యాంకు మూత తీసి చూశాడు. నీళ్లు మెల్లగా పడుతున్నాయి. మూత మూసి యధాలాపంగా చూసిన పానకాలుకి ఎదురుగా ఖాళీ స్థలం అవతల దూరంగా డాబా మీద నుంచి చెయ్యి ఊపుతూ విష్ చేస్తున్న కూర్మారావు కనిపించాడు. మాట వినబడనంత దూరంలో ఉంది కూర్మారావు ఇల్లు. అతడిదీ పానకాలుదీ ఒకే ఆఫీసు.

తను కూడా జన్మతః మర్యాదస్థుడు కాబట్టి తనకు విష్ చేస్తున్న కూర్మారావుకి ప్రతిగా చెయ్యి ఊపేడు పానకాలు. అయితే అదే సమయంలో ఇంటి ముందు ముగ్గు పెడుతున్న కూర్మారావు భార్య దూరంగా డాబా మీద నుంచి పానకాలు చెయ్యి ఊపడం చూసింది. అది తనకేనని ఆమె భ్రమ పడింది.

తన భర్త డాబా మీద ఉన్నట్టు గానీ, అక్కడ నుండి అతగాడు పానకాలుకి చెయ్యి ఊపితే అందుకు ప్రతిగా పానకాలు చెయ్యి ఊపేడన్న సంగతి గానీ ఆమెకి తెలియదు. అసలే తను కాలనీకంతటికీ ఏకైక అందగత్తెననే ప్రగాఢమైన నమ్మకంతో ఉంటున్న ఆ కూర్మారావు భార్య కాలనీలో ప్రతి మగాడూ తనకి లైనేస్తున్నాడని, తనంటే పడి ఛస్తున్నారనీ అనుకుంటూ వుంటుంది. వాళ్లందరినీ తప్పించుకుని బజారుకు వెళ్లాలన్నా, వేరే ఏ పనిమీద వెళ్లాలన్నా ఆమెకు చాలా కష్టంలా ఫీలయిపోతుంటుంది.

ఏ క్షణాన ఏ మగాడు నిగ్రహం కోల్పోయి తనకు ఏ అఘాయిత్యం తలపెడతాడోనని ఆమె అహర్నిశలూ వర్రీ అవుతూ, తనని తాను రక్షించుకునే అంశానికి అత్యధిక ప్రాధాన్యతనిస్తూంటుంది. అలాంటి క్లిష్ట పరిస్థితుల్లో తనుండగా ఈరోజు పానకాలు ఇలా డైరెక్టుగా ఇంక రంగంలోకి దిగోపోయాడన్న మాట! ఎంతకి బరితెగించాడూ అనుకుందామె.

తనని ముగ్గులోకి లాగడానికి ప్రయత్నం చేస్తున్నాడన్న ఊహ కలగగానే వెంటనే ముగ్గులోంచి బైటికొచ్చి చీపురు తీసుకుని పెద్ద



ఫెద్ద అంగలేసుకుంటూ పానకాల్ని గట్టిగా బూతులు తిట్టుకుంటూ అతడింటి వైపు దూసుకుంటూ వచ్చేసింది. తన పాతి వ్రత్యానికే విపత్తు కలిగే వేళ తనింక మౌనంగా ఉండటంలో అర్థం లేదను కుందామె.

ఇదేం తెలియని పానకాలు మెల్లగా డాబా దిగి వచ్చేసరికి - కూర్మారావు భార్య చీపుర్ని గాల్లో గిర గిరా తిప్పుతూ పిచ్చ బూతులు తిడుతోంది పానకాలు పేరు పెట్టి ! చుట్టుపక్కల వాళ్లంతా వినోదపు పన్ను మినహాయించిన సినిమాని చూసి నట్లు ఎగబడి, చుట్టూ మూగి ఆనందిస్తున్నారు.

"నేను బజారుదాన్ననుకున్నావురా? పరాయి మగాడి కేసి కన్నెత్తయినా చూడని పతివ్రతనిరా నేను! నీకేం పోయే కాలంరా నా మీద కన్నేశావ్?" అంటూ నోటి కొచ్చినట్టు తనను తిడుతున్న కూర్మారావు భార్య పూనకాలు చూడగానే పానకాలు కాళ్ల కింద భూమి కంపించినట్టయ్యింది.

ఎప్పట్నించో పానకాలంటే గిట్టని పక్కాయన ఇదే సందని నీతులు చెప్పడం ప్రారంభించాడు. "పరాయి స్త్రీని తల్లిలా చూడాలండీ! మీరేసినట్టే వదిన గారికె వరైనా లైనేస్తే మీరూరుకుంటారా? అహ, ఊరుకుంటారా అని?"

"అవును. ఈ మధ్య నాకేసి కూడా అదోలా చూస్తున్నాడు..." అనేసింది ఆడవాళ్ల గుంపు లోంచి ఒకావిడ సందర్భోచితంగా. వీధిలో ఆడవాళ్లు నలుగురూ గుంపుగా చేరి పానకాలు చెడిపోయిన వైనం గురించి విపులంగా చర్చించడం ప్రారంభించారు. పానకాలు నెత్తి కొట్టుకుంటూ ఏదో చెబుతున్నాడు గానీ ఆ రణగొణ ధ్వనిలో సన్నటి అతడి గొంతుక మైకు లాగనట్టుంది. కూర్మారావు భార్య ఎక్కడ చీపురు




చేసుకుంటుందోనని భర్తని వెనక్కి లాగింది వెంకట్లక్ష్మి.

ఇంతలో కూర్మారావు కూర్మావతారం ఎత్తిన శ్రీ మహావిష్ణువులా మెల్లగా వచ్చి, భక్త పానకాలుని రక్షించాడు. విషయం తెలుసుకున్నటువంటివాడైన కూర్మారావు వాళ్లావిడ రెక్క పుచ్చుకుని లాక్కెళ్లిపోయాడు. పానకాలు తప్పులేదని తేలిన వెంటనే ఎక్కడ రివర్సు గేరులో క్లాసు తీసుకుంటాడోనని భయం వేసి, వీధిలో చేరిన న్యాయ నిర్ణేతల సంఘ సభ్యులంతా అలా అలా పల్చబడిపోయి చడీ చప్పుడూ లేకుండా ఇళ్లల్లో దూరిపోయి గెడ లేసేసుకున్నారు.

"ఈవాళ మీకు బావోలేదు, మీరింట్లోకి రండి." వెంకట్లక్ష్మి లోపలికి తీసుకు పోయింది. తను చేసిన చిన్న పొరబాటుకు ఎన్ని కష్టాలెదుర్కోవాల్సి వస్తోందోనని వెంకట్లక్ష్మి తీవ్రంగా మథన పడసాగింది. బయటకు వెడితే మా ఆయన దక్కేట్టు లేదని గ్రహించిన వెంకట్లక్ష్మి పానకాలు చేత ఆరోజు ఆఫీసు సెలవు పెట్టించింది.

సాయంత్రం వరకూ ఏ కాలక్షేపమూ లేక, చదివిన న్యూస్ పేపరే చదువుతూ కూర్చున్నాడు పానకాలు.

"పొద్దున్నించీ కళ్లు లాగేస్తున్నాయి. కంట్లో కాస్తంత మందు వేద్దురా!" అంది వెంకట్లక్ష్మి కుర్చీ లాక్కుని కూర్చుంటూ. ఆమె చేతిలో మందుసీసా తీసుకుని రెండు కళ్లల్లో నాలుగేసి చుక్కలు వేశాడు పానకాలు. ఆమె కుర్చీకి తలవాల్చి కళ్లు మూసుకుంది.

"టీవీలో డైలీ సీరియల్సన్నీ వదల కుండా చూస్తే కళ్లు లాగవా మరీ?" అంటూ విసురుగా వచ్చి - సోఫాలో కూర్చుని మళ్లీ పేపరు తీసి పొద్దుట్నించీ నిగ్రహించు కుంటున్న బాధనీ, అవమానాన్ని చిరాకు రూపంలో ప్రదర్శించసాగాడు.

అదే సమయంలో పానకాలు మామగారు కనకయ్య ఊరునించి వచ్చేడు. ఆయన గుమ్మంలో అడుగు పెడుతూనే కుర్చీలో కళ్లనీళ్లు కారుస్తూ కూర్చున్న కూతుర్ని చూశాడు. చూసి నీరైపోయాడు. ఆమె ఏడుస్తోందను కున్నాడాయన. తన కూతురు పైకి అలా కనిపిస్తోంది గానీ సంసారంలో అనేక బాధలు పడుతోందని కనకయ్య కెప్పట్నించో అనుమానం.

"నీకనేకసార్లు చెప్పాను. విన్నావా? నువ్వెందుకు వింటావ్?" అన్నాడు పానకాలు టీవి చూడొద్దని తను చెప్పిన మాటల్ని చిరాకులో ఓ భాగంగా కంటిన్యూ చేస్తూ...

కనకయ్య ఆ మాటలు విని రగిలిపోయాడు. పేపరు చదువుతున్న పానకాలు గానీ, కళ్లు మూసుకున్న వెంకట్లక్ష్మి గానీ కనకయ్య రాకని గమనించలేదు. అలా చడీ చప్పుడూ లేకుండా రాబట్టే అల్లుడు తన కూతుర్ని ఏ రకంగా హింసించి బాధపెడుతున్నాడో తను కళ్లారా చూడగలిగాననుకున్నాడు కనకయ్య. ఆయన రక్తం ఉడికిపోయింది.

"నా మాటంటే లక్ష్యం లేదు. నీకు నాకూ ఆ కనెక్షన్ తెంచిన్నాడే సుఖమూ శాంతీనూ!" అన్నాడు పానకాలు కేబుల్ కనెక్షన్ కట్ చేయిస్తాననే ఉద్దేశంతో. అతగాడు భార్యాభర్తల సంబంధం కట్‌చేసి, తన కూతురుకి విడాకులిచ్చి, పుట్టింటికి పంపించేస్తానంటున్నాడేమోనని అర్థం తీసుకున్నాడు కనకయ్య. ఆవేశం కట్టలు తెంచుకుంది. ఇక ఉపేక్షించ కూడదనుకున్నాడు.



"ఓరి దౌర్భాగ్యుడా! నువ్వేదో ఉద్ధరిస్తావని అల్లారుముద్దుగా పెంచిన నా బిడ్డని నీ చేతుల్లో పెట్టాన్రా. నీకేం తక్కువ చేశానని దాన్నలా హింసిస్తున్నావురా? నిన్నూ..... నిన్నూ.... ఏం చేసినా పాపం లేదు!" అంటూ ఆవేశంతో ఊగిపోతూ పానకాలు మీదకి లంఘించి అతణ్ణి వొంగదీసి, దబదబా వీపు మీద నాలుగు పిడి గుద్దులు గుద్దేశాడు. ఇదంతా ఒక్క క్షణంలో జరిగిపోయింది.

అకస్మాత్తుగా ఒక వ్యక్తి ఇంట్లోకి రావడం, ఆ వచ్చిన వ్యక్తిని ఫలానా అని గుర్తు పట్టేలోగానే అనూహ్యంగా మీద పడి చితకబాదేయడం, అది కూడా తనెన్నడూ పల్లెత్తు మాట కూడా అనని మామగారే కావడం - ఇవన్నీ ఒక్క క్షణంలో జరిగేసరికి పానకాలు షాక్ తినేసి పడిపోయాడు. వెంకటలక్ష్మి అదిరి పడింది.

"నాన్నా! నీకేవన్నా పిచ్చి పట్టిందా? నిష్కారణంగా అల్లుడిమీద చెయ్యి చేసుకుంటావా? ఏవండీ, ఏవండీ. ఏవిటండీ అలా అయిపోయారు?" అంటూ ఫ్రిజ్‌లోంచి నీళ్ల సీసా తెచ్చి కాసిన్నీళ్లు మొహం మీద చల్లింది. పానకాలు మెల్లగా కళ్లు తెరిచాడు.

"అవును. నేనొక చేతకానివాణ్ణి. కాలనీ వాళ్లతో మంచిగా ఉండటం చేతకాదు. పరాయి స్త్రీలతో మర్యాదగా ఉండటం అంతకన్నా చేతకాదు. చివరకు కట్టుకున్న దాన్ని సుఖపెట్టడం కూడా చేతకాని దద్దమ్మని. నాకేం చేతకాదు. నేనెందుకూ పనికి రాను." అంటూ బావురుమన్నాడు.

తర్వాత, జరిగిందంతా కూతురు ద్వారా తెలుసుకుని, తన తప్పుని గ్రహించిన కనకయ్య నీరైపోయాడు. "నన్ను క్షమించల్లుడూ! నా తొందరపాటు వల్లే ఇదంతా జరిగింది. ఆ దేవుడు చల్లగా చూస్తే వచ్చే ఉగాదిలోగా అమ్మాయి పండంటి మనవణ్ణి నా చేతుల్లో పెడుతుంది. ఆ సంగతి తనంతట తాను చెప్పలేక వాళ్లమ్మకి ఉత్తరం రాసిందిట. ఆ విషయం చెప్పకుండా అర్జంటుగా అమ్మాయిని చూడాలని మీ అత్తగారు పరుగులు పెట్టించింది" అన్నాడు తువ్వాలుతో కళ్లొత్తుకుంటూ.

శుభవార్త చెవిన పడగానే పానకాలు మొహం వెలిగిపోయింది. దుఃఖం ఎగిరిపోయింది. "అమ్మదొంగా!" అంటూ భార్యని ఎత్తి గిరగిరా సినిమాలోలా తిప్పుదామనుకున్నాడు గానీ తన పర్సనాలిటీకి అంత స్తోమతు లేదని గ్రహించి ఉట్టిగా "అమ్మదొంగా!" అని మాత్రం అన్నాడు ఆనందపడిపోతూ.

వెంకటలక్ష్మి సిగ్గు మొగ్గలేసింది. ■

## సాంగతే బంగారు రాజా



"మొన్న డాక్టర్ సంగీతరావు దగ్గరకెళ్లి - కిడ్నీలో రాళ్లు వున్నట్టున్నాయి. ట్రీట్‌మెంట్ చెయ్యండీ - అని అడిగితే అవి కరగడానికి ఏం రాసిచ్చాడో తెలుసా?"

"ఏం వ్రాసిచ్చాడు?"

"రోజూ మూడు పూటలూ జగదేకవీరుని కథ చిత్రంలోని 'శివశంకరీ' పాట వినమన్నాడు"

-టి. ప్రియాంక, గుంతకల్లు

(ఆ సినిమాలో రాయిగా మారిన వరుణదేవపుత్రికి కరిగించడానికి కథానాయకుడు ఆ పాటని పాడతాడని ఈ తరం పాఠకులు అర్థం చేసుకోవాలని మనవి)

# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

## దైవరూపులు జ్ఞానదాతలు

| | |
|---|---|
| రచన | : శ్రీమతి డా॥ ఎం. పద్మినీదేవి |
| సంగీతం | : ఎం. చిత్తరంజన్ |
| గానం | : బృందగానం |
| రాగం | : వాచస్పతి (64 వ మేళకర్త రాగం) |
| తాళం | : త్రిపుట |
| ఆరోహణ | : స రి గ మ ప ద ని స |
| అవరోహణ | : స ని ద ప మ గ రి స |

ప: దైవరూపులు జ్ఞాన దాతలు
గురువులకు మా వందనం
1చ: కటిక చీకటి విచ్చిపోగా
కాంతి రేఖలు విరియగా
అక్షయమ్మగు చదువు ధనముగ
అంది యిచ్చిన పుణ్యమూర్తులు ॥దైవ రూపులు॥
2చ: పాపమేదో పుణ్యమేదో
నీతి ఏమో రీతి ఏమో
ఎరుగ చెప్పి ఎరుకనిచ్చి
ఎల్ల వేళల మమ్ము కాచిన ॥దైవ రూపులు॥
3చ: సర్వ జీవుల ఆత్మ జ్యోతిని
చూడ గల్గెడి చూపునిచ్చి
సర్వసమతా భావనలతో
ముందు కడుగిడ బాట చూపిన ॥దైవరూపులు॥



మన స్వతంత్ర భారత దేశానికి ద్వితీయ రాష్ట్రపతియైన డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ గొప్ప తత్త్వవేత్త. జ్ఞాని. ఆయన తొలుత ఉపాధ్యాయునిగా తన జీవితాన్ని ప్రారంభించారు. రాష్ట్రపతిగానే కాక గొప్ప ఆధ్యాత్మిక వాదిగా మన సంస్కృతీ వారసత్వపు ఘనతను దేశ విదేశాల వ్యాప్తి కావించారు. డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ జన్మదినమైన సెప్టెంబరు 5వ తేదీన ఉపాధ్యాయ దినోత్సవంగా (టీచర్స్ డే) పండుగ జరుపుకుంటున్నాం. తల్లి దండ్రుల తరువాత 'ఆచార్య దేవోభవ' అంటూ మనం నమస్కరించేది గురువుకు. మనశ్శరీరాలను పెంచి పోషించి మనలను మానవులుగా తీర్చి దిద్దేది తల్లిదండ్రులు. కాగా బుద్ధి జీవియైన మానవునికి

-షడ్జము, చతుశృతి రిషభం, అంతర గాంధారం, ప్రతి మధ్యమం, పంచమం, చతుశృతి దైవతం, కైశికి నిషాదం యీ రాగంలోని స్వరాలు.

కర్ణాటక సంగీతంలోని యీ వాచస్పతి రాగాన్ని సంగీత విద్వాంసులు చాలా అరుదుగా పాడడం జరుగుతూంటుంది. లలిత సంగీతంలో యిటువంటి రాగాలను సాధారణంగా స్వరకర్తలు ఉపయోగించరు. లలిత సంగీత పద్ధతికి (అనగా రాగాల శాస్త్రపరమైన స్వరూపం కాక, లలితమైన రూపం), దానికి సంబంధించిన భావ రస సిద్ధికి అనుగుణంగా ఆయా రాగాలను మలచుకోవడానికి రాగాలపై స్వరకర్త పట్టు సాధించవలసి వుంటుంది. అది కష్టసాధ్యమైంది కనుక ఎక్కువగా ప్రచారంలో వున్న కల్యాణి, మోహన, అభేరి, హిందోళ మొదలగు రాగాలనే ఆశ్రయిస్తారు సంగీత దర్శకులు. అయితే డా॥ బాలాంత్రపు రజనీకాంతరావుగారు, పాలగుమ్మి విశ్వనాథంగారు, నేను చాలా మేళకర్త రాగాలను, వాడుకలో లేని అనేక జన్య రాగాలను వెలికితీసి లలిత సంగీతానికి అన్వయించి కూర్చిన బాణీలు ఆకాశవాణీ ద్వారా విస్తృత ప్రచారాన్ని పొందాయి. వాటిలో ఒకటి వాచస్పతి రాగంలో కూర్చబడిన యీ "దైవరూపులు జ్ఞానదాతలు" అన్న గీతం.

జ్ఞానబోధ చేసి మానవుని మనీషిగా నిలబెట్టేది గురువు.

అజ్ఞానం చీకటి వంటిది. ఆ చీకటిని చీల్చి వెలుగు చూపే జ్ఞానాన్ని విద్య అందిస్తుంది. చదువు మనకు గురువు ప్రసాదించే తరగని ధనం. జ్ఞానం వల్లనే మానవుడు యుక్తాయుక్త విచక్షణను పొంది సన్మార్గవర్తి కాగలడు. అట్టి విద్య వల్ల అపూర్వ జ్ఞానాన్ని పొందిన మనం శాంతి దాంతి సత్యశౌచాది సద్గుణాలను అలవరుచుకొని సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని, సకల జీవ సమభావాన్ని తద్వారా విశ్వశాంతిని సాధించగలం. అందుకే జ్ఞాన దాతలైన గురువులకు సదా వినయ విధేయతలతో కృతజ్ఞులమై వందనం ఆచరించడం మన విధి. దేవతల గురువు బృహస్పతి. అతనిని వాచస్పతి అని అంటారు. కనుక గురువులను స్తుతించే "దైవరూపులు జ్ఞానదాతలు గురువులకు మా వందనం" అన్న డా॥ పద్మినీదేవి విరచితమైన గీతానికి నేను వాచస్పతి రాగాన్ని ఉపయోగించి బాణీ కూర్చి బృంద గీతంగా గాయనీ గాయకుల చేత పాడించాను.

ప॥ సాస | నిదపప ॥ మపద | ప మగగ ॥ రిగరి | సస నిదని ॥
దైవ | రూ. పులు ॥ జ్ఞా. న | దా. తలు ॥ గురువు | లకుమా.. ॥
సారిగసా | రిగా, ॥ గనిద | పదపమగా ॥ గమపాపా | పా; ॥
వం.. ద | నం.. ॥ గురువు | లకుమా.. ॥ వం.. ద | నం. ॥

1.చ॥ నినిద | సనినిని ॥ నిరి | నిదదా ॥ దనిస | రిరిరి ॥
కటిక | చీ. కటి ॥ విచ్చి | పో. గా ॥ కాం. తి | రేఖలు ॥
రిగస | రి; ॥ సరిగ | ససససని ॥ నినిద | సస నిదపా ॥
విరియ | గా. ॥ అ. క్షి | య. మ్మగు ॥ చదువు | ధన ము. గ ॥
మపద | పాపమ ॥ గమరి | గమపా పప ॥
అం. ది | యిచ్చి న ॥ పు. ణ్యా | మూ.. ర్తులు ॥ దైవరూపులు ॥

2.చ॥ మాగరి | రిగమాగరి ॥ సారిసనిద | నిసరిరి ॥
పాప. | మే.. దో. ॥ పు.. ణ్యా. | మే.. దో ॥
సరిగ | మాగరి మా ॥ పనిద | పామగ గమపా ॥
నీ. తి | ఏ.. మో ॥ రీ. తి | ఏ.. మో.. ॥
పదని | సాసా ॥ సరిని | సాసా ॥ నిద | సా నిదపా ॥
ఎరుగ | చెప్పి ॥ ఎరుక | నిచ్చి ॥ ఎల్ల | వే ళ. ల ॥
మపగ | గమపా పప ॥
మ. మ్ము | కా.. చిన ॥ దైవరూపులు ॥

3వ చరణం మొదటి చరణం వలె పాడాలి



**'వాచస్పతి' లలిత సంగీతంలో వాడుకలో లేని రాగం గనుక యీ రాగంలో సినిమా పాటలు దొరకవు.**

## ఘంటసాల క్విజ్ -7 విజేతలు

1. మొదటి బహుమతి - డి.ఎస్.శంకర్, వక్కలంక.
2. రెండవ బహుమతి - గంటి. ఎస్.వి.ఎస్.ఎస్. రామగోపాల్, పెరుకు.
3. మూడవ బహుమతి - యన్న వేంకట నర్సిరెడ్డి, ఉప్పలపాడు.

**కరెక్టు సమాధానాలు:**

1. వదిన
2. స్వాతంత్ర్యమె నా జన్మ హక్కని ...
3. దొంగలున్నారు జాగ్రత్త
4. చెరుపకురా చెడేవు
5. పాతాళ భైరవి

**బహుమతులు:**

1. మొదటి బహుమతి : ఎ) 'బహుదూరపు బాటసారి' (ఘంటసాల ప్రైవేట్ పాటలు) డబుల్ డిస్క్/ స్వరసుధ ఘంటసాల 31 గాయనీ మణులతో పాడిన సినీ గీతాల డబుల్ డిస్క్ హెచ్.ఎం.వి.వారిది.
బి) ఘంటసాల పాడిన గోల్డెన్ అవర్స్ పాటల క్యాసెట్. హెచ్.ఎం.వి. వారిది.
2. రెండవ బహుమతి : 'బహుదూరపు బాటసారి' (ఘంటసాల ప్రైవేట్ పాటలు) డబుల్ డిస్క్ హెచ్.ఎం.వి.వారిది.
3. మూడవ బహుమతి : ఎ) ఘంటసాల, ఎల్.ఆర్.ఈశ్వరి యుగళ గీతాల 'లవ్‌మి నెరజాణ' హెచ్.ఎం.వి. వారి సింగిల్ సి.డి.
బి) ఘంటసాల పాడిన గోల్డెన్ అవర్స్ పాటల క్యాసెట్. హెచ్.ఎం.వి.వారిది.




# మిస్టర్ పెళ్ళాం



దర్శకత్వం బాపు

**కథ-స్క్రీన్‌ప్లే-సంభాషణలు ముళ్లపూడి వెంకటరమణ**

**వెండితెర నవల 3**

**నవలీకరణ ఇలపావులూరి మురళీమోహనరావు**

> **జరిగిన కథ**
>
> బాలాజీ, ఝాన్సీ భార్యాభర్తలు. బాలాజీకి ఆడవారంటే కొంచెం చులకన భావం. బ్యాంకులో క్యాషియర్‌గా ప్రమోషన్ పొందుతాడు బాలాజీ.
>
> -(ఇక చదవండి)

అది బాలాజీ పనిచేస్తున్న బ్యాంకు. లోపలకు ప్రవేశించాడు బాలాజీ. అక్కడ కనిపించిన వాతావరణం ఆశ్చర్యం కలిగించింది. మేనేజర్ సహా స్టాఫంతా అతని కోసం ఎదురు చూస్తున్నారు. బాలాజీని చూడగానే 'వెల్కమ్ వెల్కమ్ వెల్కమ్' అని అరిచారు.



వెల్కం టు ది న్యూ క్యాషియర్ '' అన్నారు కోరస్‌గా.

బాలాజీ బోలెడు సిగ్గుపడి పోయి అందరికీ దణ్ణం పెట్టాడు.

చప్పట్లు కొడుతున్న స్టాఫ్ దారివ్వగా మేనేజర్ ముందుకొచ్చి షేక్ హేండిచ్చాడు. బాలును అందరూ కలిసి హాలు మధ్యకు నడిపించారు.

'థాంక్యూ సర్' అన్నాడు బాలు.

"గాడ్ బ్లెస్ యూ మై బోయ్...కంగ్రాట్యులేషన్స్" అభినందించాడు మేనేజర్.

"పార్టీ ఇవ్వాలి. పార్టీ... పార్టీ..." అరిచారు అందరూ.

ఉబ్బితబ్బిబ్బయ్యాడు బాలు. 'ఓకె' అని అందరికీ పార్టీ ఆర్డరిచ్చాడు. అందరూ టేబుల్ చుట్టూ మూగి పదార్థాలు ఆరగిస్తున్నారు.



''మిస్టర్ బాలాజీ... అయామ్ ప్రౌడాఫ్ యూ... ఐసే'' అన్నాడు మేనేజర్. హెడ్డు గుమస్తా కొండయ్య కూడా 'వియార్ ఆల్ ప్రౌడాఫ్ యూ' అన్నాడు.

"అయామ్ వెరీ హ్యాపీ" అన్నారు మేనేజర్

"వుయ్ ఆర్ ఆల్ వెరీ వెరీహ్యాపీ" అంటూ సొంత గొంతుకతో ప్రతి ధ్వనించాడు కొండయ్య.

"సిఫార్సులు, ఫార్సులు లేకుండా"

"కేవలం టాలెంట్‌తో"

"హార్డ్ వర్క్‌తో"

"నువ్వీ పదవిలోకి వచ్చావు."

అన్నారు మేనేజరు, కొండయ్య వంతులవారీగా -ధ్వని ప్రతిధ్వని గొడవల్లేకుండా సర్దుకుంటూ

"కాష్ కీపర్ బ్యాంకు గుండె వంటివాడు. అతి క్లిష్టమైన, అతి కష్టమైన, అతి సున్నితమైన పని "

"నువ్వీ పదవిలో రాణించి..."

"వక్కాణించి..."

"ఇంకా పెద్ద బ్యాంకుకి..."



"ఇంకా ఇంకా ఇంకా పెద్ద బ్యాంకులకి...."

"ఇంకా ఇంకా ఇంకా ఇంకా...."

"ఈ రాష్ట్రానికే...."

"కాదు కాదు. ఈ దేశానికే కాష్ కీపర్‌వై పోవాలని మేమంతా కోరు కుంటున్నాం..."

తలా ఒక మాటా అనే శారు అల్పాహారాన్ని ఆరగిస్తూ.

ఆ నవ్వుల వెనక కుతంత్రం ఏమిటో ఆ క్షణంలో అర్థం కాలేదు బాలాజీకి.

* * *

అదే సమయంలో పిల్లలకు చేగోడీలు చేస్తోంది ఝాన్సీ. "అమ్మా ఆకలి... ఆకలి..." అరుస్తూ వచ్చి చుట్టుకున్నాడు చిన్నవాడు. 'వస్తున్నా.. వస్తున్నా' అని చేగోడీలు చేసి వాటిని ఒక పేపరున్న చేటలో పోసి ముందుపెట్టింది ఝాన్సీ.

"చూడమ్మాచూడు కింద చూడు...ఒకటి పక్కన సున్నా పెడితే?" అని అడిగింది. ఆ ఆకారాల్లో ఉన్న చేగోడీల్ని చూపెడుతూ.



"పది" అన్నాడు వాడు

"వెరీగుడ్" అంటూ- ఒకటి ఆకారంలో ఉన్న చేగోడిని వాడి నోట్లో పెట్టి. రెండు ఆకారంలో ఉన్న చేగోడీని అక్కడ పెట్టి "ఇది!?" అని అడిగింది.

"ఇరవై" అన్నాడు వాడు... అని ఊరుకోలేదు ఇంకెక్కడ పరీక్షలుపెడుతుందోనని సున్నా ఆకారంలోనున్న చేగోడిని లాగించేశాడు.

ఇంతలో నరసయ్య ఆయన గయ్యాళి భార్య పూర్ణ ప్రవేశించారు. "అమ్మడూ. నేను, పూర్ణ వన్నున్నాం. వచ్చేశాం" అన్నాడు నరసయ్య.



వారు ఆ సమయంలో ఎందుకొచ్చారో ఝూన్సీకి అర్థం కాలేదు. మనసులో 'అబ్బా' అని అనుకుంటూనే ముఖాన నవ్వు పులుముకుని "రండి. రండి." అని ఆహ్వానించింది.

నరసయ్య భార్యా విధేయుడు. ఆయన భార్య నోటికి, మునిసిపాలిటీ వారి డ్రైనేజీకి పెద్ద తేడా ఏమీలేదు. అంచేత జడుస్తాడు. భర్తను వేలి గోటితో ఆడించే మహా ఇల్లాలావిడ.

"మీ ఆయన టీవీ కొంటు న్నాట్టగా" అడిగింది పూర్ణ.



"ఆఁ... నామొహం...టీవీ లేదు ఏరోప్లేను లేదు. ఉత్తినే." చెప్పింది ఝూన్సీ.

"మేమూ కొందుము గానీ మీ అన్నగారు పనీ పాటా మానేసి అక్కడే కూర్చుం టారు." అన్నది పూర్ణ. భార్య వెనకాలే నిలుచుని విసన కర్రతో విసురుతున్నాడు నరసయ్య.

నవ్వుతూ లోపలికెళ్ళింది ఝూన్సీ.

"వెళ్ళిపోతావేం? ఇలారా. కూర్చో. నిన్న మంచి రసపట్టులో వదిలేశాం. చదువు. ఏంటలా బొమ్మలా నిలబడతారు? పుస్తకం ఇవ్వండి." భర్తను గద్దించింది పూర్ణ.

సంచిలోంచి పుస్తకం తీశాడు నరసయ్య. ఝూన్సీకి వారిని చూస్తేనే కంపరంగా ఉంది. "చెయ్యి ఊరికే లేదు. ఒక్క అరగంట" తప్పించు కోవాలని ప్రయత్నించింది.

"అంతా వెళ్లాక ఇంక పనేంటి?" ఆశ్చర్యంగా అడిగింది పూర్ణ.

"అదే... బట్టలు,పిల్లలకి చిరుతిండి...రేపటికి పప్పు రుబ్బడం..." గొణిగింది.

అటువంటి పనులు ఏనాడూ చేసి ఎరుగని ఆ అపర చండిక బోలెడు ఆశ్చర్య పోయి "పప్పా? ఉన్నారుగా మీ అన్నగారు! ఇట్టే రుబ్బే స్తారు... అలా నిల బడ్డారేం... వెళ్లండీ" గదిమింది.



జోరూ కా గులామ్ గారు పరుగు పరుగున ఝూన్సీ దగ్గరకు వెళ్ళాడు. ఝూన్సీ ఎలాగోలా తప్పించమన్నట్టు సైగ చేసింది. వెంటనే 'అబ్బా కడుపు నొప్పి' అని పొట్ట పట్టుకున్నాడు నరసయ్య.

* * *

బ్యాంకులో మేనేజర్ బాలాజీని తీసుకుని కాష్‌రూమ్ వద్దకు వెళ్లి బొట్టుపెట్టి...

"ఒక తాళం చెవి నా దగ్గరుంటుంది. రెండోది నీ దగ్గరుంటుంది." అన్నాడు తాళం చెవి అందించి.

"రెండూ కలిస్తేనే తెరుచు కుంటాయి" అన్నాడు బాలాజీ.



కాష్‌రూమ్‌లోంచి పది లక్షల నోట్ల కట్టలు తీసి ట్రేలో ఉంచి కాషియర్ కాబిన్లో పెట్టాడు బంట్రోతు. కాబిన్ లోపల్నుంచి లాక్‌చేసి కౌంటర్ ముందు కూర్చున్నాడు బాలాజీ. అతని మనసు ఆనందంతో నిండిపోయింది. కష్టానికి తగిన గుర్తుంపు లభిస్తే ఎవరికైనా ఆనందమే కదా!

* * *

బాలాజీ ఇంటి వద్ద సంరంభం! కలర్ టీవీని రిక్షాలో తెచ్చారు షాపువాళ్ళు. కొత్త కోడలికి మంగళహారితిచ్చి కుడి కాలు లోపల పెట్ట మన్నట్లు టీవీకి మంగళ హారతిచ్చింది పూర్ణ. 'టీవి రావే తల్లీ టీవీ రావే అమ్మా మా ఇంటిదేవతై కొలువుండవమ్మా' అంటూ స్వాగతించి టీవీని లోపలకు తెచ్చారు. అమ్మలక్కలంతా అసూయతో రగిలిపోతున్నారు.



"పాతిక ముప్పై వేలుండదూ?" అన్నదో అలరు బోడి.

"ఆఁ... వాయిదాల మీద కొని ఉంటారు." అన్నదో వామనయన.



"ఏమోనబ్బా... నాకీ వాయిదాలంటే మహా చిరాకు" మెటికలు విరిచిందో మదిరాక్షి.

'పిల్లలకు పరీక్షలని ఆగాం, పరీక్షలు కాగానే కొని పారేస్తా నన్నారు మావారు." నోరు పారేసుకుందో నాంచారమ్మ.

మనింట్లో కరెంటుపోతే బాధ పడం కానీ ఎదురింట్లో పోకపోతే ఏడుస్తాం కదా!

* * *

బ్యాంకులో మేనేజర్ ఛేంబర్. మేనేజర్ ఎదురుగా బుర్ర మీసాలతో బలిష్టంగా ఉన్న ఒక వ్యక్తి కూర్చున్నాడు. రౌడీకి ఎక్కువ రాజకీయ నాయకుడికి తక్కువ అన్నట్లున్నాడు.



కౌంటర్ ముందు నిలుచున్న ఆయనకు డబ్బిస్తున్నాడు బాలాజీ. ఫోన్ మోగింది. ఫోనెత్తి 'సార్' అన్నాడు బాలాజీ.

"నేను మేనేజర్ని మాట్లాడుతున్నాను. ఒక లక్ష క్యాష్ పట్టుకుని నా గదికి రా. చూడూ ఆ పెద్దనోట్లు ఐదొందలవి రెండు కట్టలు పట్టుకుని రా చాలు" వినిపించింది మేనేజర్ కంఠం.



"యస్సార్..." లేచాడు బాలాజీ. నోట్ల కట్టలు జేబులో పెట్టుకుని మేనేజర్ గదిలో కెళ్ళాడు.

"వీరు రాజారావుగారని పెద్ద షావుకారు. ఇంపోర్ట్ అండ్ ఎక్స్‌పోర్ట్ బిజినెస్." తలెత్త కుండానే పరిచయం చేశాడు మేనేజర్. అతనికి వినయంగా నమస్కరించాడు బాలాజీ.

"మన బ్యాంకులో పెద్ద అకౌంట్ ఓపెన్ చేస్తున్నారు. ఇదిగో పాతిక లక్షల డి.డి. తెచ్చారు బొంబాయి నుంచి. ఇంకో గంటలో క్యాష్ పై పోతుంది. ఏదో చిల్లర ఖర్చులకు ఓ లక్ష కావాలన్నారు. ఇచ్చి పంపించు. మధ్యాహ్నం రెండింటిలోగా సర్దేసు కుందాం." చెప్పాడు.

"సార్... ఇదిగో డబ్బు...." అందించబోయాడు బాలాజీ.



"తీస్కోండి సార్" అన్నాడు మేనేజర్.

అక్కడపెట్టు అన్నట్లు సైగ చేశాడా పెద్ద మనిషి.

"థాంక్యూ బాలాజీ..." అని ఇటు తిరిగి "రెండింటి లోపల తెస్తారుగా?" అడిగాడు మేనేజరు ఆ పెద్దమనిషిని

ఆ వ్యక్తి ఫారాలు ఫిలప్ చేయడంలో బిజీగా వున్నాడు ఉలకలేదు. పలకలేదు. తలాడించాడంతే....!

* * *

బాలాజీ ఇల్లు సినిమాహాల్లా తయారైంది. ఆడా మగా, చిన్నా పెద్దా, పిల్లా పీచూ అంతా కుర్చీలలో, సోఫాలలో కూర్చుని దూరదర్శన్ వారి కార్యక్రమాలను కళ్ళను గుడ్లప్పగించి చూస్తున్నారు. భార్య వెనక కూర్చుని నతి సేవ చేస్తున్నాడు నరసయ్య.



ఝాన్సీ, కూతురుతో సహా వచ్చి వేయించిన అప్పడాల్ని అందరికీ ఫలహారంగా అందించింది. వాటిని అందుకుని తింటూ టీవీ ప్రసారాలను పక్కనే పిడుగు పడ్డా చలించనంత ఏకాగ్ర చిత్తంతో వీక్షిస్తున్నారు అందరూ.



ప్రైవేట్ ఛానెల్స్ ఇరవై నాలుగు గంటలు ప్రసారాలు చేస్తున్నా ఒక్క క్షణం కూడా అంతరాయం అనేది ఉండదు. ఘనత వహించిన గవర్నమెంటు వారి దూర దర్శన్ వారు ప్రసారం చేసే నాలుగైదు గంటల ప్రసారాల్లో మాత్రం నాలుగైదు సార్లు అంతరాయాలు వస్తుంటాయి. ఆ విధంగానే ప్రసారంలో అంతరాయం ఏర్పడింది. అందరూ తిట్టుకుంటూ లేచారు.



"ఈ ఇండియా టీవీలొద్దే.... నేను వస్తూ తెస్తాను అంటూ మా అమెరికా తమ్ముడు ఒకటే గోల" అన్నదొకామె.

"ఈ ముక్క మూడేళ్ళ నుంచి చెబుతూనే ఉన్నారు మీరు." ఎకసక్కెంగా అన్నది పక్కన కూర్చున్న స్త్రీ రత్నం.

మళ్ళీ ప్రసారాలు ఆరంభమయ్యాయి.

"అమెరికా అంటే పక్కనే ఉందా? దూరాభారం. చీటికి మాటికి వస్తారా ఏమిటి?" వ్యంగ్యాస్త్రం విసిరింది మరొకామె.

"అమ్మా... మీరు నోరు మూసుకుంటే ప్రోగ్రామ్స్ వింటా." చిరాగ్గా అన్నాడు వెనక కూర్చున్న తాతయ్య.



పాలబ్బాయి వచ్చి పాలు పోయించుకోమని ఎన్నిసార్లు కేకలు పెట్టినా ఎవరూ వినిపించుకోలేదు - అలా పిలుస్తూనే వున్నాడతను. చిరాకెత్తి 'అక్కడ పెట్టు' అంటూ అరిచారందరూ ఏకగ్రీవంగా.

* * *

క్యాష్ కౌంటర్లో కూర్చున్నాడు బాలాజీ. సాయంత్రం ఐదు గంటలైంది. లక్షరూపాయలు తీసుకున్న పెద్దమనిషి జాడ లేదు. బ్యాంకు క్లోజ్ చేసేలోగా డబ్బు జమ వెయ్యాలి!

మేనేజరు కూడా లేడు. కొండయ్యను పలకరించాడు బాలాజీ. "గోడౌ ఇన్‌స్పెక్షన్‌కెళ్ళాడు కదా. వచ్చేస్తాడ్లే" అన్నాడు కొండయ్య.



ఇంతలో మేనేజర్ రానే వచ్చాడు. ఆయన దగ్గరకు పరిగెత్తాడు బాలాజీ.

"సార్... ఆయనింకా రాలేదు. ఐదైపోతున్నది." అన్నాడు.

"ఎవరు?" ఏమీ ఎరగని వాడిలా అడిగాడు మేనేజర్.

"అదే సార్... పెద్ద మీసాలు, పెద్ద జుట్టు ఉన్నాయన."

"మీసాలేంటి? జుట్టేంటి? ఎవరయ్యా?"



"అదే సార్... పొద్దున మనం లక్ష ఇచ్చాం కదా.... మధ్యాహ్నం రెండు లోపల......

"మనమా?.... మన మేంటి? లక్షేంటి? ఏంటయ్యా నీ నస?" విసుక్కున్నాడు మేనేజర్.

"అదేంటి సార్? పొద్దున మీరు గదిలోకి పిల్చి ఆ పెద్దాయన డి.డి. తెచ్చాడు. లక్ష రూపాయలిమ్మన్లేదూ?" ఆందోళనగా అన్నాడు బాలాజీ

"వాట్ నాన్సెన్స్? నేను సరదాగా లక్ష రూపాయలు అప్పిమ్మన్నానా?

నువ్విచ్చావా? ఏదీ... ఆ డీడీ చూపించు? కోపంగా అన్నాడు మేనేజర్.

బాలాజీకి చెమటలు పోశాయి. "అదేంటి సార్? పాతిక లక్షల డీడీ మి దగ్గరే ఉంది కదా" కీచు గొంతుకతో అన్నాడు.

మేనేజర్ రెచ్చిపోయాడు "ఏయ్..బాలాజీ. పిచ్చెక్కిందా? తాగి వాగుతున్నావా?" అరిచాడు.

"నా బిడ్డల మీద ఒట్టు సార్.... ఆయనెవరో నాకేం తెలుసు? రెండింటి కల్లా తిరిగి ఇచ్చేస్తారని మీరే కదా చెబుతా!?" కన్నీళ్ళు ఉబుకుతున్నాయి బాలాజీకి.

సిబ్బంది అందరూ వీరి వాదాన్ని వింతగా చూస్తున్నారు.

"బ్యాంకులో డబ్బు కొట్టేసి బిడ్డల మీద ఒట్టేఁవిటయ్యా? నువ్వేదో పెద్ద డ్రామా ఆడుతున్నావు." అన్నాడు మేనేజర్.

కొండయ్య వైపు తిరిగాడు బాలాజీ. "సార్... నిజమండీ. ఫోన్ చేసి లక్షా పత్రమన్నారు. ఆయనిచ్చిన డీడీ నా దగ్గరుంది. ఈ లక్ష రూపాయలు ఆయన కిమ్మంటేనే" చెప్పాడు దీనంగా.



'పగవాడిని పంచాంగ మడిగితే మధ్యాహ్నానికి మరణం తథ్యం' అన్నాట్ట! బాలాజీ కొండయ్యకు చెప్పటం కూడా అలాంటిదే మరి.

"బాలాజీ... ఇదేం బాగాలేదు వాయ్.... అబద్ధమాడితే గోడలా ఉండాలి ఇలా తడకలా కాదు." అన్నాడు కొండయ్య.

మేనేజర్ మరింత రెచ్చి పోయాడు. "మధ్యలో నాకు ఉచ్చు బిగిస్తున్నాడు ఇపుడు కౌంటర్లో లక్ష రూపాయలు తక్కువైందా? ఎవరికిచ్చావో చెప్పు. ఏం చేశావు? ఎక్కడ దాచావు? తియ్యి. లెక్క తియ్" గద్దించాడు.

బాలాజీకి వళ్ళు తెలియని ఆవేశం ముంచుకొచ్చింది. "రేయ్" అంటూ మేనేజర్ కాలర్ పట్టుకున్నాడు. "రాస్కెల్... నన్ను ముంచేస్తావా? చెప్పు... చంపేస్తాను. నువ్విమ్మ న్లేదూ?" గొంతుపట్టుకుని అరిచాడు. చిన్న ఘర్షణ జరిగింది. బాలాజీ తోసిన తోపుకు మేనేజర్ కింద పడ్డాడు నుదురు చిట్లి రక్తం కారింది.



"అయ్య బాబోయ్...బ్లడ్డు... నెత్తురు..... చంపేశాడు దేవుడోయ్." ఏడుపుగొంతుతో అన్నాడు మేనేజర్.

అందరూ అతని చుట్టు మూగి సపర్యలు చెయ్యసాగారు.

"రేయ్.... నన్ను దొంగంటావురా? నాకు ఉరి బిగిస్తావురా? నా హిస్టరీలో.. నా పాతికేళ్ళ సర్వీసులో ఎన్నడూ ఇలా జరగలేదు. పిలవండి పోలీసులను. పిలవండి పోలీసులు.... పోలీసులు.... " ఫోన్ డయల్ చెయ్యసాగాడు.



కొండయ్య అడ్డుకున్నాడు. "సార్... వదిలెయ్యండి. పాపం పిల్లలు గలవాడు." వారించాడు.

"పిల్లలగలవాడైతే చంపేస్తాడా?" అన్నాడు మేనేజర్. జరిగిన సంఘటనకి అవాక్కై పోవటం మినహా ఏమీ చెయ్యలేక పోతున్నాడు బాలాజీ...

* * *

ఇంట్లో ఝాన్సీ... పిల్లలు.... బాలాజీ కోసం ఎదురు చూస్తున్నారు. "డాడీ ఇంకా రాలేదేంటమ్మా...." అడుగుతున్నారు పిల్లలు.

చీకటి పడింది. ఇరుగు పొరుగులంతా టీవీముందు నుంచి అంగుళం కూడా కదలడం లేదు. ఝాన్సీకి కూడా ఆందోళన గానే ఉంది. "వస్తారమ్మా... నాన్నగారికి ప్రమోషనొచ్చింది కదా. ఆయనకు పెద్ద సింహాసనం మీద కూర్చోబెట్టి దండలు వేసి స్వీట్లిచ్చి చప్పట్లు కొడతారు. పల్లకీలో కూర్చోబెట్టి ఊరేగిస్తారు. అప్పుడొస్తారు." సర్దిచెప్పింది.



పిల్లలు నిద్రలోకి జారుకుంటున్నారు. ఇంటి నిండా జనం ఉండటంతో పెరటిదోవన పిల్లల్ని తీసుకువెళ్లి నిద్ర పుచ్చింది.

* * *

స్టాఫ్ అందరి ముందు ముద్దాయిలా కూర్చున్నాడు బాలాజీ. తలకు కట్టు కట్టుకుని మేనేజర్ నిలదీస్తున్నాడు.

"దొంగతనంగా బ్యాంకు డబ్బు బయటకు చేరేశావు. ఆ నేరం మేనేజర్ మీద తొయ్యా లని చూశావు. డ్యూటీలో ఉన్న ఆఫీసర్ని దౌర్జన్యంగా కొట్టి గాయ పరిచావు. నిన్ను గంట క్రితమే జైల్లో పెట్టించేవాడిని. కొండయ్య గారు వాళ్లు నువ్వు పిల్లలు గల వాడివని దయతలచి నన్నాపారు. ఇంత జరిగినా నువ్వు డబ్బేం చేశావో చెప్పడం లేదు." అన్నాడు.



ఇంతలోనే అనుకోని సంఘటన జరిగి బాలాజీని మరింత ఇబ్బందిలో పడేసింది.

ఆ వ్యక్తి ఆ సమయంలో అక్కడికి రావడం బాలాజీకి దిగ్భ్రాంతి కలిగించింది. అతను బాలాజీకి టీవీ అమ్మిన షాపువాడు. పరుగు పరుగున బాలాజీ దగ్గరకొచ్చాడు.

"బాలాజీగారూ.... నమస్తే. టీవీ,మీరు దరిమిలా చెప్పిన వీసీపీ, పన్నెండు టేపులు అన్నీ ఇంట్లో డెలివరీ ఇచ్చాం. మేమే అమర్చి, కనెక్షనిచ్చాం. బొమ్మ బ్రహ్మాండం. మీ ఇల్లు సినిమా హాల్లాగా ఉంది సార్...." చెబుతున్నాడు సంతోషంగా.



అందరూ అతని వైపు వింతగా చూశారు. అతను మాత్రం ఎవరినీ పట్టించుకోకుండా తన ధోరణిలో చెప్పుకుపోతున్నాడు. "బై ది బై...వీడు నా బావ మరిది. టీవీ కవర్లు అమ్ముతుంటాడు." అని రెండు కవర్లు చూపించి "ఇది ఏభై, ఇది ఏభై రెండు. మీరు రెండు సెట్లు కొంటే ఒకటి క్లీనింగ్‌కిచ్చినా రెండవది వాడుకోవచ్చు. రెండూ కలిపి నూట రెండు రూపాయలు. మీరు కాబట్టి వంద రూపాయలకే ఇచ్చేస్తా. ఎమౌంట్ మనం చూసుకుందాం. ముందు ఇంటికెళ్లాను. మీరిక్కడుంటారని చెప్పారు. వస్తానండీ" అంటూ వెళ్లిపోయాడు.



బాలాజీ నోట మాట రాలేదు. అందరి దృక్కులు విల్లమ్ముల్లా బాలాజీ వైపు మళ్లాయి. అసలే బ్యాంకు డబ్బు కాజేశాడని నిందపడ్డ సమయంలో షాపతను అలా రావడంతో అందరికీ బాలాజీ మీద అనుమానం ధృవపడింది. ఏం చెప్పాలో తోచలేదు బాలాజీకి. అంతలోనే షాపతను మళ్లీ లోపలికి వచ్చాడు. "అన్నట్లు మీరు క్యాషియరయ్యారట కదా. కంగ్రాచ్యులేషన్స్" షేక్ హాండిచ్చి వెళ్లిపోయాడు.

-(ఇంకావుంది)

అలనాటి ఆణిముత్యాల గురించి
నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే

క్లాసిక్స్ రీటోల్డ్

# నవ్వుటద్దాలు

- ఆచార్య తిరుమల

# కవుల శాపాలు




**మా**టవిలువని బట్టి మనిషి విలువ, నిర్మలమైన హృదయం, నిశ్చలమైన భావం, ప్రగాఢమై న దైవభక్తి, సదాచార సంపన్నత గల వారి మాటకి శక్తి ఎక్కువగా ఉంటుంది. వారేమంటే అది అవుతుంది.వారు నొచ్చుకుంటే శాపం అవుతుంది. మెచ్చుకుంటే వరం అవుతుంది. ఇంచుమించు పూర్వకవులంతా సాధుపుంగవులు,సదాచార సంపన్నులు. వారి వాక్కు అమోఘంగా వుండేది. వారి శబ్దశక్తి నిరుపమానంగా వుండేది. వారు శాపానుగ్రహదక్షులై వుండేవారు. అలాంటి కొంతమంది కవుల్ని మీకు పరిచయంచేస్తాను.

పద్యలక్షణాన్ని గూర్చి వివరించే శాస్త్రం ఛందస్సు. ఇది గురు, లఘువులతో కూడిన గణాలతో, యతి ప్రాసాదులతో ఏ పద్యమెలా వుండాలో తెలియజేస్తుంది. అయితే, అక్షరాల్లో విషమాక్షరాలు, అమృతాక్షరాలూ వుంటాయి. పద్యపాదాల్లో విషమస్థానాలు, అమృత స్థానాలూ అని వుంటాయి. వాటిని దృష్టిలో పెట్టుకుని కవి జాగ్రత్తగా అక్షర నిబద్ధ శబ్ద ప్రయోగం చెయ్యాలి. లేకపోతే అది శాపమై, ప్రాణాంతక మవుతుంది.

"పురాస్త్రరనగిరి రుద్రే ష్వకచటహ మాతృకా నింద్యాః" అని పద్య ప్రథమ పాదంలో 3,5,6,7,11 స్థానాల్లో "అ,క,చ,ట,హ" వర్ణాలుంచి పద్యం రాస్తే- అవి విషమాక్షరాలై, పద్యం శాపమై తగుల్తుంది. అలాగే -

**హాజగడలివి మూడవచో**
**నిజముగ నిందించి చెప్ప నీల్గుట యరుదే**
**భుజగమున కన్న గీడగు**
**సుజనా మర భూజరేచ సుగుణ సమాజా!!**

మూడో చోట 'హజగడ'లు "ఆఅవ కడ'తా' నిల్పిన మాఅమ్మున, గ్రుమ్మునట్లు మడియు మనుజుడున్" అని ఆరవచోట 'త' కారం, "మగణమ్ముఁ గదియ రగణము, వగవక కృతి మొదట నిలువువానికి మరణంబగు"నని కావ్య ప్రారంభంలో మగణంపై రగణం ఉంచి పద్యం రాస్తే - చావటం ఖాయం. ఆ ప్రయోగాలంత సద్యోమృత్యుప్రదాలుగా ఉంటాయి. కాబట్టి, సత్కావ్యాల్లో విషమాక్షర ప్రయోగాలు చేయరాదని లాక్షణికులు శాసనం చేశారు. ఆదికవి నన్నయ భారత కావ్యాది ప్రార్థనా శ్లోకంలో "శ్రీ వాణీ గిరిజాశ్చిరాయ" అని 7వ స్థానంలో 'చ' కారం నిల్పటం చేత భారత రచనకు విఘ్నం కలిగిందని, నన్నె చోడుడనే రాజకవి తన కుమార సంభవ కావ్యాన్ని "శ్రీ వాణీం ద్రామరేం ద్రార్చిత" అని మగణం తర్వాత రగణం ఉండే స్రగ్ధరా వృత్తంతో ప్రారంభించటం వల్ల యుద్ధంలో దారుణంగా మరణించాడని చెప్తారు. ఇలా ఎన్నెన్నో ఉదాహరణలున్నాయి.



శాపానుగ్రహ దక్షులైన కవుల్లో వేములవాడ భీమకవి అగ్రగణ్యుడు. ఒకసారి ఈ కవిని చాళుక్య చొక్కరాజు 'నీ పేరేమి'టని అడిగినప్పుడు సమాధానంగా ఈ పద్యం చెప్పాడు:-

**గడియలోపలఁ దాడి కడగి ముత్తునియగాఁ**
**దిట్టిన మేధావి భట్టు కంటె**
**రెండు గడెల బ్రహ్మదండి ముండ్లన్నియు**
**డుల్లఁ దిట్టిన కవి మల్లుకంటె**
**మూఁడు గడియలకు మొనసి యత్తిన గండి**
**పగుల దిట్టిన కవి భాను కంటె**
**అఱ జాము లోపలఁ జెఱువు నీళ్లింకంగ**
**దిట్టిన బడబాగ్ని భట్టుకంటె**
**ఉగ్రకోపి నేను నోపుదు శపియింప,**
**గ్రమ్మ తీంప శక్తి గలదు నాకు**
**వట్టి మ్రాన చిగురుఁ బుట్టింప గిట్టింప**
**బిరుదు వేములాడ భీమ కవిని!!**

ఇలాంటి సమాధానాలు రాజుల సమక్షంలో చెప్పటానికి చాలా ఆత్మవిశ్వాసం కావాలి; అప్రతిహతమైన వాక్శక్తి కావాలి. ఈ పద్యంలో మేధావి భట్టు, కవి మల్లుడు, భానుకవి, బడబాగ్ని భట్టులున్నారు. మేధావి భట్టు 15 వ శతాబ్దివాడు. పెద్దతిమ్మ భూపాలుడి మీద పద్యం రాయాలను కుంటే తన చేతిలో తాటాకు లేదు. ఎదురుగా తాటి చెట్టుంది. దాన్ని మూడు ముక్కలై కూలిపొమ్మని

**సాళువ పెద తిమ్మ మహీ**
**పాల వరుఁడు వీడె వచ్చెఁ బద్యము వ్రాయన్**
**కేలను లే దాకొకటియుఁ**
**దాళమ ముత్తునియ లగుచు ధరపైఁ బడుమా!**

అనే సరికి ఆ చెట్టు విరిగి కూలిపోయిందట! అలాగే కవి మల్లుడు కూడా 15వ శతాబ్ది ప్రౌఢకవి. రుక్మాంగద చరిత్ర రాశాడు. ఇతని కొకసారి బ్రహ్మదండి ముల్లు గుచ్చుకునే సరికి ఆ చెట్టునుండి ఆ ముళ్లు రాలిపోవాలని-

**గుడియన్న నృపతిఁ బొడగన**
**నడవంగాఁ గొండపల్లి నగరి పడమటం**
**గుడి యడుగు మడమగాఁడిన**
**చెడు ముండులు బ్రహ్మదండి చెట్టున డుల్లున్!!**

అని పద్యం చెప్పేసరికి జలజలా ఆ బ్రహ్మదండి ముళ్లన్నీ నేల రాలిపోయాయట! భానుకవిని గూర్చి తెలియరాలేదు గానీ బడబాగ్ని భట్టు మాత్రం 15వ శతాబ్ది వాడు. ఇతడొకసారి త్రిపురాంతకం నుండి శ్రీశైలానికి వెళ్తూ దారిలో తెలుగు రాయలు కట్టించిన చెరువులో స్నానానికి దిగాడు. స్నానం చేసి సూర్యునికి అర్ఘ్య ప్రదానం చేస్తుండగా తన వ్రేలి ఉంగరం జారి నీళ్లల్లో పడిపోయింది. ఆ ఉంగరం కోసం ఆ చెరువునీళ్లు నాలుగు ఘడియల్లో ఇంకిపోవాలని సంకల్పించి-

**బడబానల భట్టారకు**
**కుడి చేయుంగరము రవికి గొబ్బున నర్ఘం**
**బిడు వేళ నూడి నీలో**
**బడియెఁ దటాకంబ నీటిఁ బాయుమ వేగన్!!**

అనేసరికి ఆ చెరువు నీళ్లింకిపోయి, ఉంగరం బైట పడిందట! 18 వ. శతాబ్దిలో తురగా రామకవి అని ఒక శాపానుగ్రహ దక్షుడైన కవి ఉండేవాడు. అతడు దేశాటనం చేస్తూ సంవత్సరాని కొకసారి రాజుల్ని దర్శిస్తూ బహుమానాలందు కుంటూ వుండేవాడు. అలాగే ఒకసారి, పెద్దాపురం ప్రభువైన వత్సవాయ తిమ్మజగపతిని దర్శించి బహుమానమందుకొని, అచిరకాలంలోనే రెండోసారి వచ్చేసరికి రాజు దర్శన మివ్వక నిరాకరించి, అనాదరించేసరికి కోపగించుకుని కోటగోడ మీద బొగ్గుతో "పెద్దమ్మ నాట్యమాడును దిద్దిమ్మని వత్సవాయి తిమ్మని యింటన్" అని రాయబోగా రాజుకి తెలిసి పరుగెత్తు కుంటూ వచ్చి కాళ్లమీద పడి శాంతింప జేసే సరికి-

**అద్దిర! శ్రీ భూ నీలలు**
**ముద్దియ లా హరికి గలరు ముగురమ్మలలో**
**పెద్దమ్మ నాట్యమాడును**
**దిద్దిమ్మని వత్సవాయి తిమ్మన యింటన్!!**

అని రాసి "ఈ శాపం నీ కాలంలో కాదు నీ మనుమని కాలంలో జరుగుతుంది" అని చెప్పి వెళ్లిపోయాడు. ఆ వశ్యవాక్కు మహిమేమిటో గానీ ఆ రాజు మనుమని కాలంలోనే పెద్దాపురం సంస్థానం పతనమై పోయింది. అక్కడ గర్భ దరిద్రం తాండవించడం మొదలు పెట్టింది.

"సూరకవి తిట్టు కంసాలి సుత్తి పెట్టు" అనే సామెతని సృష్టించిన



వరకవి, ఆశుకవి- అడిదం సూరకవి. 18వ శతాబ్ది విజయ నగర సంస్థాన పూసపాటి విజయరామ మహారాజుకి ఆశ్రితుడు, ఆస్థాన కవి. కవిజనరంజనం, చంద్రాలోకం, కవిసంశయ విచ్ఛేదం, రామలింగేశ శతకం, ఆంధ్రనామశేషం, శ్రీరామ దండకం వంటి అనేక ఉత్తమ రచనలు చేశాడు. శాపానుగ్రహ దక్షుడైన యీ కవి తనను గూర్చి తా నిలా చెప్పుకున్నాడు:-

**గడియకు నూరు పద్యములు గంటములేక రచింతు తిట్టగా**
**దొడగితినా పెరిల్లుమని దొర్లిపడున్ కులశైల రాజముల్**
**విడువ కనుగ్రహించి నిరుపేద ధనాధిప తుల్యు జేతునే**
**నడిదము వాడ సూరన సమాఖ్యుడ నా కొకరుండు సాటియే?**

ఇతనికి శాపశక్తి చాలా వుందనటానికి ఎన్నో నిదర్శనాలున్నాయి. ఒకసారతణ్ణి సవరయ్య అనేవాడు కోపంతో "వీణ్ణి పాం గరవ" అని దురుసుగా తిట్టాడట. వెంటనే సూరన "ఆ పామే నిన్ను గరవ అయ్యో సవరా!" అని శపించే సరికి ఎక్కడనుండో త్రాచుపామొకటి బుసబుసా వచ్చి సవరయ్యను కాటేయటం వాడు చావటం జరిగిపోయాయట! అలానే ఓ రోజు సూరన ద్వారపూడి వెళ్లి, ఎండకు అలిసి మజ్జిగ యిమ్మని అడిగితే ఏ యింటి వాళ్లూ మజ్జిగ ఉంచుకుని యివ్వలేదట. దాంతో కోపగించి "దూరమైపోయెరా పాడి ద్వారపూడి" అని శపించేసరికి సాయంత్రానికి పశువులేవీ పాలివ్వలేదట. సంగతి తెలిసి గృహస్థులు వచ్చి వేడుకుంటే శాపం త్రిప్పగానే అవి పాలివ్వటం జరిగిందట! మరో రోజున మరడాం గ్రామంలో తోటలో బస చేసి భోజనం చేయటానికని కూరాకుల మల్లయ్య అనే వాణ్ని ఓ అరిటాకు అడిగితే 'ఛీ పొ'మ్మని చుల్కనచేశాడట. దాంతో సూరన కోపంతో "కూరాకుల మల్లిగాడు కూలున్ నూతన్" అని శపించగానే వాడు ఏతామేసేటప్పుడు కాలుజారి నూతిలో పడి చచ్చాడట! నేటికీ మరడాం దగ్గరున్న యీ నూతిని సూరన్న గారి నుయ్యి అని పిలుస్తారు.




అడిదం వంశీయుడు, సూరకవికి తండ్రి వరుస వాడైన అడిదం రామకవి కూడా గొప్ప వాక్శక్తి గలవాడు. దంతులూరి అన్నమరాజనే గుత్తదారుడు తమ రేగ గ్రామ మాన్యం నుండి అక్కడి నోముల చెరువు మురుగునీరు పోనీక అడ్డుకట్టి చిక్కులు పెడుతుంటే రామకవి మోకాలి బంటిలో తన మాన్యంలో నిలబడి ఐదు తాటాకులు తీసుకుని ఒక్కొక్క తాటాకు మీద "బ్రహ్మాండ భాండ సంపత్తి కుక్షినిగల్గు", "ఆది భిక్షుం డీతడని రోసి", "భావింప నిలువెల్ల భాంగంబులే కాని", "పచ్చి మాంసము కల్లు భక్షించి మత్తెక్కి", "కృతకాద్రు లాయెనా కీలో్గ్ర ఫణి ఫణా" అనే ఐదు సీస పద్యాల్ని "కదలు మిట మాని దివిజ గంగా భవాని!" అనే మకుటంతో రాసి ఆ చెరువు నీటిలో పడేయగానే ఆ రాజు కట్టిన అడ్డుకట్ట తెగి నీరంతా పల్లానికి ప్రవహించుకుంటూ పోయిందట!

నేను మొదట్లో ప్రస్తావించిన, వేములవాడ భీమకవి 12 వ శతాబ్దివాడు. త్రికాల వేది. భీమేశ్వరస్వామి అనుగ్రహానికి పాత్రుడై అమోఘ వచస్కుడయ్యాడు. నిగ్రహానుగ్రహశక్తి యితని విశిష్టత. ఇతడు బాల్యంలో వేములవాడలోని ఒక బ్రాహ్మణ చయనుల యింట శుభ కార్యమేదో జరిగి భోజనాలకు పంక్తి నేర్పాటు చేసుకుంటే తను కూడా స్నేహితులతో వెళ్లి భోజనం పెట్టమంటే ఆ యింటిపెద్ద తిట్టి బైటకి వెళ్లగొట్టాడట. భీమన వాకిటి తలుపు సందులోంచి వడ్డించిన విస్తళ్లను చూసి-

**గొప్పలు చెప్పకొంచు నను గూటికిఁ బంక్తికి రాకుమంచు నీ**
**త్రిప్పడు బాపలందరును దిట్టిరి కావున నొక్కమారు నీ**
**యప్పములన్ని కప్పలయి యన్నము సున్నము గాగ మారుచున్**
**బప్పను శాకముల్ పులుసు పచ్చడులుం జిలు రాలు గావుతన్!!**

అని శపించగానే అన్నం సున్నమై, కూరలు, రాళ్లయి, అప్పాలు కప్పలై ఎగురుతుండటంతో ఇంటి పెద్ద తెల్లబోయి తోటి బ్రాహ్మణులతో వచ్చి భీముని మహిమ గుర్తించి ప్రార్థించగా దయదలిచి "నన్ గౌరవంబున నీ విప్రులు నూచిరందువలనన్ పూర్వస్థితిం జెంది భోజన వస్తు ప్రకరంబులన్నియు యథా స్వస్థంబు లౌ గావుతన్" అని శాపోపశమనం చేసి వారి విందారగించి వెళ్లాడట. భీమకవి ప్రభావాన్ని ప్రత్యక్షంగా చూడాలనుకున్న చాళుక్య చొక్కరాజు తోటలో తను కాలు చాచుకొని కూర్చున్న మల్లెసాలె స్తంభాన్ని మహావృక్షం చేయమని తనను చూడవచ్చిన భీమకవిని కోరాడట. వెంటనే భీమన:-

**ఆనీ తా భ్యుపదాన శృంఖల పదాభ్యాలంబిత స్తంభమా!**
**నేనే వేములవాడ భీమకవి నేనిన్ చిత్ర కూటంబులో**
**భూన వ్యాప్తత పల్లవోప లతికా పుష్పోప గుచ్ఛంబులన్**
**నానా పక్వ ఫల ప్రదాయి వగుమా నా కల్ప వృక్షాకృతిన్!!**

అనే పద్యం చెప్పేసరికి ఆ స్తంభం మహావృక్షమై అందులో రాజు కాలు ఇరుక్కుపోయి లబోదిబో మని వృక్షాన్ని స్తంభం చేసేయమని కోరాడు. భీమన నవ్వి- "కుంభిని చొక్క నామ నృప కుంజరు పందిటి మల్లెసాలకున్, స్తంభము రీతి నీ తనువు దాలిచి యెప్పటియట్ల యుండుమా" అనగానే ఆ చెట్టు స్తంభమై రాజు కాలూడి బైట పడి గండం గడిచిందట!



ఒకసారి భీమకవి రాజ కళింగ గంగుని దర్శించటానికి వెళ్లే

'పనిలో వున్నాను, పొ'మ్మని అనాదరించ గానే-

**వేములవాడ భీమకవి వేగమె చూచి కళింగ గంగు తా**

**సామము మాని కోపమున సందడి తీరిన వెన్క రమ్మనెన్**

**మోమును జూడ దోస మిఁక ముప్పది రెండు దినంబులావలన్**

**జామున కర్థమందతని సంపద శత్రుల పాలు గావుతన్!!**

అని శపించేశాడు. శాపం ఫలించి 32 రోజులకి అకస్మాత్తుగా శత్రువులు దండెత్తి వచ్చి గంగు నోడించి, వెళ్లగొట్టి రాజ్యాన్ని ఆక్రమించేశారు. గంగు బిచ్చమెత్తుకు తిరుగుతూ ఒకనాటి రాత్రి చీకట్లో కాలుజారి భీమకవి యింటి ముందు గోతిలో పడి "ఛీ! కాలి దివ్విటీ లేని జన్మమేల" అన్నాడట. భీమకవి ఆ మాట విని "ఎవ్వడవురా నీ"వని గద్దించగానే "భీమకవి చేసిన జోగి"నని భీమకవిని గుర్తించి రక్షించుమని కాళ్లమీదపడి వేడుకున్నాక- కళింగ గంగు పశ్చాత్తాపాన్ని గుర్తించి భీమకవి-




**వేయి గజంబులుండ పదివేల తురంగము లుండ నాజిలో**

**రాయల గెల్చి సజ్జనగరంబునఁ బట్టము గట్టుకో వడిన్**

**రాయ కళింగ గంగు! కవిరాజు భయంకర మూర్తిఁ జూడఁడాఁ**

**బోయిన మీన మాసమునఁ బున్నమ వోయిన షష్ఠి నాటికిన్!!**

అని ఆశీర్వదించాడు. ఆ వచన ప్రభావంతో కళింగ గంగు భాగవతులతో వెళ్లి తటాలున ఖడ్గంతో రాయల తల నరికి సరిగ్గా అదే తిథి నాడు సింహాసనాన్ని అధిష్ఠించాడట.

భీమకవి ఒకప్పుడు గుడిమెట్ట గ్రామానికి వెళ్తే, ఆ వూరి ప్రభువు సాగి పోతురాజు ఇతని పంచకళ్యాణి గుర్రాన్ని పట్టి, తన గుర్రపు శాలలో కట్టించి, ఎంత వేడినా విడిచిపెట్టకపోయే సరికి కోపించి- ఆ సంఘటనని రామాయణ కథగా సంకల్పించి-

**హాయమది సీత, పోత వసుధాధిపుడారయ రావణుండు, ని**

**శ్చయముగ నేను రాఘవుడ, సహ్యజ వారిధి, మారు దంజనా**

**ప్రియ తనయుండు, లచ్చన విభీషణుఁ డా, గుడిమెట్ట లంక, నా**

**జయమును పోత రక్కసుని చావును నేడవనాడు చూడుడీ!!**

అని పద్యం ప్రథమ పాదం 6వ చోట 'త' కారముంచి విషమాక్షర ప్రయోగం చేసి శపించాడు. ఏడవనాడా పోతురాజు గుండాగి చచ్చాడు.

ఇలాగే, సాహిణి మారుడనే దండనాథుడు చాళుక్య చొక్కరాజు నెదిరించినప్పుడు భీమకవి ప్రభుభక్తితో

**చక్కదనంబు దీవి యగు సాహిణి మారుడు మారుకైవడిన్**

**బొక్కి పడంగలండు చలమున్ బలమున్ గల యా చళుక్యపుం**

**జొక్కనృపాలుడుగ్రుడయి చూడ్కుల మంటలు రాలఁ జూచినన్**

**మిక్కిలి రాజ శేఖరుని మీదికి వచ్చిన రిత్త వోవునే?**

అని పద్య ప్రథమ పాదం 11 వ చోట 'హ' కారముంచి శపించేసరికి మూడు గడియల్లో మారన చచ్చి చొక్కరాజుకు జయం కలిగిందట!

ఒకనాడు భీమకవి వస్తూవుంటే చూసి, తననేమి అడుగుతాడోనని పోతరాజనే వాడు భార్యతో 'లే'డని చెప్పించాడట. ఆ కుయుక్తిని కనిపెట్టి-

**కాటికి కట్టెలు చేరెను, నేటావల నక్కలన్ని యేడువ సాగెన్**

**కూటికి కాకులు వచ్చెను, లేటవరపు పోతరాజు లేడా? లేడా?**

అని ప్రశ్నిస్తూ శపించి వెళ్లిపోగానే వాడు కూర్చున్న మంచం మీదే ప్రాణం పోయి, వొరిగిపోయాడు. బంధు మిత్రులంతా ఒక్కసారిగా ఘొల్లు మన్నారు. పోతరాజు భార్య పరుగు పరుగున వెళ్లి భీమన కాళ్లమీద పడింది. "దీర్ఘ సుమంగలీ భవ!" అని దీవించి, జరిగింది తెలుసుకుని- అతని పాడె దగ్గరకు వెళ్లి-

**నాటి రఘురాము తమ్ముడు, పాటిగ సంజీవి చేత బ్రతికిన భంగిన్**

**కాటికఁ బో నీ కేటికి? లేటవరపు పోతరాజ! లెమ్మా! రమ్మా!!**

అనగానే పోతరాజు నిద్రలేచినట్టు లేచి భీమన కాళ్లమీద పడ్డాడట. ఉద్దండుడైన యీ భీమకవిని చూస్తే రాక్షసుణ్ని చూసినట్టే వుండేదట. అందుకే అందరూ ఇతన్ని దక్షవాటి కవి రాక్షసుడంటారు. ఇతడు కవి జనాశ్రయమనే ఛందోగ్రంథాన్ని, రాఘవ పాండవీయమనే ద్వ్యర్థి కావ్యాన్ని రాశాడంటారు గానీ యితని రచన లేవీ మనకు దొరకలేదు. శాపానుగ్రహ శక్తి గల కవుల చాటు పద్యాలు చాలా వున్నాయి. నిజానికి తిట్టువేరు, శాపం వేరు. కోపంలోంచి తిట్టు వస్తుంది. అది శాపంగా పరిణమించవచ్చు కానీ శాపం ఆత్మాఘాతం నుండి భవిష్యద్దర్శనంతో వస్తుంది. దానికి తిరుగులేదు. ఆది కావ్యమైన వాల్మీకి రామాయణమే

**మా నిషాద ప్రతిష్ఠాంత్వ మగమ శ్శాశ్వతీస్సమాః**

**యత్ క్రౌంచ మిథునా దేక మవధీః కామ మోహితమ్!!**

అని క్రౌంచపక్షుల్లో ఒక దాన్ని కూలనేసిన బోయని వాల్మీకి శపించిన శ్లోకం నుండే పుట్టింది. వాల్మీకి వారసత్వం సాహిత్యంలో చాలా వుంది. కాబట్టి, శక్తిమంతులైన కవుల్ని అవివేకంతో చుల్కన చేసి కష్టపెట్టకుండా వుండటం మంచిది. ●



## కొంటెకొశ్చెన్లు - తుంటరి జవాబులు




**బి. చైతన్య - చందానగర్**

ప్ర: లెక్కల్లో కనబడని భిన్నం?

జ: చిన్నాభిన్నం

**ఎం.రాణి - రుక్మాపూర్**

ప్ర: మొగుడయ్యేసరికి మగాడు ఎందుకు మారిపోతాడు?

జ: అక్షరాల పరంగానే కాకుండా అక్షరాలా కూడా కొమ్ములొస్తాయి కాబట్టి

**రమణశాస్త్రి - సంగారెడ్డి**

ప్ర: అనుకూల శత్రువు అంటే ఎలా వుంటాడు?

జ: మనం చెప్పిన జోకు మన సొంతం అని తెలియనప్పుడు విరగబడినవ్వి మనదని తెలిశాక 'అలావుంటే బావుంటుంది ఇలా వుంటే బావుండేది' అని సలహాలిచ్చేవాడు.

## పేరు - రిపేరు




ఆమె - పుణ్యస్త్రీ - అవునా - ఐతే - ఉండమ్మా బొట్టు పెడతా

పెళ్ళాంతో పనేంటి - ఓరి నీ ప్రేమ బంగారం కానూ

**- పద్మజా ప్రభాకర్, నందిగామ.**

వినాయక చవితి - గణపతి - పండుగ

**- దేవులపల్లి రామమూర్తి, విజయవాడ.**

## ఈ రూటేవేరు




Our Gift = మన వరాలు

**-ముని శ్రీలత, రేపల్లె**

Onida = ఓ నీడ

**- టి. చందన్, పూణె**

ఐడెంటింటీ = కంటికి, పంటికీ బాధ కలిగితే టీ తాగడం

**-బి.వి.రావు, రుద్రారం**



## చిలిపి లిపి




In Milk = లోపాలు

వైదేహి = ఎందుకు అడుక్కోవడం

**-వై. ధీరజ్‌కుమార్, నందిగామ**

Line Labour = గీత కార్మికుడు

**- మేడా మస్తాన్‌రెడ్డి, పూణె**

## డబుల్ రోల్




మీ గోలేంటి అని అడుగుతుంటే చెప్పకుండా మధ్యలో మీ గోలేంటి?

**- బి.వి.రావు, రుద్రారం**

ఆ 'జులపాలవాడు' మన 'మంజుల పాలవాడు'

**- బి.శ్రీనివాస్ చారి, హైదరాబాద్.**

ముందు నన్ను (మార్కులలో) మించు ఆ తర్వాతే ప్రేమించు

**- బోడపాటి కృష్ణవేణి, చెన్నై**

## షార్ట్‌కట్స్




| | | |
|---|---|---|
| నిండల గిరిజ | = | నింగి |
| నేమాని లక్ష్మి | = | నేల |
| గాదె లిల్లీ | = | గాలి |
| వాముల నర్సమ్మ | = | వాన |
| నీడల రుక్మిణి | = | నీరు |
| పైలా ముత్యం | = | పైత్యం |
| విన్నకోట కామేశ్వరం | = | వికారం |
| రోళ్ళ గంగన్న | = | రోగం |

**- తెలికిచర్ల రామకృష్ణ, విజయనగరం.**

## పేరడీ పేరేడ్



గాజువాక పిల్లా నే గంగిరెద్దును కానా
గాజువాక పిల్లా నే గంగిరెద్దును కానా
గాజువాక పిల్లా నే గంగిరెద్దును కానా
నువు గడ్డిపెట్టలేదా, నే కుడితి తాగలేదా
గాజువాకే పిల్లా మాది గంగిరెద్దునే పిల్లా నేను

సబ్బవరం పిల్లా నే సవటగాణ్ణి కానా
సబ్బవరం పిల్లా నే సవటగాణ్ణి కానా
సబ్బవరం పిల్లా నే సవటగాణ్ణి కానా
నువు సాచి కొట్టలేదా, నా పళ్ళు రాలలేదా
సబ్బవరమే పిల్లా మాది సవటగాడినే పిల్లా నేను

మువ్వలపాలెం పిల్లా నే ముష్టివోణ్ణి కానా
మువ్వల పాలెం పిల్లా నే ముష్టివోణ్ణి కానా
మువ్వల పాలెం పిల్లా నే ముష్టివోణ్ణి కానా
నే బిచ్చమడగలేదా, నువ్వు కుక్కనొదల లేదా
మువ్వల పాలెమే పిల్లా మాది ముష్టివోడినే పిల్లా నేను

**-తాళాభక్తుల లక్ష్మీప్రసాద్, విశాఖపట్నం.**

**('నువ్వునేను' చిత్రంలో 'గాజువాక పిల్లా' పాటకు పేరడీగా)**

## చిలిపి కవిత

రోడ్డు మీద కనిపించిన
రూపాయిని తీయ దలచి
వంగినంతలోనే
గ్రుద్దెనొక్క కారు నన్ను
మోకాలికి ఫ్రాక్చరయ్యె
మూతి పళ్ళు రాలిపోయె
రూపాయే కొంపముంచి
రూపాన్నే మార్చివేసె
ట్రాఫిక్‌లో ఆశపడకు
ట్రాపులోన కోరి పడకు

**టి.ఎల్.ప్రసాద్, విశాఖపట్నం**





(1813 - 1846)

# సంగీత 'సామ్రాట్టు' స్వాతి తిరుణాళ్




ఆధ్యాత్మిక రంగంలో ఆదిశంకరాచార్యులు....

హైందవ జాతి పునరుద్ధరణంలో వివేకానందుడు...

ఎలాగ కృషి చేసి ప్రాతః స్మరణీయులై అతి చిన్నవయస్సులోనే పరమేశ్వరుడిలో లీనమైపోయారో!...

అలాగే కేరళ రాష్ట్రానికి చెందిన ట్రావన్కూర్ మహారాజు "స్వాతి తిరుణాళ్" కూడా సంగీతంలో విశేషమైన కృషి చేసి ముప్పై మూడవ ఏటనే పరమపదం చేరాడు.

అల్లకల్లోలంగా ఉన్న రాజకీయ, సాంఘిక పరిస్థితులు... వారసులెవరూ లేకపోతే రాజ్యాల్ని కాజేద్దామని కోట బురుజుల మీద గిరికీలు కొడ్తున్న "తెల్లదొరతనపు గద్దలు"...

ఐకమత్యం లేక పరస్పరం కలహించుకుని ముక్కలు చెక్కలైపోతున్న సిగ్గులేని భరతజాతీ!...

ఇలాంటి పరిస్థితుల్లో 1813 వ సంవత్సరంలో లక్ష్మీబాయి, రాజరాజ వర్మలకు 'స్వాతి' నక్షత్రంలో పుట్టాడు... "స్వాతి తిరుణాళ్"!!

పదహారో ఏటనే రాజ్యానికి వచ్చాడు గానీ... కుట్రలూ కుతంత్రాల రాజకీయ చదరంగం ఏమీ నచ్చలేదు. ఎందుకో అతని మనసు సంగీతం వైపు మొగ్గింది. అలాంటి రాజకీయ కల్మషంలో గూడ... స్వచ్ఛమైన పద్మం లాగ సంగీత పరిమళాలు గుబాళించాడు!!

ఆయనో బాలమేధావి... అక్షరాలా పదహారు భాషల్ని ఆపోసన పట్టేసిన అపర సుబ్రహ్మణ్యేశ్వరుడు. భాషలు నేర్చుకోవడమే కాదు ఆయా భాషల్లో కీర్తనలు రాసిన దిట్ట!... కృష్ణదేవరాయల్లాగ, భోజ మహారాజు లాగ వివిధ కళారంగాల్లో నిష్ణాతులైన వారిని ఆహ్వానించి ఉచితమైన పదవులిచ్చి గౌరవించిన సరసుడు.

ఆయన ఆస్థానంలో...

షట్కాల గోవింద మరార్

పాలఘాట్ పరమేశ్వర భాగవతార్

విద్వాన్ కోయిల్ తుంపురన్

కన్నయ్య భాగవతార్

కోకిలకంఠ మేరుస్వామి

వడివేలు సోదరులు

ఇరవి వామన తంబి

క్షీరాబ్ధి శాస్త్రి

సుబ్బు కుట్టి అయ్య...

వంటి సంగీత - సాహిత్య సామ్రాట్టులుండేవారు!... అలాగే ఆయన ఇంగ్లీషు నేర్చుకోవడానికి తంజావూరు సుబ్బారావునీ, సంస్కృతం అధ్యయనానికి కోచుపిళ్ళ వారియర్నీ, ఫ్రెంచి భాష కోసం రాజ రాజ వర్మనీ నియమించుకున్నారు.

అలాగే తన సంగీత గురువులు:

కరమన సుబ్రహ్మణ్య భాగవతార్

కన్నయ్య భాగవతార్

మేరుస్వామి

అనంత పద్మనాభ గోస్వామి

తంజావూరు సోదరుల దగ్గర శిష్యరికం చేసాడు!

అలాగే రంగ అయ్యంగార్, సులేమాన్ అనే గురువుల దగ్గర హిందుస్థానీ సంగీతం కూడా క్షుణ్ణంగా నేర్చుకున్నాడు.

సంగీత త్రయానికి సమకాలీనుడైన "స్వాతి తిరుణాళ్"కి త్యాగరాజస్వామి అంటే అపారమైన గౌరవం. అంచేత తను రాసిన కొన్ని కీర్తనలను పరిశీలనార్థం త్యాగరాజ స్వామి వారికి పంపడం... ఆయన వాటిని చదివి.... అద్భుతంగా ఉన్నాయంటూ మెచ్చుకుని ఉత్తరాలు రాయడం... (ఆ ఉత్తరాలు త్రివేండ్రం పురాతన సంగ్రహాలయంలో భద్రంగా ఉన్నాయని భోగట్టా...)

ఎలాగైనా త్యాగరాజస్వామిని తన ఆస్థానానికి పిలిపించుకుని తరించాలనే కోరికతో స్వాతి తిరుణాళ్ గోవిందమరార్ అనే సంగీత విద్వాంసుణ్ణి పంపితే...

త్యాగరాజ స్వామి ఆ ఆహ్వానాన్ని సున్నితంగా తిరస్కరిస్తూ...

మళ్ళీ "ఎందరో మహానుభావులు" అన్న కీర్తన పాడి వినిపించాడు.... పరవశించిపోయిన గోవింద మరార్ త్యాగరాజ స్వామి వారి పాదాలకి దణ్ణం పెట్టుకుని వెళ్ళిపోవడం... అదో కథ...

అనంత పద్మనాభస్వామి పరమ భక్తుడు అయిన స్వాతి తిరుణాళ్ తన చాలా కృతులకి "పద్మనాభ" ముద్రనే వాడాడు.

ఒక సందర్భంలో తన ఆస్థాన విద్వాంసుడైన వడివేలుని దంతపు వీణతోనూ, కనకాభిషేకం తోనూ సన్మానిస్తే.... ఆ విద్వాంసుడు ముగ్ధుడైపోయి "స్వాతి తిరుణాళ్" మహారాజు మీద ఆశువుగా కీర్తన రచిస్తే... "స్వామీ మీ విద్యంతా మధ్యలో రాలిపోయే తారలాంటి మామీద వృథా చేస్తున్నారా!... ఆ కీర్తనేదో ఆది మధ్యాంతరహితుడూ, శాశ్వతుడూ అయిన అనంత పద్మనాభుడి మీద రాయండి" అని వినయంగా అభ్యర్థిస్తే సిగ్గుపడి పోయిన వడివేలు వెంటనే అనంత పద్మనాభ స్వామిని కీర్తిస్తూ ఓ కీర్తన రాసాడట...

స్వాతి తిరుణాళ్...రచనలు:

| | | |
|---|---|---|
| శంకరాభరణ రాగంలో | - | చలమేల |
| కాపి రాగంలో | - | సుమసాయక |
| యదుకుల కాంభోజిలో | - | స్వామీ నిన్ను |

అనే వర్ణాలూ.... అలాగే కొన్ని జావళీలు...

| | | |
|---|---|---|
| సైంధవి రాగంలో | - | ఇటు సాహసములు |
| యదుకుల కాంభోజిలో | - | భుజగ శయనే |
| సురటిలో | - | జలజబంధు |
| నీలాంబరిలో | - | నీలకంఠ |
| ఉసేనిలో | - | కనకమయా |
| రాగమాలికలో | - | పన్నగేంద్రశయనే |
| శంకరాభరణంలో | - | నిఖిల భువన.... |

అలాగే అత్యంత ప్రాచుర్యం పొందిన కీర్తన "సావేరి" రాగంలోని "భావయామి రఘురామం..." దీన్ని ప్రముఖ సంగీత విద్వాంసులు "సెమ్మంగుడి శ్రీనివాసయ్యర్" కొంతస్వేచ్ఛతో రాగమాలికలో వరుసకట్టారు.

అలాగే కుంతల వరాళి రాగంలోని "భోగీంద్ర శయనం" కూడా అత్యంత విశిష్టమైనది!

ఎంత సంగీతంలోపడి ఆ రసగంగలో ఓలలాడుతున్నా... రాజ్య పాలనకి సంబంధించిన కొన్ని కార్యక్రమాల్ని మొట్టమొదట చేపట్టిన వ్యక్తి "స్వాతి తిరుణాళ్".

| | | |
|---|---|---|
| కేరళలో-మొట్టమొదటి | - | ప్రజా గ్రంథాలయ స్థాపన |
| మొదటి | - | మున్సిఫ్ కోర్టు స్థాపన |
| మొదటి | - | ఇంగ్లీషు హైస్కూలు స్థాపన |
| మొదటి | - | నక్షత్రశాల స్థాపన... |

తొలిసారిగా ఇంజక్షన్లు ఇప్పించిన ఘనత కూడా స్వాతి తిరుణాళ్‌దే!...

మొత్తానికి స్వాతి తిరుణాళ్ సంస్కృతంలో 198, మలయాళంలో 63, హిందీలో 37, తెలుగులో 8, మిగతా భాషల్లో 6 కీర్తనలు రాసాడు.

ఇలా అన్ని భాషల్లోనూ అనంత పద్మనాభుణ్ణి తనవితీరా అర్చించుకున్న "స్వాతి తిరుణాళ్" డిసెంబరు 25వ తేదీ, 1846లో పద్మనాభుడి పద పద్మాల్లో ఐక్యమైపోయాడు.



-తనికెళ్ళ భరణి

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయదలచుకునే వారు

**తనికెళ్ళ భరణి,**

**కేరాఫ్: "హాసం", 502, శ్రీబాలాజీ నిలయం, 13-1-212, మోతీనగర్, హైదరాబాదు - 500 018**

**అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.**

---

# ఘంటసాల క్విజ్

| | | |
|---|---|---|
| మొదటి బహుమతి | : రూ. 250/- | మరియు |
| రెండవ బహుమతి | : రూ. 200/- | ఘంటసాల |
| మూడవ బహుమతి | : రూ. 150/- | కలర్ ఫోటో |

**క్విజ్ రూపకల్పన, సమర్పణ, నిర్వహణ**

డా॥ కె.వి.రావు,
వ్యవస్థాపకులు,
పద్మశ్రీ ఘంటసాల గానసభ,
28, 1-1-79, ఆర్టీసీ క్రాస్‌రోడ్స్,
హైదరాబాద్ - 500 020.



## క్విజ్‌నెం-9

1. ఘంటసాల, ఎమ్.ఎస్.రామారావు కలిసి పాడిన మొదటి చిత్రం?
జ: ...............................

2. కె.జగ్గయ్య రచనకు ఘంటసాల గానం చేసిన చిత్రం ఏది ?
జ: ...............................

3. ఘంటసాల, జిక్కీ కలిసి పాడిన తొలి చిత్రం ?
జ: ...............................

4. కన్నడ నటుడు రాజ్‌కుమార్‌కు ఘంటసాల గానం చేసిన తెలుగు చిత్రం ?
జ: ...............................

5. అడవి బాపిరాజు రచనకు ఘంటసాల పాడిన పాట ?
జ: ...............................

పంపినవారి పేరు : ______________________

చిరునామా : ______________________

______________________

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పక్కన ప్రచురించిన కూపన్ మాత్రమే నింపి కవరులో పంపాలి. కూపన్ కాకుండా మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'ఘంటసాల క్విజ్' అంటూ పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ప్రకటించిన బహుమతులను నగదుగా గాని, ఆడియో క్యాసెట్లుగా గాని, సీడీలుగా గాని విజేతలకు 'పద్మశ్రీ ఘంటసాల గానసభ - హైదరాబాద్' వారిచే నేరుగా పంపటం జరుగుతుంది.

డి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే తుది నిర్ణయం 'పద్మశ్రీ ఘంటసాల గాన సభ' వారిదే!

ఇ) ధారావాహికంగా కొనసాగే ఈ క్విజ్ పోటీలలో ఏ కేటగిరీలోనైనా వరసగా 5 సార్లు విజేతగా ఎన్నికైనవారికి ఓ ప్రముఖవ్యక్తి ద్వారా హైదరాబాద్‌లో మరొక ఆకర్షణీయమైన బహుమతిని అందజేయటం జరుగుతుంది.

**కూపన్‌లు 15-9-2003 లోగా చేరాలి**

**కూపన్‌లు పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.




నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

**రావి కొండలరావు**

రాసిన వ్యాసమిది



# వ్యాఖ్యానం నుంచి అనువాదోపాఖ్యానం వరకు...

**మా**ట నేర్చుకున్న సినిమా, భాష కూడా నేర్చుకున్న తర్వాత తెలుగుదేశంలో ముందుగా తెలుగు, హిందీ సినిమాలు బాగా ఆడేవి. ఈ "ఆడడం" అన్నమాట మనది- మన తెలుగు వాళ్లది. "నాటకం ఆడడం" అంటాం.

కాబట్టి, సినిమా కూడా ఆడడం అయింది. ఆడడం ఆట అయింది. "రోజుకి రెండాటలు (షోలు కి తెలుగు) మూడు ఆటలు" అంటూ ప్రకటనలు వచ్చాయి. రిలీజయిన సినిమాని "ఎన్నాళ్లు ఆడుతుంది?" అని మనం అడిగితే, హిందీ వాళ్లు "ఎన్నాళ్లు నడుస్తుంది?" అని అడుగుతారు హిందీలో. ఇంగ్లీషులో రన్నింగ్ అన్నారు. తమిళంలో ఇంగ్లీషు నుంచి యధాతథంగా తర్జుమా చేస్తారు గనుక, "పరుగెత్తుతోంది" (ఓడుదు - తమిళం) అంటారు.

అంచేత తెలుగు సినిమాలు ఆడతాయి; హిందీ సినిమాలు "నడుస్తాయి", తమిళ సినిమాలు, ఇంగ్లీషు సినిమాలు "పరుగెత్తు తాయి"- అన్నీ ప్రొజెక్టర్‌లో ఒక్క స్పీడుతోనే నడిచినా! మనకి మొదట్లో తమిళ సినిమాలు కూడా బాగా పరిగెత్తేవి. అప్పట్లో డబ్బింగ్‌లూ లేవు, వ్యాఖ్యానాలూ లేవు. కొన్నాళ్లకి సంభాషణలు అర్థం కావడానికని సినిమా హాల్సులో అనువాదకుల్ని ప్రవేశపెట్టారు. వీళ్లు హాలు మధ్యలో నించుని సంభాషణల్ని అనువదించి చెప్పేవారు.

లేదా, డైలాగులు లేని చోట బొమ్మచూసి జరుగుతున్నది చెప్పేసేవారు ప్రేక్షకులకి తెలీదన్నట్టు. అంటే హీరో, కారు స్పీడుగా తోలుతున్నాడనుకోండి- "అతను వేగంగా కారు నడుపుకుంటూ వెళ్తున్నాడు" అనీ, ఎదురుగా ఏదైనా కారొస్తే "ఎదురుగా ఓ కారు, అయినా




హీరో జోరుగా వెళ్తున్నాడు" అనీ ఉద్వేగంగా చెప్పేవారు.

కథ చెప్పేవాడు. ఇలా హాళ్లల్లో నోటి అనువాదాలు సాగిన తర్వాత, నిదానంగా డబ్బింగులొచ్చాయి. మూల భాషలో వున్న డైలాగుల్ని మూల పడేసి, తెలుగు మాటలు చెప్పించడం వల్ల, ఆ పాత్రల గొంతులతో బాగా

హిందీకీ, తమిళ సినిమాలకీ అనువాదకులుండేవారు. వీళ్లు న్యాయంగా మూల భాష తెలిసినవాళ్లు. అయితే కొందరు థియేటర్లవాళ్లు గట్టి గొంతు కలవాళ్లని తెచ్చి చెప్పమనేవారు. వీళ్లకి అంతగా మూల భాష రాదు. వాళ్లకి అర్థమైనంతవరకూ అర్థం చేసుకుని ప్రేక్షకులకి అర్థం చెప్పేవారు. అంచేత పెద్ద పెద్ద డైలాగులకి అనువాదం వుండేది కాదు.

'నహీ', 'జాన్', 'ఆమ', 'ఇల్లె' లాంటి మనకి తెలిసిన పదాలకే వాళ్లూ తెలుగు చెప్పేవారు.

కొందరు జోక్స్ చేస్తూ చెప్పేవారు. ఒక హిందీ సినిమాలో హీరో "మేరా పాస్ ఆవో" అంటే, 'నా దగ్గరకి రా' అని, చెప్పి తర్వాత "ఇంకా దగ్గరగా రాకు సెన్సార్ వాళ్లు ఊరుకోరు" అనీ అనువాదకుడు చమత్కారాలు చేసేవాడు. ఇంగ్లీషు సినిమాలకి అనువాదాలుండేవి కావు. ఆ భాష ఎవరికీ అర్థం కాదు గనక. ఇంగ్లీషు సినిమా చూసి వచ్చిన ప్రతివాడూ ఒక్కో రకమైన

అర్థం అవుతుందని ఆ ప్రక్రియ వచ్చింది. 1948లో వచ్చిన జెమిని 'చంద్రలేఖ' తెలుగునాడులో శతదినోత్సవాలు చేసుకుంది. అప్పటికింకా డబ్బింగ్ రాలేదు గాని, ఆ సినిమానే హిందీలోకి డబ్‌చేసి (కొంత, కొంత మళ్లీ తీశారు) విడుదల చేసినప్పుడు డబ్బింగ్ సూత్రం అర్థమైంది. అయితే ఇతర భాషల్లో బాగా ఆడిన సినిమాల్ని తెలుగులో డబ్బింగ్ చేసి వదిలితే బాగుంటుందని భావించి మొదలు పెట్టారు. 'ఆహుతి' పేరుతో (హిందీ సినిమా 'నీరా అవుర్ నందా') తెలుగు


'చంద్రలేఖ' చిత్రంలో ఓ దృశ్యం

సినిమా వచ్చినా, తర్వాత హిందీవి ఎక్కువగా డబ్ కాలేదు- హిందీ ఆంధ్రులకి అర్థమయే భాషట! అయితే, తొలి దశలో మాత్రం డబ్బింగ్ ఇబ్బందుల్లో పడింది. కంఠాలు, ఉచ్చారణ బాగుంటాయని రేడియో నాటకాల్లో పాల్గొనే వాళ్లని డబ్బింగ్‌కి పిలిచారు. బొమ్మచూస్తూ ఆ పెదవులకి అనుగుణంగా సంభాషణ చెప్పడం- చాలామందికి కుదరలేదు. ఒక మలయాళం సినిమాలోని ఒక పాత్ర వంగర సుబ్బయ్యగారిలా వుంటే, ఆయన్నే పిల్చి ఆ పాత్రకి తెలుగు మాట్లాడమన్నారు. వంగరవారి గొంతులో పచ్చి వెలక్కాయ పడ్డట్టు- పెసికేది కాదు. "ఆ బొమ్మ చూస్తూ నేను అందుకునేటప్పటికి, బొమ్మ వెళ్లిపోతోంది. పోనీ నేను ముందు అందుకుందా మంటే, బొమ్మలోని వాడు స్లో అయిపోతున్నాడు. దీనికీ మనకీ కుదరదని చెప్పేసి, ఓ దండం పెట్టేసి పారిపోయాను" అని వంగర తన అనుభవం చెప్పేవారు. "నేను చెప్పేది చెప్తా. మీరు సర్దుకో గలిగితే సర్దుకోండి. లేదంటే నన్ను పోనివ్వండి'' అని రమణారెడ్డిగారూ తప్పుకున్నారు. న్యూటన్ స్టూడియోలో ఒక తమిళ జానపద సినిమా డబ్బింగ్ చేస్తున్నారు. ఆ రచయితకి కొత్త- అంచేత కంగారు. రాజ దర్బారులో ఎంతమంది జనం వుంటే అంతమందీ డబ్బింగ్ థియేటర్లో వుండాలనే వారు. "మహారాజావారికీ జై" అని దర్బారులో అటూ ఇటూ నించున్న వారు అంటే, అలాగే మైకుల దగ్గర అటూ ఇటూ నించుని అందర్నీ జై కొట్టమనేవారు. దూరంగా వుండే వాళ్లకి మైకు అందేది కాదు. "మైకు చుట్టూ నిలబడి చెప్పినా అదే ఎఫెక్టు వస్తుంది" అని చెప్పినా ఆయన వినేవారు కాదు. సినిమాలో ఒక పాత్ర భోజనం చేస్తూ మాట్లాడుతుంది. అంచేత భోజనం తెప్పించి మైకు ముందు పెట్టి తింటూ తెలుగు సంభాషణ చెప్పమన్నారు. "అక్కర్లేదండీ, తింటున్నట్టు నోరు కదుపుతూ చెప్పొచ్చు" అని ఆ డబ్బింగ్ ఆర్టిస్టు ఎంత చెప్పినా ఆ రచయిత వినకుండా భోజనం తెప్పించారు. భోజనం తింటూ చెప్పడంలో ఆయన దృష్టి బొమ్మ మీదనే వుండేది కాదు. అంచేత లిప్ మూవ్‌మెంట్ మిస్ అయ్యేది. అలా ఆరు ,ఏడు టేకులయేసరికి, అన్నిసార్లూ భోజనం తినేనరికి, ఆ ఆర్టిస్టు కడుపు బస్తాలాగా అయిపోయి అసలు మాట రాకుండా పోయింది. ఆ అవస్థ అంతా అయిన తర్వాత గాని, ఆ రచయిత ఆర్టిస్టు దారికి రాలేదు. అలాగే, ఒక దృశ్యంలో ఏనుగు వెళ్తూ కనిపిస్తుంది. ఏనుగుని తెప్పించాలంటాడు ఆయన! "ఎందుకండీ ఏనుగు?" అని అడిగితే, "బొమ్మలో ఏనుగుంది! అది ఘీంకరించాలి. మైకుముందు ఏనుగుని నిలబెట్టి ఘీంకరింపచేద్దాం" అంటాడాయన. 'అక్కర్లేదండీ. ఆ బొమ్మమీద ఏనుగు అరుపుని ట్రాన్స్‌పర్ చెయ్యొచ్చు" అని సౌండ్ ఇంజనీర్ చెప్పి చెప్పి, నచ్చజెప్తేగాని ఏనుగుపట్టు ఆయన మానలేదు.

అప్పుడు డబ్బింగ్ టెక్నిక్ పెరగలేదు. ప్రొజెక్టర్లో ఫిలిమ్‌ని వెనక్కితిప్పి, మళ్లీ ముందుకి నడిపేవారు. డబ్బింగ్ చెప్పడంలో తప్పొస్తే, మళ్లీ వెనక్కి వెళ్లాల్సిందే. దానివల్ల టైమ్ ఎక్కువ పట్టేది. తర్వాత లూప్ సిస్టమ్ వచ్చింది. దీనివల్ల బొమ్మ తొందరగా వచ్చేసేది. చెప్పే ఆర్టిస్టులకి ఇదీ ఇబ్బందిగానే వుండేది. అది వచ్చే లోపల సిద్ధంగా వుండాలి కదా!

కొత్త నిర్మాతలు చిత్ర నిర్మాణంలోకి ప్రవేశిస్తూ ముందుగా డబ్బింగ్ సినిమా చెయ్యాలి- అనుకునేవారు. అలా ఓ నిర్మాత, తమిళ సినిమాకొని డబ్బింగ్ చెయ్యాలనుకున్నాడు. ఆ తమిళ సినిమా నిర్మాతకి రికార్డింగ్ థియేటరుంది. అంచేత, తన స్టూడియోలోనే డబ్బింగ్ చెయ్యండీ, చేస్తే ఒరిజినల్‌గా వున్న శబ్దాలూ అవీ సులువుగా జోడించేయొచ్చు- అన్నాడు. తెలుగు నిర్మాతకి ఈ ఐడియా నచ్చింది గాని, చిన్న అనుమానంలో పడ్డాడు. "ఏమిటి?" అన్నాడు ఆ నిర్మాత. "ఏం లేదు. మాది తెలుగు సినిమా కదా. మీది తమిళ థియేటర్. తెలుగు చేసుకోవచ్చునా, తమిళ థియేటర్లో అని...." అని నీళ్లు నమిల్తే, తమిళ నిర్మాత కూజాడు నీళ్లు తాగాడు, ఆయనగారి అమాయకత్వానికి.

* * *

శబ్దం వచ్చిన తొలి రోజుల్లో లాబొరేటరీలో సౌండ్ నెగెటివ్‌ని ప్రాసెస్ చేస్తూ- బయట ఎవరైనా మాట్లాడుతూవుంటే, "ష్.... లోపల సౌండ్ ప్రాసెసింగ్‌లో వుంది. సైలెన్స్" అని బెదిరించేవారుట- లాబ్‌వాళ్లు! మాట్లాడేవాళ్లు నోళ్లు మూసుకుని, అడుగులు చప్పుడు కూడా వినిపించకుండా, మెల్లిగా జారుకునేవారుట!

నా సంగీతం అన్ని సంగీత ప్రక్రియల సరిహద్దులను దాటాలి. అడుగడుగునా అనూహ్యమైన బాణి అనిపించాలి' అన్నారు సలీల్ చౌధురి ఒక ఇంటర్వ్యూలో. నిజంగానే ఆయన బాణీలు అనూహ్యమైన మలుపులు తిరుగుతూ, గాయకుల శక్తి సామర్థ్యాలనే కాక, శ్రోతల ఊహా శక్తిని కూడా పరీక్షిస్తాయి. 'ఆహ రిమ్ ఝిమ్ కె యే ప్యారే ప్యారే గీత్ లియే, ఆయీ రాత్ సుహానీ దేఖో ప్రీత్ లియే' అన్న తర్వాత, 'మీత్ మేరే సునో జరా హవా కహే క్యా... ఆ... సునోతో జరా, ఝింగర్ బోలే చికి మికి చికిమికి' (ఉస్నే కహా థా (1960)- లతా, తలత్) అనే వాక్యాలు అన్ని దొంకలు తిరుగుతాయనీ, అంత ఉత్తేజాన్ని కలిగిస్తాయనీ మొదటిసారి ఆ పాట వింటున్న ఏ శ్రోతయినా అనుకుంటాడా. ఈ అనూహ్యత, ఉరకలు వేసే ఉత్సాహాలే సలీల్ చౌధురి ట్రేడ్ మార్కులు.



'పరఖ్' (1960) కథకుడు కూడా ఆయనే. అయితే సంగీతం ద్వారా ఆయన ప్రేక్షకులకు మరింత సన్నిహిత మయ్యారు. ఎందుకంటే, ఏక కాలంలో శ్రోతల చేత 'ఆహా' 'ఓహో' రెండు అనిపించు కోవడం (అంటే హృదయాన్ని, మేధను కూడా తన స్వర రచన ద్వారా తాకడం) ఆయనకే సాధ్యమైంది.

'ఐ మేరే ప్యారే వతన్' (కాబులీ వాలా (1961) - మన్నాదే) విని కంట తడి పెట్టని వారుంటారా? 'జులమీ సంగ్ ఆంఖ్ లడీ' (మధుమతి (1958- లత) విని ఒళ్ళు పులకించని వారుంటారా? 'ఆంసూ సమఝ్‌కే క్యూ ముఝే ఆంఖ్ సే తుమ్ నే గిరాదియా' (తలత్ - ఛాయా) విని హృదయం ద్రవించని వారుంటారా? హాఫ్ టికెట్ (1962)లో పాటలు విని నవ్వని వారుంటారా? ఒకే సినిమాలో ఒకే గాయకుడి చేత అసాధారణమైన వైవిధ్యంతో పాడించడం సలీల్‌కే తగు. మధుమతి

# అనూహ్యం అసాధారణం ఆయన సంగీతం



1925 లో జన్మించి, 1995 సెప్టెంబరు 5వ తేదిన మరణించిన సలీల్ చౌధురి చలన చిత్ర రంగంలో ఒక అసాధారణ సంగీత దర్శకుడు. ఆయన స్వరకల్పన చేసిన చిత్రాలు హిందీలో 75, మళయాళంలో 26, తెలుగుతో సహా ఇతర భాషల్లో మరికొన్ని. మొదట బెంగాలీలో కవిగా, గీత రచయితగా, కథా, నాటకాల రచయితగా మంచి పేరు తెచ్చుకున్న సలీల్, సంగీత దర్శకుడి గానే ఎక్కువ పేరు ప్రతిష్టలు సంపాదించారు. చేతికందిన ప్రతి వాద్యాన్ని అద్భుతంగా వాయించగల సలీల్ అణువణువూ సంగీతమే. అందుకే ఆయన కవిత్వంలోనూ, నాటకాల్లోనూ, కథల్లోనూ కూడా గొప్ప లయ వినిపిస్తుంది. ఆ లయ కూడా అందరూ ఎరిగిన సామాన్యమైన లయ కాదు. ఆయనకే ప్రత్యేకమైన, ఒక విలక్షణ మైన ఒరిజినాలిటితో కూడిన విన్యాసం. 'ఓ సజనా, బరఖా బహార్ ఆయీ' (పరఖ్ -1960)లో లత) 'తుమ్ కో పుకారే మేరే మన్‌కా పపీహరా' అంటూ మందగమనంతో సాగిన బాణీ, రెండవ చరణంలో 'ఐసి రిమ్ ఝిమ్ లేలో సజన్, ప్యాసే ప్యాసే మేరే నయన్, తేరే హీ ఖాబ్ మే ఖోగయే' గా మారిపోవడం ఇలాంటి విన్యాసమే. క్షణక్షణం మారిపోయే ఈ సంగీత రుచులు ఒక్క సలీల్‌కే సాధ్యం.

యౌవనంలో విప్లవ ఉద్యమాలతో ప్రభావితుడై, కవిత్వం, నాటకం రాసిన సలీల్‌లో విప్లవ ఛాయలు సినిమా సంగీత దర్శకత్వంలోనూ కనిపిస్తాయి. అంటే, సంప్రదాయానికి భిన్నంగా సాగుతాయి ఆయన బాణీలు. ఆ విలక్షణత వల్లే జైకిషన్ సలీల్‌ని 'జీనియస్' అని పిలిచేవారు. బెంగాలీ గీతాలు, జానపద గేయాలు, రవీంద్ర సంగీత్‌ల దగ్గర నుంచి, కేవలం నేపథ్యసంగీతం, జింగిల్స్ వరకు, అన్ని రకాల సంగీతాలు అలవోకగా అందించారు సలీల్ చౌధురి. అంతకంటే విశేషం, వేరే సంగీత దర్శకులు ఒక్క సినిమాల పాటలకు బాణీలు వేయగా, తాను ఒక్క నేపథ్య సంగీతాన్ని మాత్రమే సమకూర్చడం. ఎస్.డి.బర్మన్ సంగీతం అందించిన దేవదాసు (1955)కు, రోషన్ బాణీలు సమకూర్చిన 'ఆనోఖీ రాత్' (1968) కు నేపథ్య సంగీత దర్శకుడు సలీల్ చౌధురి. పట్టి నేపథ్య సంగీతం అందించడానికి మరే సంగీత దర్శకుడైనా ఒప్పుకునేవాడా అన్నది సందేహమే. సంగీతం మీద సలీల్ కున్న మమకారం అలాంటిది. సలీల్ చౌధురిది చాలా వైవిధ్య భరితమైన సినీ జీవితం. ఆయన సినిమాల్లో కథారచన చేసారు; గీత రచన చేసారు. బిమల్‌రాయ్ చిత్రాల్లో తలమానికంగా భావింపబడే 'దో భీగా జమీన్' (1953) చిత్ర కథకుడు సలీలే.

(1958)లో దిలీప్ దుఃఖాన్ని 'టూటే హువే ఖాబోనే' అని తనలో పలికించిన రఫీ, అదే సినిమాలో జానీవాకర్ తాగుడు ప్రేలాపనని 'జంగిల్ మే మోర్ నాచా కిసీనే న దేఖా' అని అంత గొప్పగానూ పలికించడం వెనక సలీల్ జీనియస్ ఉంది.

చాలామంది సంగీత దర్శకుల్లా సలీల్‌కు ఫేవరెట్ గాయకులున్నట్టు తోచదు. తలత్, రఫీ, కిశోర్, ముఖేశ్, అపుడపుడు మన్నాదే ఆయన ప్రధాన గాయకులైతే అందరిలాగే లతా, ఆశాలు ఆయన ప్రధాన గాయనులు. పాటను బట్టి గాయకులను ఎంచుకునే అలవాటు వల్ల, ఆయన తన బాణీలకు పూర్తి న్యాయం చేయగలిగారు. 'బాగ్ మే కలీ ఖిలీ బగియా మెహకే'ని ఆశా (చాంద్ ఔర్ సూరజ్ -1965), 'సాథీరే- తుఝు బిన్ జియా ఉదాస్ రే' (పూనమ్ కీ రాత్ -1965) ని లతా, కైసే మనావూ సేవా' ని ముఖేశ్ (చార్ దివారి-1961), 'మున్నా బడా ప్యారా' ని కిశోర్ (ముసాఫిర్-1957), 'జిందగీ హై క్యా సున్ మేరి జా' ని రఫీ (మాయా-1961) తప్ప మరొకరు పాడ్డం ఊహించగలమా? కాలంతో పాటు కొత్త గాయకులను కూడా ప్రోత్సహిస్తూ, 'ఛోటీసీ బాత్' (1975) లో జేసుదాస్ చేత అద్భుతంగా పాడించారు సలీల్.

బెంగాలీ సంగీతంలో అతను అడుగు పెట్టినపుడు ఆ కొత్త తరహా బాణీలకు బెంగాలీలు అప్రతిభులైపోయారు. సలీల్‌కు అనేక వాద్యాలు వాయించగలిగిన నేర్పు ఉండడం వల్ల, వాయిద్యాలను చాలా అద్భుతంగా వాడేవారు. జాగ్రత్తగా గమనిస్తే, వాయిద్యాల నడకల్లోని విలక్షణత్వం ఆయన బాణీల్లోను కనిపిస్తుంది. అందుకే ఆయన పాటల నడక క్షణానికో రకంగా మారిపోతూ, లయల హొయలతో మనల్ని అలరిస్తుంది. జానపద బాణీలో సాగే 'హరియాలా సావన్ ఢోల్ బజాతా ఆయా' (దో భీగా జమీన్ - 1953), ఉత్సాహం ఉరకలు వేసే 'యే బన్సీ క్యూ గాయే' (లతా - పరఖ్ -1960), 'అయివే దునియా దేవ్ దునియా' (జాగ్తే రహో-1956) పాటలు ఇలాంటి లయకు కొన్ని ఉదాహరణలు మాత్రమే. సాహిత్యం, సంగీతం, వాద్యం మూడింటిలోనూ ప్రతిభ ఉన్న సంగీత దర్శకులు ఏ భాషలోనైనా తక్కువే. అలాంటి వారిలో అగ్రస్థానంలో నిలుస్తారు సలీల్ చౌధురి.

యౌవనంలో ఇప్టా సభ్యుడిగా, కమ్యూనిస్టు పాటలు రాస్తూ, స్వరపరుస్తూ, బెంగాల్ గ్రామ గ్రామాల్లో తన పాటలను మార్మోగిస్తూ తిరిగిన సలీల్, బెంగాలీల సాంస్కృతిక వారసత్వంలో భాగమయ్యాడు. ఆధునిక బెంగాలీ సంగీతాన్ని ఇంత ఎక్కువగా ప్రభావితం చేసిన సంగీత దర్శకుడు లేడంటే అతిశయోక్తి కాదేమో. 1955 తర్వాత అతను ప్రొఫెషనల్ సంగీత దర్శకుడిగా



మారి, హిందీ రంగంలోకి ప్రవేశించాడు. ప్రాచ్య, పాశ్చాత్య సంగీత ధోరణలను అలవోకగా మేళవించగల నేర్పు అతన్ని హిందీ శ్రోతలకు సన్నిహితుణ్ణి చేసింది. ఆనాటి నుంచి, చిట్టచివరి సినిమా 'స్వామి వివేకానంద' వరకు సలీల్ అందించిన సంగీతం, రాశిలో తక్కువే అయినా, కలకాలం శ్రోతలను ఉర్రూతలూగించేదే. సలీల్ చౌధురి స్వరకల్పనలో, వింటున్న వారిలో ఉత్సాహం, ఉత్తేజం, ఆనందం కెత్తించడం ప్రధానం. ఈ అత్యున్నత రసస్థాయి కలిగించడం వెనక సుదీర్ఘ పరిశ్రమ ఉండేది.

"ఒక్కొక్క పాట తను అనుకున్నంత, ఆశించినంత బాగా రావడానికి అతను రోజుల తరబడి ఏకాంతంగా కూర్చుని, నిద్రాహారాలు మాని తపనపడే వారని" లతా మంగేష్కర్ తన జ్ఞాపకాల్లో చెప్పారు. అందుకే ఆ పాటల్లో అంత పరిపూర్ణత, నైపుణ్యం కనిపిస్తాయి.

అనంతమైన వైవిధ్యానికి 'మధుమతి'(1958), ఒకే మూడ్‌ని సినిమా ఆసాంతం పోషించిన అసాధారణ ప్రతిభకు 'ఆనంద్' (1970) 'ఏక్ గావ్ కీ కహానీ' (1957), పాటల్లోనే కథను చూపించిన నైపుణ్యానికి 'కాబూలీ వాలా'(1961), 'ఉస్నే కహా థా'(1960) ఎన్నేళ్ళు గడిచినా నిత్య యవ్వనంలో ఉండే సంగీతానికి 'మాయా', 'ఛాయా'..... ఇలా చెప్పుకుంటూ పోతే, సలీల్ చౌధురి సంగీత వైశద్యానికి అవధులే లేవు. ఆయనకు చాలా తెలుసు. కథలు, చిత్ర కథలు రాయగలడు. కవిత్వం చెప్పగలడు. వాయిద్యాలు వాయించగలడు. వీటితో పాటే, సంగీతం కూడా వచ్చు. హిందీ శ్రోతల అదృష్టం ఏమిటంటే, ఆయన వీటన్నిటిలో, చలనచిత్ర సంగీతాన్ని తన ప్రధాన రంగంగా ఎన్నుకోవడం. ఫిల్మ్ సంగీతంలో ఎంత సృజనాత్మకతకు అవకాశం ఉందో, అంతా చూపిన అసమాన ప్రతిభాశాలి సలీల్ చౌధురిని ఎన్ని సంవత్సరాలు తలుచుకున్నా తనివి తీరదు. ఆయన పాటలు ఎన్నిసార్లు విన్నా, చాలనిపించదు.

-మృణాళిని



# సలీల్ చౌధురి హిట్స్

**చిత్రం : ఛైర్మన్ చలమయ్య**

ప: నయనాలు కలిసే తొలిసారి
హృదయాలు కరిగే మలిసారి
తలపే తరంగాలూరే పులకించే మేను ప్రతిసారి ॥నయనాలు॥
డు: లాలాలాలా ఆ హా హా
చ: నాలోన నీ పేరే పాడేను రాగాలు
నాలోన నీ రూపే చెసేను చిత్రాలు
మదిలో పదే పదే స్మరించ మమతల తోటలోనా
తొలివలపుల పూవులు పూచే ॥నయనాలు॥
ప: నీలాల మేఘాల నీవేమో నిలచేవు
డు: దూరానా తీరానా నీవేమో నిలచేవు
కలలే ఇదే ఇలా ఇలా నిజమాయె పరువము బంధం వేసే
ఇ: మన ప్రణయము బాసలు చేసే ॥నయనాలు॥

**చిత్రం : ఉస్‌నే కహాథా**
రచన : శైలేంద్ర — గాయకులు : లతా, తలత్

ఆహా రిమ్‌ఝిమ్ కే యే ప్యారే ప్యారే గీత్ లియే
ఆయీ రాత్ సుహానీ దేఖో ప్రీత్ లియే
మీత్ మేరే సునో జరా హవా కహే క్యా..ఆ..
సునో తో జరా, ఝీగర్ బోలే చీకీమీకీ చీకీమీకీ ॥రిమ్ ఝిమ్॥
ఖోయీ సీ భీగీ భీగీ రాత్ ఝూమే
ఆంఖోం మే సప్‌నో కీ బారాత్ ఝూమే - 2
దిల్ కీ యే దునియా ఆజ్ బాదలోం కే సాథ్ ఝూమే - ఆహా రిమ్‌ఝిమ్॥
ఆ జావో దిల్ మే బసాలూ తుమ్హే
నైనోం కా కజ్‌రా బనా లూ తుమ్హే - 2
దిల్ కీ యే దునియా ఆజ్ బాద్‌లోంకే సాథ్ ఝూమే - ఆహా రిమ్‌ఝిమ్॥
హాథ్ ఓన్ మే తేరే మేరా హాథ్ రహే
దిల్ సే జో నికలీ హై దో బాత్ రహే - 2
మేరా తుమ్హారా సారీ జిందగీ కా సాథ్ రహే - ఆహా రిమ్‌ఝిమ్॥

**చిత్రం : రజనీగంధా**
రచన : యోగేష్ — గాయకుడు : ముకేష్

కయీ బార్ యూ భీ దేఖా హై యే జో మన్ కి సీమరేఖా హై
మన్ తోడ్‌నే లగ్‌తా హై అన్‌జానీ ప్యాస్ కే పీఛే
అన్‌జానీ ఆస్ కే పీఛే మన్ దౌడ్‌నే లగ్‌తా హై
రాహోంమే, రాహోంమే, జీవన్ కీ రాహోం మే
జో ఖిలే హై ఫూల్ ఫూల్ ముస్కురాతే
కౌన్ సా ఫూల్ చురాతే, రఖ్ లూ మన్ మే సజాతే ॥కయీ బార్॥
జానూ నా, జానూ నా, ఉల్‌ఝన్ యే జానూ నా
సుల్‌ఝావూ కైసే కుఛ్ సమఝ్ నా పావూ
కిస్‌కో మీత్ బనావూ, కిస్‌కీ ప్రీత భులావూ ॥కయీ బార్॥

సలీల్‌కు ఒక భాషలో ఉపయోగించిన ట్యూన్‌లను తక్కిన భాషాచిత్రాలలో ఉపయోగించే అలవాటు ఉంది. అది సంగీతకారుడిగా తన హక్కు అని ఆయన వాదించేవాడు. బెంగాలీ ట్యూన్‌లు హిందీ సినిమాలలో వాడారు, హిందీవి మలయాళంలో వాడారు. అలాగే ఈ పాట ట్యూన్‌ను తెలుగు సినిమా 'ఛైర్మన్ చలమయ్య'లో 'నయనాలు కలిసె తొలిసారి' పాటకు ఉపయోగించారు. ఆ పాటను పైన చూడవచ్చు.

**చిత్రం : మధుమతి**
రచన : శైలేంద్ర — గాయకుడు : ముకేష్

సుహానా సఫర్ ఔర్ యే మౌసమ్ హసీ
హమే డర్ హై హమ్ ఖో న జాయే కహీ
యేకౌన్ హస్తా హై ఫూలోంమే ఛుప్‌కర్
బహార్ బేచైన్ హై కిస్‌కీ ధున్‌పర్
కహీ గున్ గున్ కీ రుమ్‌ఝుమ్
కె జైసే నాచే జమీ, ॥సుహానా॥
యే గోరీ నదియోంకా చల్‌నా ఉఛల్‌కర్
కి జైసే అల్హడ్ చలే పీ సే మిల్‌కర్
ప్యారే ప్యారే యే నజారే నిఖరే హై హర్ కహీ, ॥సుహానా॥
ఓ ఆస్‌మా ఝుక్ రహా హై జమీపర్
యే మిలన్ హమ్‌నే దేఖా యహాపర్
మేరీ దునియా మేరే సప్‌నే మిలేంగే శాయద్ యహీ ॥సుహానా॥

దిలీప్‌కుమార్‌కు ముకేష్ తక్కువ పాటలే పాడారు. బిమల్‌రాయ్ 'యహూదీ'లో, 'మధుమతి'లో దిలీప్‌కు ముకేష్‌చే పాడించారు. 'మధుమతి'లో రఫీ ఒకపాట (టూటే హుయే ఖ్వాబోంనే) పాడగా, ఇదీ, 'దిల్ తడప్ తడప్‌కర్' ముకేష్ పాడారు. దిలీప్-ముకేష్ కాంబినేషన్ చిరస్మరణీయమైన పాటగా ఇది మిగిలింది.

**చిత్రం : జాగ్‌తే రహో**
రచన : శైలేంద్ర — గాయకుడు : ముకేష్

రంగీకో నారంగీ కహే, బనే దూధ్ కో ఖోయా
చలతీ కో గాడీ కహే, దేశ్ కబీరా రోయా
జిందగీ ఖ్వాబ్ హై ఖ్వాబ్ మే ఝూట్ క్యా
ఔర్ భలా సచ్ హై క్యా... సబ్ సచ్ హై ॥జిందగీ ఖ్వాబ్ హై॥
దిల్ నే హమ్‌సే జో కహా
హమ్‌నే వైసా హీ కియా 2
ఫిర్ కభీ ఫుర్‌సత్ మే సోచేంగే
బురా థా యా భలా ॥జిందగీ ఖ్వాబ్ హై॥
ఏక్ కత్‌రా మయ్ కా జబ్
పత్థర్ కే హోంఠోం పర్ పడా
ఉస్‌కే సీనే మే భీ దిల్ ధడ్‌కా
యే ఉస్‌నే భీ కహా..క్యా ॥జిందగీ ఖ్వాబ్ హై॥
ఏక్ ప్యాలీ భర్‌కే మైనే గమ్ కే మారే దిల్ కో దీ
జహర్ నే మారా జహర్ కో
ముర్దే మే ఫిర్ జాన్ ఆ గయీ ॥జిందగీ ఖ్వాబ్ హై॥

మోతీలాల్ పై చిత్రీకరింపబడిన ఈ పాట తాగుబోతుపాటల్లో ఎన్నదగినది. ఈ సినిమాను తెలుగులో 'తిరుపతి' గా రీమేక్ చేసినపుడు ఈ సందర్భంలోని 'రాయిరా దేవుడు, తాగినా ఊగడు' పాటలో ఈ బాణీ ఛాయలు కనబడతాయి.

**చిత్రం : దో బిఘా జమీన్**
రచన : శైలేంద్ర — గాయని : లతా

ఆ జారే ఆ నిందియా తూ ఆ
ఝిల్‌మిల్ సితారోం సే ఉతర్ ఆంఖోం మే ఆ సప్‌నే సజా
సోయీ కలీ సోయీ చమన్ పీపల్ తలే సోయీ హవా
సబ్ రంగ్ ఇక్ రంగ్ మే తూనే యే క్యా జాదూ కియా ॥ఆ జారే॥
సంసార్ కీ రానీ హై తూ రాజా హై మేరా లాడ్‌లా
దునియా హై మేరీ గోద్ మే సోయా హువా సప్‌నా మేరా ॥ఆ జారే॥

హిందీ జోలపాటల్లో అన్నిటికంటె గొప్పది 'అల్‌బేలా'లోని 'ధీరేసే ఆజా' అని చాలామంది అంటారు. కానీ ఆ పాటను కూర్చిన సి.రామచంద్ర మాత్రం తన పాటకంటె ఈ పాట గొప్పది అన్నారు.



# తెలుగు సినీ గీత కోశం

| నెం. | పాట | చిత్రం పేరు | సం॥ | సంగీత దర్శకుడు | రచన | గానం |
|---|---|---|---|---|---|---|
| 1166 | మల్లెపూల మంచం వుంది | ప్రయివేట్ మాష్టరు | 1967 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | సుశీల |
| 1167 | అద్దంలో కనిపించేది ఎవరికివారు | ప్రయివేట్ మాష్టరు | 1967 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఘంటసాల, సుశీల |
| 1168 | చిరు చిరు జల్లుల చినుకుల్లారా | ప్రయివేట్ మాష్టరు | 1967 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | సుశీల |
| 1169 | మనసుంటే చాలదులే మనిషికి | ప్రయివేట్ మాష్టరు | 1967 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | జానకి |
| 1170 | పాడుకో పాడుకో | ప్రయివేట్ మాష్టరు | 1967 | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | ఎస్.పి.బాలు |
| 1171 | తెరవకు తెరవకు | ప్రయివేట్ మాష్టరు | 1967 | కె.వి.మహదేవన్ | సి.నారాయణరెడ్డి | ఘంటసాల |
| 1172 | ఎక్కడ వుంటావో | ప్రయివేట్ మాష్టరు | 1967 | కె.వి.మహదేవన్ | సి.నారాయణరెడ్డి | పి.బి.శ్రీనివాస్, జానకి |
| 1173 | ఎక్కడికి వెళ్ళేవే పిల్లా | ప్రయివేట్ మాష్టరు | 1967 | కె.వి.మహదేవన్ | కొసరాజు | పిఠాపురం, సుశీల |
| 1174 | దీపాలు వెలిగే | పునర్జన్మ | 1963 | టి.చలపతిరావు | దాశరథి | సుశీల |
| 1175 | మానవుడా కలవరమేలా | పునర్జన్మ | 1963 | టి.చలపతిరావు | శ్రీశ్రీ | సుశీల, బృందం |
| 1176 | నీ కోసం నీ కోసం | పునర్జన్మ | 1963 | టి.చలపతిరావు | సి.నారాయణరెడ్డి | సుశీల |
| 1177 | ఓ సజీవ శిల్ప సుందరి | పునర్జన్మ | 1963 | టి.చలపతిరావు | శ్రీశ్రీ | ఘంటసాల |
| 1178 | పూలు విరిసెను తేనె కురిసెను | పునర్జన్మ | 1963 | టి.చలపతిరావు | దాశరథి | సుశీల |
| 1179 | ప్రేయసి ప్రేమగా పిలిచిన వేళ | పునర్జన్మ | 1963 | టి.చలపతిరావు | శ్రీశ్రీ | ఘంటసాల |
| 1180 | చారెడేసి కన్నులతో | రహస్యం | 1967 | ఘంటసాల | మల్లాది | ఘంటసాల, సుశీల |
| 1181 | గిరిజా కళ్యాణం | రహస్యం | 1967 | ఘంటసాల | మల్లాది | ఘంటసాల, లీల, వైదేహి, వసంత, మల్లిక్ |
| 1182 | మగరాయ వలరాయ | రహస్యం | 1967 | ఘంటసాల | మల్లాది | సుశీల |
| 1183 | తిరుమలగిరి వాసా | రహస్యం | 1967 | ఘంటసాల | మల్లాది | ఘంటసాల |
| 1184 | లలిత భావ నిలయా | రహస్యం | 1967 | ఘంటసాల | మల్లాది | ఘంటసాల, వైదేహి, సరోజిని, కోమల |
| 1185 | ఇదియే దేవ రహస్యం | రహస్యం | 1967 | ఘంటసాల | ఆరుద్ర | సుశీల, పి.లీల |
| 1186 | శ్రీ లలితా శివజ్యోతి సర్వకామదా | రహస్యం | 1967 | ఘంటసాల | మల్లాది | పి.లీల |
| 1187 | ఏవో కనులు కరుణించినవి | రహస్యం | 1967 | ఘంటసాల | మల్లాది | ఘంటసాల, లీల |
| 1188 | వున్నదిలే దాగున్నదిలే | రహస్యం | 1967 | ఘంటసాల | సి.నారాయణరెడ్డి | ఘంటసాల, సుశీల |
| 1189 | సాధించిన మాట సత్యామయ్యా | రహస్యం | 1967 | ఘంటసాల | సదాశివబ్రహ్మం | ఘంటసాల |
| 1190 | సాధించనౌనా జగాన | రహస్యం | 1967 | ఘంటసాల | సముద్రాల | ఘంటసాల, సుశీల |
| 1191 | అమ్మ దొంగ ఎగాదిగా చూస్తావు | రాజమహల్ | 1972 | టి.వి.రాజు | ప్రయాగ | ఎస్.జానకి |
| 1192 | చెలిమి పంచుకునే వేళాయే | రాజమహల్ | 1972 | టి.వి.రాజు | దాశరథి | ఎస్.జానకి |
| 1193 | మగువే ఒక నిషారా | రాజమహల్ | 1972 | టి.వి.రాజు | సి.ఆర్.స్వామి | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 1194 | నన్నే తెలుసుకో | రాజమహల్ | 1972 | టి.వి.రాజు | దాశరథి | ఎస్.జానకి |
| 1195 | ఈ నిషా రేయిలోనా | రాజమహల్ | 1972 | టి.వి.రాజు | విజయ రత్నం | సుశీల |
| 1196 | నచ్చినవాడు మనసిచ్చినవాడు | రాజయోగం | 1968 | సత్యం | వీటూరి | ఎస్.జానకి, లతా |
| 1197 | రావోయి నిన్నే పిలిచెను | రాజయోగం | 1968 | సత్యం | వీటూరి | లతా |
| 1198 | తాళం వెయ్యాలి లోకం ఊగాలి | రాజయోగం | 1968 | సత్యం | వీటూరి | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 1199 | ఈ లోకాన ఎవరైనా | రాజయోగం | 1968 | సత్యం | వీటూరి | ఎస్.పి.బాలు |
| 1200 | ఈ సమయం ఏమిటో ఈ మైకం | రాజయోగం | 1968 | సత్యం | వీటూరి | పి.బి.శ్రీనివాస్, ఎస్.జానకి |
| 1201 | కాదులే కల కాదులే | రాజయోగం | 1968 | సత్యం | వీటూరి | జానకి, బాలు |
| 1202 | సురుచిర సుందర హాస | రాజయోగం | 1968 | సత్యం | వీటూరి | ఎస్.పి.బాలు, సుశీల |
| 1203 | పిట పిటలాడే చిన్నది | రాజు వెడలె | 1976 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఎస్.పి.బాలు |
| 1204 | రాజు వెడలె రభసకు | రాజు వెడలె | 1976 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఎస్.పి.బాలు |
| 1205 | అమ్మ నీ సోకుమాడ | రాజు వెడలె | 1976 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఎస్.పి.బాలు, సుశీల |
| 1206 | చిక్ చిక్ చిక్కవులే | రాజు వెడలె | 1976 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఎస్.పి.బాలు |
| 1207 | తోడేస్తున్నావు | రాజు వెడలె | 1976 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఎస్.పి.బాలు, సుశీల |
| 1208 | తాత తాత ముంజికాయ మూతా | రాజు వెడలె | 1976 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఎస్.పి.బాలు, సత్యం, రమేష్ |
| 1209 | చందురుని మించు అందమొలికించు | రక్తసంబంధం | 1962 | ఘంటసాల | అనిసెట్టి | ఘంటసాల, సుశీల |
| 1210 | ఆకాశమేలే అందాల రాజే | రక్తసంబంధం | 1962 | ఘంటసాల | సి.నారాయణరెడ్డి | ఎస్.జానకి, బృందం |
| 1211 | బంగారు బొమ్మ రావేమే | రక్తసంబంధం | 1962 | ఘంటసాల | ఆరుద్ర | సుశీల, బృందం |
| 1212 | మంచిరోజు వస్తుంది | రక్తసంబంధం | 1962 | ఘంటసాల | కొసరాజు | ఘంటసాల, సుశీల |
| 1213 | పెంచిన తోటమాలి వెళ్ళిపోయే | రక్తసంబంధం | 1962 | ఘంటసాల | దాశరథి | ఘంటసాల |
| 1214 | ఒహో వయ్యారి వదినా వులుకెందుకే | రక్తసంబంధం | 1962 | ఘంటసాల | ఆరుద్ర | సుశీల |
| 1215 | ఎవరో నను కవ్వించిపోయేదెవరో | రక్తసంబంధం | 1962 | ఘంటసాల | సి.నారాయణరెడ్డి | పి.బి.శ్రీనివాస్, సుశీల |
| 1216 | ఇదే రక్తసంబంధం | రక్తసంబంధం | 1962 | ఘంటసాల | దాశరథి | ఘంటసాల |

**సేకరణ: పున్నమరాజు శేషగిరిరావు, విశాఖపట్నం.**

వచ్చే సంచికలో మరికొన్ని

## హాసం పాఠక మిత్రులకు నమస్సులు



హాస్య సంగీతాల మేలు కలయిక అయిన 'హాసం' కు ఆది నుండీ నేను వీరాభిమానిని. పది కాలాలు పదిలంగా దాచుకునే విధంగా ప్రతి సంచికను తీర్చిదిద్దుతున్న సంపాదకులు నిజంగా అభినందనీయులు. ఇంత మంచి పత్రికలో 'నేను సైతం ఏదైనా రాయాలి' అన్న తపన ఎన్నాళ్ళుగానో వుంది. ఆ మధ్య రాజాగారితో ఫోన్‌లో మాట్లాడుతూ ఇదే మాటన్నాను. అంటూ కొన్ని 'వెన్నెలకంటి పద్యాలను' కొన్ని 'వెన్నెలమ్మ పదాలను' వినిపించాను. రాజాగారు వెంటనే స్పందించి **"బావుంది...వెన్నెలకంటి వెలుగులు"** అనే శీర్షికతో ప్రతి సంచికలోనూ రాయండి" అంటూ ఆహ్వానించారు. నేనూ ఎగిరి గంతేసి ఒప్పేసుకున్నాను. గనక ప్రతి సంచికలోనూ మిమ్మల్ని అలరించే విధంగా పద్యాలు పదాలు అల్లే బాధ్యతను మీదేసుకున్నాను.

ఆ పద్యాలు పదాలు ఎలా వుంటాయంటే... అబ్బే... వినబోతూ... రుచెందుకులెండి... వచ్చే సంచిక నుంచి మీరే చూస్తారుగా... చూసి ఎలా వున్నాయో మీరే చెప్పాలి.

- మీ

**వెన్నెలకంటి**

# మళ్లీ జనం లోకి....

ఇప్పటివరకు మనకు తెలియని త్యాగరాజస్వామి కీర్తనలు తంజావూరు లైబ్రరీలో దొరికాయని ఆ మధ్య వార్తలు వచ్చాయి.

నలభై యేళ్ల క్రితం ఎల్విస్ ప్రెస్లీ పాడిన పాట ఒకటి కొత్తగా వెలుగు చూస్తోంది. 'రౌండ్ ఎబౌట్' అనే సినిమాకై 1964లో 'ఐ యామ్ ఎ రౌండ్ఎబౌట్' అనే పాట ఎల్విస్ ప్రెస్లీ పాడాడు. కానీ ప్రొడ్యూసర్ ఈ పాట కాకుండా వేరేదాన్ని ఎంచుకోవడంతో ఈ పాట మరుగున పడింది.

ఆ పాట రాసిన విన్‌ఫీల్డ్ స్కాట్, ఓటిస్ బ్లాక్‌వెల్ అనే అతనితో కలిసి పాటను కంపోజ్ చేయడం జరిగింది. తిరస్కరించబడ్డాక ఈ పాట టేపును తన కలక్షన్‌లో దాచుకున్నాడు. దాని సంగతి అందరూ మర్చిపోయాక ఇన్నాళ్లకి అతని న్యూజెర్సీ నివాసంలో బేస్‌మెంట్‌లో పాట దొరికింది. బి.ఎమ్.జి. అనే రికార్డింగు సంస్థకు అందజేశాడు. వాళ్లు అక్టోబరు 7 న 'ఎల్విస్, సెకండ్ టు నన్' అనే ఆల్బమ్ విడుదల చేస్తూ దానిలో ఈ పాటను చేరుస్తున్నారు. ఎల్విస్ మరణించిన 26 ఏళ్లకు అతని అభిమానులకు ఈ కానుక అందుతోంది.

అదే విధంగా మదన్‌మోహన్ అభిమానులకూ కానుక అందుతోంది - ఆయన మరణించిన 28 ఏళ్లకు! ఈయన విషయంలో ట్యూన్‌లను భద్ర పరచినది కుటుంబసభ్యులే! అవి విన్న యశ్ చోప్రా తను ప్రస్తుతం తీయబోయే సినిమాలో ఉపయోగిద్దామని నిశ్చయించుకున్నారు. సెన్సిటివ్ చిత్రాలను తీయడంలో సిద్ధహస్తుడనిపించుకున్న యశ్ మాధుర్య భరితమైన మదన్‌మోహన్ బాణీల కనుగుణంగా గీతాలు రాయించి మనను మళ్లీ మదనమోహనసీమకు మళ్లిస్తారని ఆశించవచ్చు.



రాజ్‌కపూర్ వద్ద ఇంకా ఎన్నో ట్యూన్‌లు ఉపయోగించ బడకుండా ఉండేవంటారు. శంకర్ జైకిషన్‌ల చేత ఆయన ఎన్నో బాణీలు కట్టించి సందర్భం దొరక్క తన వద్దనే భద్రపరిచా డట. 'రామ్ తేరీ గంగా మైలీ' వంటి సినిమాలలో కొన్ని వాడాడట. రాజ్‌కపూర్ మృతి చెందాక ఆయన వారసుల వద్ద ఈ ట్యూన్‌లు ఉండే వుంటాయి. వాటిని కూడా ఎవరైనా వెలుగులోకి తీసుకువస్తే ఎంతో బాగుంటుంది.

ఇక తెలుగురంగానికి వస్తే రామానాయుడు గారు లోగడ తను తీసిన సినిమాలలో - చిత్రీకరణ కూడా అయిపోయిన పాటలు - సినిమాకొక్కటి చొప్పున - పక్కన పెట్టేసేవాణ్ణని ఈ పత్రిక ఎడిటర్ రాజాతో ఒకసారి అన్నారు. అవన్నీ కలిపితే ఓ పది సినిమాల దాకా - తిరిగి పాటల్ని రాయించి, కంపోజ్ చేయించవలసిన అవసరమే లేదు. చిత్రీకరణ పూర్తయిపోయిన పాటలు కూడా వున్నాయి కాబట్టి వాటిని - కథలో సరదాగా కలుపుకున్నా ఆనాటి తారలను మళ్ళీ సజీవంగా చూసే అవకాశం ప్రేక్షకులకు కలుగుతుంది కదా" అని రాజా ఆయనతో అన్నప్పుడు 'అలాంటి ఆలోచన కూడా లేకపోలేదు' అని ఆయన సమాధానమిచ్చారు. సమయం చూసి వాటిని జనంలోకి తెస్తే కళ అజరామరమయినదనీ, కళాకారుల కీర్తికాయులై కలకాలం నిలుస్తారనీ మరొక్కసారి ఋజువవుతుంది.

- కమ్యూనికేటర్ ఫీచర్స్

---

# హిందీ సినీ సంగీతంలో మలుపులు-మజిలీలు

### 1958

సమ్రాట్ చంద్రగుప్త చిత్రంతో కళ్యాణ్‌జీ చిత్ర ప్రవేశం. ఆ చిత్రంలోని 'ముఝే దేఖ్ ఛాంద్ షర్మాయే..' ని కథానాయిక నిరుపమా రాయ్ రాసినట్టు టైటిల్స్‌లో వేశారు.



కళ్యాణ్‌జీ

ఈ చిత్రంలోని లతా-మన్నాడేల 'యే సమా హై మేరా దిల్ జవాఁ', లతా-రఫీల చాహే పాస్ హో చాహె దూర్ హో', 'భర్ భర్ ఆయీ అంఖియాఁ' హిట్ అయ్యాయి. పోస్ట్ బాక్స్ 999 చిత్రంలో లతా-హేమంత్‌ల 'ఓ నీంద్ న ముఝ్‌కో ఆయే, దిల్ మేరా ఘబ్‌రాయే', లతా పాడిన 'అ రే మైతో గిరీ రే గిరీ రే గిరీ రే, కోయీ సంభాలో' పాటలు చక్కటి హిట్స్. సోదరుని దగ్గర అసిస్టెంట్‌గా ఈ చిత్రాలకు పనిచేసిన ఆనంద్‌జీ తర్వాత సహ సంగీత దర్శకునిగా మారారు. వీరిద్దరి కాంబినేషన్‌లో ఎన్నో మ్యూజికల్ హిట్స్ వచ్చిన సంగతి తెల్సిందే.



ఆనంద్ బక్షి

భగవాన్ స్వంత చిత్రం 'భలా ఆద్మీ' ద్వారా ఆనంద్ బక్షి గీత రచయితగా నిస్సార్ సంగీత దర్శకత్వంలో పరిచయం. అయిదు పాటలు రాసినప్పటికీ 'ధర్తీ కే లాల్ న కర్ ఇత్‌నా మలాల్... పాట ఆయనకు మంచి పేరు తీసుకురావటమే కాదు తర్వాత అర్ధ శతాబ్దం పాటు ఆయన వెనక్కి తిరిగి చూసుకునే అవసరం లేకుండా చేసింది.



'సాధనా' చిత్రంలో వైజయంతీమాల, సునీల్‌దత్, రాధాకిషన్, లీలాచిట్నిస్

ఈ సంవత్సరంలో మదన్‌మోహన్ చాలా సినిమాలకు కంపోజ్ చేశారు. 'జైలర్' చిత్రంలో లతా గానం చేసిన 'హమ్ ప్యార్ మేఁ జల్‌నే వాలోఁ కో...', 'ఆఖరీ దావ్' చిత్రంలో రఫీ పాడిన 'తుఝే క్యా సునావూ మైఁ దిల్ రుబా', 'అదాలత్' చిత్రం కోసం లతా పాడిన 'జానా థా హమ్‌సే దూర్ బహానే బనాలియే', 'జా జా రే జా సాజ్‌నా', 'ఉన్‌కో యే షికాయత్ హై కి హమ్ కుఛ్ నహీ కహతే', 'యూఁ హసరతోఁ కే దాగ్' పాటలు హిట్ అయి ఆయనకు మంచి పేరు తీసుకువచ్చాయి.

'ఆజ బస్ షుక్రియా' చిత్రం కోసం రోషన్ స్వరపరిచిన 'సారీ సారీ రాత్ తేరీ యాద్ సతాయే' పాట పెద్ద హిట్. లతా ఈ పాటను పాడారు.

'సాధనా' చిత్రం కోసం ఎన్.దత్తా స్వరపరిచిన 'ఔరత్ నే జనమ్ దియా మర్దోఁ కో' పాట సాహిర్-లతా కాంబినేషన్‌లో ఆణి ముత్యంగా వెలుగొంద టమే కాదు దత్తా కెరీర్‌లో పెద్ద హిట్ నిలిచిపోయిం ది. అలాగే 'లైట్ హౌస్' చిత్రం కోసం ఆశాభోంస్లే గానం చేసిన 'తంగ్ ఆ చుకే హై', 'ఓ కిస్ జగహ్ జాయే కిస్‌కో దిఖ్‌లాయేఁ' పాటలు కూడా మంచి హిట్స్.

-(వచ్చే సంచికలో మరికొంత)

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

- చిత్రం : కోయీ మిల్ గయా
- రచన : ఇబ్రహీం అష్క్
- సంగీతం : రాజేష్ రోషన్
- గానం : ఉదిత్ నారాయణ్, చిత్ర
- అభినయం : హృతిక్ రోషన్, ప్రీతీ జింటా







## కో యీ మి ల్ గ యా...





ఆ: ఖాబోఁ, ఖయాలోఁ, ఖాహిషోఁ కా చెహరా మిలా (2)
మేరే హోనే కా మత్‌లబ్ మిలా
కోయీ మిల్ గయా (2)
అ: కౌన్ మిల్ గయా?
ఆ: కోయీ మిల్ గయా
అ: యూఁ తో హమ్ తుమ్ మిల్‌నే కో మిల్‌తే రహే (2)
పర్ క్యోఁ ఆజ్ ఐసా లగా
కోయీ మిల్ గయా (2)
ఆ: కౌన్ మిల్ గయా?
అ: కోయీ మిల్ గయా
ఆ: ముఝ్‌సే మిల్‌కర్ క్యా హోతా హై యే బత్‌లావో నా, యే బత్‌లావో నా
అ: బాత్ యే హమ్ కానోఁ మేఁ కహేంగే పాస్ మేఁ ఆవోనా, పాస్ మేఁ ఆవోనా
ఆ: జో బాత్ తుమ్ కహోగే వో బాత్ మైఁ భీ జానూఁ
యే పాస్ మేఁ ఆనే కీ మై బాత్ నహీఁ మానూఁ
అ: సునో నా సునో నా, సునో నా
యూఁ తో బాతేఁ కర్‌నే కో కర్‌తే రహే
పర్ క్యోఁ ఆజ్ ఐసా లగా ॥కోయీ మిల్ గయా॥
అ: ఆకర్ మేరే పాస్ మేఁ తుమ్ హో, జాకర్ భీ హెూ పాస్, జాకర్ భీ హెూ పాస్
ఆ: ఇస్ ఎహ్‌సాస్ కే జైసా కోయీ ఔర్ నహీఁ ఎహసాస్, ఔర్ నహీఁ ఎహసాస్
అ: యే జో భీ హో రహా హై క్యోఁ జాన్‌తా నహీఁ మైఁ
అప్‌నే హీ దిల్ కీ బాతేఁ పెహచాన్‌తా నహీఁ మైఁ
ఆ: పెహచానో, పెహచానో, పెహచానో
దిల్‌తో అప్‌నా పెహలే భీ ధడ్‌కా కియా
పర్ క్యోఁ ఆజ్ ఐసా లగా ॥కోయీ మిల్ గయా॥



భారత దేశపు తొలి సైన్స్ ఫిక్షన్ చిత్రంగా 'కోయీ మిల్ గయా' చిత్రానికి ప్రచారం లభించింది. సైన్స్ ఫిక్షన్ అంటే కేవలం అంతరిక్షనౌకలు, గ్రహాంతర వాసుల గురించిన కథలే అయితే ఇది నిజమే. కానీ 'మిస్టర్ ఇండియా' (హిందీ), 'ఆదిత్య 369' (తెలుగు) వంటి కల్పనాత్మకమైన చిత్రాలు ఇంతకు ముందు వచ్చాయి. గ్రహాంతరవాసులు అంటూ ఉంటే, వారు భూమి మీదకు వస్తే ఎలా ఉంటుందనే కొత్త కోణాన్ని భారతీయులకు పరిచయం చేసిన ఘనత 'కోయీ మిల్ గయా' చిత్రానికే దక్కుతుంది. హాలీవుడ్‌లో ఇలాంటి చిత్రాలు సర్వసాధారణం. స్టీవెన్ స్పీల్‌బర్గ్ తీసిన 'ఇ.టి. - ఎక్స్‌ట్రా టెరెస్ట్రియల్' నుంచి గత సంవత్సరం భారతీయ సంతతికి చెందిన మనోజ్ నైట్ శ్యామలన్ తీసిన 'సైన్స్' వరకు ఈ చిత్రాలు విజయం సాధిస్తూనే ఉన్నాయి. 'కోయీ మిల్ గయా' చిత్రం కూడా ఘనవిజయం సాధించి కొత్త ఒరవడి సృష్టించింది.



'కహోనా ప్యార్ హై' చిత్రం ద్వారా తన కుమారుడు హృతిక్ రోషన్‌ను హీరోగా పరిచయం చేసిన రాకేష్ రోషన్ తదుపరి చిత్రం 'కోయీ మిల్ గయా'. ఇందులో కూడా హృతికే హీరో అయినా అతనిది చాలా భిన్నమైన పాత్ర. తల్లి గర్భంలో ఉండగా ఆమెకు జరిగిన యాక్సిడెంట్ వల్ల తలకు గాయమై మానసిక పరిణితి చెందని యువకుడిగా నటించాడు. పెరిగి పెద్దవాడైనా చిన్నపిల్లల మనస్తత్వం కలవాడిగా అతని నటనను చిత్ర పరిశ్రమ, ప్రజలు వేనోళ్ళ కొనియాడుతున్నారు. హృతిక్ నటించిన గత నాలుగు చిత్రాలు సరిగా ఆడకపోవటంతో ఈ చిత్ర విజయం అతనికి కొత్త ఊపిరినిచ్చిందనే చెప్పాలి. ఈ చిత్రకథ 'ఇ.టి- ఎక్స్‌ట్రా టెరెస్ట్రియల్' నుంచి ఇన్‌స్పయిర్ అయినదే. అందులో పిల్లలే ముఖ్యపాత్రధారులు. కానీ మనదేశంలో పిల్లలు ముఖ్యపాత్రధారులుగా తీసిన సినిమాలకు మార్కెట్ లేనందువల్ల (ఇది బాధాకరమైన విషయం) హీరోని చిన్న పిల్లవాడిగా చూపించారు. తెలుగులో వచ్చిన 'స్వాతిముత్యం' (హిందీలో 'ఈశ్వర్'), ఆంగ్లంలో వచ్చిన 'ఫారెస్ట్ గంప్ చిత్రాలలో నాయకుడిలా నిష్కల్మషత్వం, పట్టుదల కలిగిన పాత్ర అది.

ఈ చిత్రంలో ఏలియన్ (గ్రహాంతరవాసి) పాత్ర ధరించినది ఛోటూ దాదాగా చిత్రపరిశ్రమలో పేరు గడించిన మరుగుజ్జు నటుడు. 30 సంవత్సరాలుగా అతను పలు చిత్రాలలో నటిస్తున్నాడు. హాలీవుడ్‌లో సంచలనం సృష్టించిన 'ద లార్డ్ ఆఫ్ ద రింగ్స్' చిత్రంలో హాబిట్స్ అనే మరుగుజ్జు పాత్రలలో ఒకడిగా నటించాడు. 'కోయీ మిల్ గయా' లో అతని పాత్ర పేరు జాదూ. జాదూ అంటే మ్యాజిక్ అని అర్థం. వేరే గ్రహం నుంచి భూమికి వచ్చి నాయకుడితో, అతని సహచరులైన పిల్లలతో స్నేహం చేసి తన అద్భుత శక్తులతో వారిని మురిపించి, ఆ శక్తులను నాయకుడికి ఇచ్చే పాత్ర ఇది. ఇలాంటి పాత్రకు పిల్లలలో ఎంత ఆదరణ లభిస్తుందో ఊహించవచ్చు. 'జాదూ జాదూ' అనే పాట కూడా ఉంది ఈ చిత్రంలో.

ప్రీతీ జింటా ఈ చిత్రంలో హీరోయిన్. హీరో తల్లి పాత్రను ప్రముఖ నటి రేఖ పోషించారు. హీరో స్నేహితులుగా ఆరుగురు పిల్లలు నటించారు. హీరో తండ్రిగా అతిధి పాత్రలో రాకేష్ రోషన్ నటించారు. ఈయన ఒక సైంటిస్ట్. ఇతర గ్రహాలపై ప్రాణికోటి ఉందని నమ్మిన వ్యక్తి. సృష్టికి మూలమని హిందువులు భావించే ఓంకార నాదాన్ని అంతరిక్షంలోకి ప్రసారం చేస్తాడు. దానికి ప్రతిస్పందన అంతరిక్షం నుండి వస్తుంది. దీనితో అతడి నమ్మకం బలపడుతుంది. కానీ అతని మాటలను అధికారులు నమ్మరు. ఆ తరువాత జరిగిన ప్రమాదంలో అతను మరణిస్తాడు. గర్భవతి అయిన అతని భార్య గాయపడుతుంది. హృతిక్ పుట్టి పెరిగి చిన్నపిల్లలలో ఒకడిగా మెలుగుతుంటాడు. ఒక అంతరిక్షనౌక భూమికి వస్తుంది. అందులోని ఒక ఏలియన్ భూమిపై ఉండిపోతుంది. ఈ విషయం తెలిసిన అధికారులు ఆ ఏలియన్‌ని స్వాధీనం చేసుకోవాలనుకుంటారు. హృతిక్, అతని సహచరులు ఆ ఏలియన్‌ని రక్షించి దాని గ్రహానికి తిరిగి పంపుతారు.



రాకేష్ రోషన్ చిత్రాలన్నిటికీ సంగీతం అందించే రాజేష్ రోషన్ ఈ చిత్రానికి కూడా సంగీతం అందించారు. 'జాదూ జాదూ' పాట ట్యూన్ ఆకటుకుంటుంది. పిల్లలకు, పెద్దలకు అవలీలగా పట్టుబడే ట్యూన్ కావటంతో అందరూ పాడుకునే పాటగా మారింది. 'ఇధర్ చలా మైఁ ఉధర్ చలా' హీరో చిలిపి చేష్టలతో సాగే సరదా పాట. 'ఇట్స్ మ్యాజిక్' పాట స్టీరియో నేషన్ బ్యాండ్‌కి చెందిన తాజ్ పాడారు. అర్భకుడిలా ఉండే హీరో ఒక్కసారిగా అద్భుతంగా డ్యాన్స్ చేస్తే ఉండే షాక్ వ్యాల్యూని చక్కగా క్యాష్ చేసుకున్న పాట ఇది. హృతిక్ డ్యాన్స్ స్కిల్‌కి చక్కని షోకేస్. 'హైలా హైలా' పాట హుషారైన డ్యూయెట్. 'నమక్‌హలాల్'లోని 'ఆజ్ రపట్ జాయే' పాట చరణాల ట్యూన్ గుర్తు తెచ్చే ట్యూన్ జతపడింది. 'ఇన్ పంఛియోఁ' పాట సందర్భాన్ని దృష్టిలో పెట్టుకుంటే రాజేష్ రోషన్ తన సోదరుడి చిత్రాలకు అన్నీ మంచి ట్యూన్లే ఇస్తారనే వాదన నిజమే కదా అనిపిస్తుంది. ఇక 'కోయీ మిల్ గయా' పాట అందమైన ప్రేమ గీతం.

'కోయీ మిల్ గయా' అంటే 'నేస్తం దొరికింది', 'తోడు దొరికింది' అని. చిత్రకథను బట్టి ఇది ఏలియన్‌కు వర్తించినా ఈ పాటలో హీరోహీరోయిన్లకే వర్తిస్తుంది. 'కుఛ్ కుఛ్ హోతా హై' లోని హిట్ పాట 'కోయీ మిల్ గయా' ప్రభావం ఏమాత్రం పడకుండా, అసలు ఆ పాట గుర్తు కూడా రాకుండా ఈ పాటను మలచిన రాజేష్ రోషన్ ప్రతిభను పొగడకుండా ఉండలేం.

ఖాబ్ అంటే కల. ఖయాల్ అంటే ఊహ, తలపు. ఖాహిష్ అంటే కోరిక, ఆశ. చెహరా అంటే ముఖం, రూపం. ఆకృతి అని కూడా అనుకోవచ్చు. మత్‌లబ్ అంటే అర్థం.

**ఆ: 'కలలు, ఊహలు, ఆశలకు ఆకృతి వచ్చింది**
**నా ఉనికికి అర్థం తెలిసింది**
**ఒక తోడు దొరికింది'**
**అ: ఎవరు దొరికారు?**
**ఆ: ఒక తోడు దొరికింది**
**అ: ఇన్నాళ్ళూ నువ్వు, నేను కలుసుకుంటూనే ఉన్నాం**
**కానీ నేడు ఎందుకో అనిపించింది**
**ఒక తోడు దొరికిందని**
**ఆ: ఎవరు దొరికారు?**
**అ: ఒక తోడు దొరికింది**

ఆమె కలల్లో ఊహించుకున్న రాజకుమారుడు అతనేనని ఆమెకు తెలిసింది. ఇన్నాళ్ళూ కలుసుకుంటూనే ఉన్నా ఈనాటికి మనసులో ఉన్న ప్రేమ తెలిసింది. అబ్బాయి, అమ్మాయి స్నేహితులుగా ఉండి తరువాత ప్రేమలో పడే సందర్భాలు హిందీ సినిమాలలో కొన్ని ఉన్నా ఇంత చక్కటి పాట రాలేదనే అనిపిస్తుంది.

**ఆ: నాతో ఉంటే ఎలా ఉంటుందో కాస్త తెలుపవా, కాస్త తెలుపవా**
**అ: ఆ మాట నేను చెవిలో చెబుతా చెంతకు రావా, చెంతకు రావా**
**ఆ: నువు చెప్పే మాట ఏంటో నాకు బాగా తెలుసు**
**ఇలా చెంతకు రమ్మంటే నేను ఒప్పుకోను**
**అ: వినరాదా, వినరాదా, వినరాదా**
**ఇన్నాళ్ళూ ఊసులెన్నో చెప్పుకుంటూనే ఉన్నాం.**
**కానీ నేడు ఎందుకో అనిపించింది**
**ఒక తోడు దొరికిందని**

ప్రేమికులు చెప్పుకునే స్వీట్ నథింగ్స్, చిన్న చిన్న అలకలు చక్కగా వివరించారు ఇక్కడ. ఇన్నాళ్ళూ ఎన్నో మాటలు చెప్పుకున్నా ఈనాడు చెప్పుకునే మాటలకు అర్థం ప్రేమ.

**అ: చెంతకొచ్చి చేరువయ్యావు, కనుమరుగైనా చేరువే, కనుమరుగైనా చేరువే**
**ఆ: ఈ అనుభూతిని మించిన అనుభూతి లేదులే, అనుభూతి లేదులే**
**అ: ఏదో అవుతోందిలే, ఎందుకో తెలియలేదు**
**నా మనసులోని మాట నాకే అంతుచిక్కలేదు.**
**ఆ: తెలుసుకో, తెలుసుకో, తెలుసుకో**
**ఈ హృదయం మునుపు కూడా స్పందించేది**
**కానీ నేడు ఎందుకో అనిపించింది**
**ఒక తోడు దొరికిందని**

నేస్తం కట్టి చేరువయిన వారు ఇప్పుడు ఎడబాటులో కూడా చేరువగానే ఉన్నారు. ప్రేమ మహత్తు అలాంటిది. ఆ మహత్తును మించినది లేదు. అమాయకుడైన అతనికి తన మనసులోని భావాలు ఏమిటో తెలియటం లేదు. అది ప్రేమే అని ఆమె చెబుతోంది. గుండె ఇంతకు ముందు కూడా సవ్వడి చేసినా ఇప్పుడు కొత్త భావాలతో నిండిపోయింది.

'కహో నా ప్యార్ హై' లో చక్కని గీతాలు వ్రాసి మెప్పించిన ఇబ్రహీం అష్క్ ఈ చిత్రంలో కూడా మంచి పాటలు వ్రాసి ఈ ఆడియో విజయానికి దోహదం చేశారు. ఈ ఆడియో హెచ్.ఎమ్.వి ద్వారా విడుదలయింది.

**- పి.వి. సత్యనారాయణ రాజు**

## శోకగీతాలకు అతడు పెట్టింది పేరు....కాదు ...పెట్టుకున్న పేరు - ఇబ్రహీమ్ అశ్క్



అతడి అసలు పేరు ఇబ్రహీమ్ ఖాన్. కానీ అతను దాన్ని ఇబ్రహీమ్ అశ్క్‌గా మార్చుకున్నాడు. అశ్క్ అంటే కన్నీరు. అదేం పేరు అంటే కవిత్వంలో 70 శాతం విషాదగీతాలే! అందుకే నేనా పేరు పెట్టుకున్నాను. 'కోయీ మిల్ గయా..'తో మళ్లీ అందరి దృష్టిలోనూ పడిన ఈ గేయరచయిత రోషన్ ఫ్యామిలీ ప్రొడక్షన్ 'కహో నా ప్యార్ హై' లో 'క్యూం చల్‌తీ హై పవన్..' పాట (అది ఒక ఇంగ్లీషు ట్యూనుకి అనుగుణంగా రాశాడట) ద్వారా, 'సితారోం కీ మెహఫిల్..' పాట ద్వారా తన కీర్తిబావుటాను ఎగరేశాడు.

అశ్క్ సినిమాపాటల కంటే ఘజల్స్ ద్వారా ఎక్కువ ఖ్యాతి గడించాడు. జగజిత్ సింగ్, చిత్రా సింగ్, భూపేందర్, మితాలీ సింగ్, అనూప్ జలోటా, హరిహరన్, సురేష్ వాడ్‌కర్, వాణీ జయరాం, కుమార్ సానూ, అల్కా యాజ్ఞిక్, అనూరాధా పొడ్వాల్ ఇత్యాదుల 600 ఆల్బమ్స్‌కు అతడు పాటలు రాశాడు. మొట్టమొదటిసారిగా హెచ్.ఎమ్.వి. వారి 'పర్వాజ్' ఆల్బమ్‌లో 'దీవారోం సే బాతే కర్‌నా..' పాట రాయడంతో మొదలయిన అతని ప్రస్థానం అవిరళ కృషితో అనాఘాతంగా సాగిపోతోంది.

ఘజల్స్ రాసేముందు అశ్క్ జర్నలిస్టుగా ఉండేవాడు. మధ్యప్రదేశ్‌లోని మాళ్వాలో జన్మించిన అశ్క్ హిందీభాషలో మాస్టర్స్ డిగ్రీ పొందాడు. ఉర్దూ అతని మాతృభాష. ఇండోర్ సమాచార్, సరితా, షమా-సుష్మా పత్రికలలో రాసేవాడు. ఇటీవలే ఘాలిబ్ రచనలపై ఒక విమర్శనాత్మక పుస్తకం వెలువరించాడు. చిన్నప్పుడే 1962లో చైనా దురాక్రమణ సందర్భంగా ఓ కవిత రాసి వాళ్ల ఊరివాడే అయిన కవి, హిందీ సినీగీతరచయిత ప్రదీప్‌కు చూపించాడు. ఆయన మెచ్చుకున్నాడు.

పత్రికలలో పనిచేశాక ప్రదీప్ ఆహ్వానం మేరకు హిందీ సినిమాలలో చేరదామని బొంబాయి వచ్చిన అశ్క్ గజల్స్ రాసి పేరు తెచ్చుకున్నాడు. దానితో హిందీ సినీరంగంలో ప్రవేశం సుగమం అయింది. అతడి మొదటి సినిమా 'గీత్ మేరే ప్యార్ కా' విడుదలే కాలేదు. టీవీ సీరియల్ 'జునూన్'కి పాట రాశాడు. 'డాన్' సినిమా తీసిన చంద్రా బారోట్ 'బాస్' తీయబోతూ కళ్యాణ్‌జీ ఆనంద్‌జీ సంగీతదర్శకత్వంలో అశ్క్‌చేత నాలుగుపాటలు రాయించాడు. కానీ కర్మకాలి ఏమో అదీ రిలీజ్ కాలేదు. చివరకు 1990 లో 'బహార్ ఆనే తక్' రిలీజయి 'మొహబ్బత్, ఇనాయత్' పాట పేరు తెచ్చిపెట్టింది.

ఆ తరువాత అతను పాటలు రాసిన సినిమాలు 'యే తేరా ఘర్ యే మేరా ఘర్, శివ్-రామ్, జీనా మర్‌నా తేరే సంగ్, దో పల్, ముహాఫిజ్ - ఇవేమీ సరిగా ఆడలేదు. మరి అశ్క్‌కు విషాద సంగీతం నచ్చడంలో ఆశ్చర్యం ఏముంది? సినిమాలు ఆడకపోయినా పాటలు బాగుండడంతో అతడికి పని లభిస్తూనే ఉంది. 2000 సంవత్సరంలో 'కహో నా ప్యార్ హై' వచ్చి అతనికి అన్ని విధాలా పేరుప్రఖ్యాతులను తెచ్చిపెట్టింది.

ప్రస్తుతం సుభాష్ ఘాయ్ 'చాందినీ చౌక్', ఫిరోజ్ ఖాన్ 'జానశీన్', 'థోడా తుమ్ బద్‌లో', 'మిస్ ఇండియా'లకు అశ్క్ పాటలు రాస్తున్నాడు.

- కమ్యూనికేటర్ ఫీచర్స్




# ‘అందువల్లే హిందీరంగంలో నాకు రావల్సినంత గుర్తింపు రాలేదు’

-(హమ్మ హమ్మ ఫేమ్) రెమో ఫెర్నాండేజ్

ఇండీ పాప్‌లో ఆంగ్ల గీతాలు పాడే వాళ్ళను తలుచుకుంటే మొట్టమొదట మదిలో మెదిలేది రెమో ఫెర్నాండేజ్. ఇండియన్ పాప్, రాక్ సింగర్‌గా 1987 నుండి ఆంగ్ల భాషలో పాటలు పాడుతున్న రెమో ఫెర్నాండేజ్ ఆల్బమ్స్ రికార్డు స్థాయిలో అమ్ముడుపోయి అతన్ని శిఖరాగ్రంలో నిలిపాయంటే అతిశయోక్తి కాదు. ఈ కేటగిరిలో గోల్డెన్ డిస్కులు పొందిన ఏకైక ఆంగ్ల గాయకుడు రెమోనే.

పోర్చుగీసు ఆధీనంలో ఉన్న గోవాలో 1953 మే 8వ తేదిన రెమో జన్మించాడు. పోర్చుగీసు, బ్రెజిలియన్, లాటిన్, అమెరికన్, గోవన్ సంగీతాలంటే అతని తండ్రికి అమితమైన ప్రీతి. చిన్నప్పట్నుంచే తండ్రి సేకరించిన వివిధ దేశాల, భాషల సంగీతాలను రెమో వినడం మొదలు పెట్టాడు. కొడుకుకు ఈ సంగీతం పట్ల ఉన్న ఆసక్తితో తండ్రి కూడా కొత్తగా మార్కెట్‌కు ఏ వాయిద్యం వచ్చినా కొనిపెడుతూ ఉండేవాడు. అలా చిన్నప్పట్నుంచే రెమోకు పాటలు, సంగీతం పట్ల ఓ రకమైన పట్టు వచ్చింది. ఐదేళ్ళ వయసులో పోర్చుగీసు పాట ఒకదాన్ని ప్రజల సమక్షంలో వేదిక మీద పాడి తన తల్లికి అంకితమిచ్చాడు రెమో. అదే పాటను తన రెండో ఆల్బమ్ ‘ఓల్డ్ గోల్డెన్ గోవన్’లోనూ పొందుపరిచాడు. సంగీతం పట్ల ఉన్న ఆసక్తితో స్కూల్‌లో చదువుతున్న రోజుల్లోనే పాపులర్ పాటల్ని పాడే ఓ మ్యూజిక్ గ్రూప్‌ను తయారు చేసుకున్నాడు. 1961లో గోవాలో మొట్టమొదటి ఎలక్ట్రిక్ పాప్ గ్రూప్ ‘ద బీట్ 4’ ను ఏర్పాటు చేశాడు. వీళ్ళు ‘ద బీట్‌లెన్’, ‘ద రోలింగ్ స్టోన్స్’, ‘ద షాడోస్’లోని పాటల్ని పాడేవారు. ఆ తర్వాత కెరీర్ దృష్ట్యా రెమో ముంబాయి చేరాడు. అక్కడ ఐదేళ్ళపాటు ఆర్కిటెక్చర్ విద్యను అభ్యసించాడు. ఆ విశాల ప్రదేశంలో ఓ సంగీతకారుడిగా, గాయకుడిగా ఎదిగాడు. ముంబాయి లోని ప్రముఖ రాక్ గ్రూప్ ‘ద సెవెజెస్’లో గాయకుడిగా, గిటారిస్ట్‌గా చేరాడు. అదే గ్రూప్‌తో కలిసి ‘పాలిడోర్ ఇండియా’ అనే ఆల్బమ్‌ను విడుదల చేశాడు. ఇందులో సగం వరకూ పాటల్ని రెమోనే కంపోజ్ చేశాడు. ఒక వైపు ఆర్కిటెక్చర్ కోర్సు చేస్తూనే మరోవైపు ‘ద సెవెజెస్’ గ్రూప్‌తోనూ, వ్యక్తిగతంగానూ - గాయకుడిగా అనేక ప్రదర్శనలు ఇచ్చాడు. ఆల్ ఇండియా రేడియోలో,

| | |
|---|---|
| పుట్టింది | : మే 8, 1953.... గోవాలో |
| తల్లిదండ్రులు | : బెర్నాడో, లౌజా |
| చదువు | : ఆర్కిటెక్చర్‌లో డిగ్రీ |
| అధ్యయనం | : పోర్చుగీసు, బ్రెజిలియన్, లాటిన్ అమెరికా, గోవన్ సంగీతాలు. |
| బాండ్ | : అనేక రకాల బాండ్స్‌లో కలిసి పనిచేశాడు. 1962లో తొలిసారి గోవాలో తొలి ఎలక్ట్రిక్ పాప్ గ్రూప్ ‘ద బీట్ 4’ను ఏర్పాటు చేశాడు. |
| కుటుంబం | : ఫ్రెంచ్ భార్య మిఛెల్, ఇద్దరు అబ్బాయిలు నోహ (17 సం.రాలు), జోనా (14 సం.రాలు) |
| ఇతరాలు | : తాను పాడే పాటల్ని తానే రాసుకుని పాడటమే కాకుండా, వాటికి ట్యూన్స్ సమకూర్చు కోవడం, వాయిద్యాలన్నింటినీ తానే ఉపయోగించి, రికార్డు చేయడం అలవాటు. |



దూరదర్శన్‌లతో పాటుగా 'గాడ్‌స్పెల్', 'జీసస్ క్రీస్ట్ సూపర్‌స్టార్', 'మెన్ ఆఫ్ లా మన్‌చా' నాటకాల్లో పాల్గొన్నాడు.

సంగీత ప్రియులకు రెమో సంగీతంలో వినిపించే కొత్త ధ్వనుల పట్ల ఎంతో మక్కువ. తన గిటార్‌ను సితార్‌లా మలచి అతనందించే ఇండో-వెస్ట్రన్ సంగీతం వాళ్ళను అమితంగా ఆకట్టుకునేది. దానికే తర్వాత 'రాగా రాక్' అనే పేరు స్థిరపడిపోయింది. ఆర్కిటెక్చర్ కోర్సు పూర్తి చేశాక రెమో అనేక దేశాలలో పర్యటించాడు. యూరప్, ఉత్తర అమెరికాలోని వివిధ దేశాలను చుట్టి వచ్చాడు. అక్కడి సంగీతాలను ఆకళింపు చేసుకున్నాడు. 1980లో భారత దేశానికి తిరిగి వచ్చాక, తన పర్యటన తాలుకు అనుభవాలను స్వరాలాపనలో ఉపయోగించుకున్నాడు. భారతీయ, లాటిన్ అమెరికా, రాక్ సంగీతాలను మిళితం చేస్తూ, కొత్త స్వరాలను అందించేందుకు 'ఇండియానా' అనే ఓ ఇండో వెస్ట్రన్ ఫ్యూజన్ బ్యాండ్‌ను రెమో ఏర్పరిచాడు.

1982లో 'గోవన్ క్రేజీ' పేరుతో ఓ ఆల్బమ్‌ను రెమో విడుదల చేశాడు. తన సొంత మినీ రికార్డింగ్ థియేటర్‌లో వాటిని రికార్డు చేశాడు. 'గోవానా' అనే డిస్ట్రిబ్యూషన్ కంపెనీ ద్వారా ఆ ఆల్బమ్‌ను విడుదల చేశాడు. ఆ రోజుల్లో ఆంగ్లంలో పాడిన పాప్‌సాంగ్స్‌కు ఆదరణ అంతగా ఉండేది కాదు. ఏ ఒక్క ఆడియో కంపెనీ అతని పాటల పట్ల ఆసక్తి చూపించకపోవడంతో సొంతగానే తన పాటల్ని ప్రజల దగ్గరకు తీసుకెళ్లే ప్రయత్నం చేశాడు రెమో. రెండు వేల క్యాసెట్లు తయారు చేసి, స్కూటర్ మీద తిరుగుతూ గోవాలో తెల్సినవాళ్ళందరికి పంచాడు. ఈ 'గోవన్ క్రేజీ' పాటలు శ్రోతల్ని బాగా ఆకట్టుకోవడంతో సినిమా నిర్మాతలు, దర్శకుల దృష్టి రెమో మీద పడింది. శ్యామ్ బెనగల్ 'త్రికాల్' కు సంగీతాన్ని సమకూర్చడంతో పాటు గుల్ ఆనంద్ 'జల్‌వా' సినిమా టైటిల్ సాంగ్‌ను పాడాడు. 1985లో 'ఓల్డ్ గోవన్ గోల్డ్' ఆల్బమ్‌ను విడుదల చేశాడు. పోర్చుగీసు, గోవన్ సంగీతాన్ని తనదైన శైలిలో పాడిన రెమో ఈ ఆడియోతో మంచిపేరు తెచ్చుకోవడమే కాకుండా కమర్షియల్ సక్సెస్‌నూ రుచి చూశాడు. 1986లో 'ప్యాక్ దట్ స్మాక్' అనే ఆల్బమ్‌ను విడుదల చేశాడు. ఓ చక్కటి సందేశాన్ని అందించిన ఆల్బమ్ ఇది. డ్రగ్ ఎడిక్ట్‌లను ఆ వ్యసనంతో పోరాడమని ప్రేరేపించే టైటిల్ సాంగ్ బాగా పాపులర్ అయ్యింది. అలానే ఈ సమాజం మహిళల పట్ల చూపుతున్న వివక్ష, మతపరమైన నియమాలతో కించపరచడంపై ధ్వజమెత్తాడు. అలానే భార్య మిచెల్, కొడుకు నోహ్‌ల నుద్దేశిస్తూ కొన్ని ప్రేమ గీతాలను ఈ ఆల్బమ్‌లో పొందుపరిచాడు. ఈ ఆల్బమ్‌కూడా ఇంగ్లీషులో రూపొందిన భారతీయ పాప్, రాక్ ఆల్బమ్స్‌లో రికార్డును సృష్టించింది. 1987లో విడుదల చేసిన 'బాంబే సిటీ' ఆల్బమ్‌లోని టైటిల్ సాంగ్‌లో మతకలహాలను రెమో తీవ్రంగా వ్యతిరేకించాడు. ఆ తర్వాత రాజకీయ నాయకుల అవినీతిని ఎండగడుతూ, ఎయిడ్స్‌పై పోరాటం చేయాలని చెబుతూ, 'పొలిటీషియన్స్ డోంట్ నో టు రాక్ ఎన్ రోల్' ఆల్బమ్‌ను రూపొందించాడు. ఆ తర్వాత ఎనిమిదేళ్ళ విరామం తర్వాత రెమో 'ఓ మేరీ మున్ని' పేరుతో తొలి హిందీ పాప్ ఆల్బమ్‌ను 1998లో విడుదల చేశాడు. గత ఆల్బమ్స్‌కు పూర్తి భిన్నంగా, కమర్షియల్ ఎలిమెంట్స్‌కు ప్రాధాన్యం ఇవ్వకుండా ఆత్మసంతృప్తి కోసమన్నట్టుగా రెమో 'ఇండియా బియాండ్', 'సింఫోనిక్ ఛాట్స్' ఆల్బమ్స్‌ను విడుదల చేశాడు. 'బొంబాయి' సినిమాలో ఎ.ఆర్.రెహమాన్ సంగీత దర్శకత్వంలో పాడిన 'హమ్మా.... హమ్మా' పాట రెమోకు విశేషమైన గుర్తింపును తెచ్చిపెట్టింది. ఆ తర్వాత మళ్ళీ అంతపేరును 'ప్యార్‌తో హోనా హీ థా' చిత్రంలోని టైటిల్ సాంగ్ తెచ్చింది. అయితే ఈ పాట అవార్డుల నామినేషన్‌కు వెళ్ళినా అవార్డును గెలుచుకోలేకపోయింది. ఈ విషయమై రెమో స్పందిస్తూ "ప్రజలలో వచ్చిన గుర్తింపుతో పోల్చితే అవార్డులు ఎప్పుడూ గొప్పకాదు. పైగా బాలీవుడ్‌లోని వ్యక్తుల్ని 'జీ' అంటూ గౌరవిస్తూ, వాళ్ళకి చెంచాగిరి చేయడం నాకు మొదటి నుండీ అలవాటు లేదు. అందువల్లే నాకు హిందీ సినిమా రంగంలో రావాల్సినంత పేరు, అవకాశాలు రాలేదు. అయినా ప్రేక్షకుల సమక్షంలో సంగీత కార్యక్రమాల్ని ప్రదర్శిస్తూ ఎంతో హాయిగా జీవితాన్ని గడిపేస్తున్న నాకు అవార్డులు, పేరు రాలేదనే అసంతృప్తి ఏరోజూ లేదు" అని అంటున్నాడు.

ఈ యేడాది మే నెలలో యాభై ఏళ్ళ మైలురాయిని దాటిన రెమో ఇకపై మరింత అర్థవంతమైన సంగీతాన్ని, సాహిత్యాన్ని అందించే ప్రయత్నంలో ఉన్నాడు. "నేను నా పాటల్లో వీలైనంత వరకూ చక్కటి సందేశాన్ని అందించే ప్రయత్నం చేశాను. అయితే లెక్చర్‌ను వినిపిస్తే ఇవాళ వెంటనే టేప్ రికార్డ్‌ను శ్రోతలు కట్టేస్తారు. అందువల్ల వాళ్ళకు కావాల్సిన సంగీతాన్ని అందిస్తూనే, అందులో ఓ మంచి పాటను చెప్పాల్సి ఉంటుంది. నా ప్రయత్నం కూడా అదే. నా పాటలు విని డ్రగ్ ఎడిక్ట్ వెంటనే దానికి దూరమౌతారని చెప్పలేను కాని, కనీసం ఆ వ్యసనంతో పోరాడాలనే స్ఫూర్తి వాళ్ళకు నా పాట కలిగిస్తుందనే నమ్మకం ఉంది" అని అంటున్నాడు. తన పాటను మిలటరీ బ్యాండ్ మ్యూజిక్‌తో రెమో పోల్చుతాడు. ఆ మ్యూజిక్ బ్యాండ్ శత్రువులతో పోరాడదు. కానీ అది అందించే సంగీతం సైనికుల్ని



ప్రోత్సహిస్తుంది, నా పాట కూడా అంతే, తమలోని వ్యసనాలతో పోరాడే వాళ్ళకి స్ఫూర్తినిస్తుంది" అని చెబుతున్నాడు.

భవిష్యత్ కార్యక్రమాల గురించి చెబుతూ, "అప్రతిహతంగా సంగీతాన్ని అందించడమే నా లక్ష్యం. అయితే అది ఏ రకమైనదీ అనేది నాకు తెలియదు. ఆ సమయానికి నా మనసుకు ఏది తడితే అది అందిస్తాను. అలానే నాకు ప్రయాణాలంటే ఎంతో ఇష్టం. బ్రెజిల్, దక్షిణ అమెరికా, చైనా... వంటి దేశాలు తిరగాల్సి ఉంది. అదేమాదిరిగా ఓ నెలరోజుల పాటు రికార్డింగ్, సౌండ్ ఇంజనీరింగ్‌కు సంబంధించి ఓ క్రాష్ కోర్స్ చేయాలనుకుంటున్నాను. వీడియో ప్రొడక్షన్ కూడా నాకు బాగా ఇష్టమైన విషయం. పుస్తకాలు చదవడం, క్లాసికల్ మూవీస్ చూడటం కూడా...! జీవితంలో నేర్చుకోవాల్సినవి, ఆస్వాదించాల్సినవి ఎన్నో ఉన్నాయి.... కానీ సమయమే చాలా తక్కువ ఉంది" అని నవ్వేస్తాడు రెమో ఫెర్నాండేజ్.

**- వి. అరుణ సత్యవతి**

# రాజా ఆడియో రివ్యూ

రోహిత్, గజాలా, రేఖ, ప్రేమ కాంబినేషన్‌తో అంజి శ్రీను దర్శకత్వంలో యస్.రమేష్‌బాబు నిర్మించిన 'జానకి వెడ్స్ శ్రీరామ్' ఆడియో మార్కెట్‌లో వుంది. ఘంటాడి కృష్ణ ఈ చిత్రానికి సంగీత దర్శకుడు. ఆయన స్వర రచనలో తైదలబాపు రాసిన నాలుగు పాటలు, సీతారామశాస్త్రి రాసిన రెండు పాటలు, చైతన్య ప్రసాద్ రాసిన రెండు పాటలు మొత్తం ఎనిమిది పాటలున్నాయి ఈ క్యాసెట్‌లో.

తైదలబాపు రాసిన 'మెరా దిల్ తుఝ్‌కో దియా - గుండెల్లో నీవే ప్రియా' అనే పాట క్యాసెట్‌లో మొదటి పాట. ఈ పాటను కుమార్‌సాను, బృందం పాడగా రోహిత్ పై చిత్రీకరించారు. మెలోడీ, బీట్ రెండూ సమానస్థాయిలో కుదిరిన పాట యిది. పల్లవిలో 'దియా - ప్రియా' సౌండింగ్ వల్ల ట్యూన్‌కి మరింత ఊపు చేకూరింది. సీతారామశాస్త్రి రాయగా టీనా కమల్ అనే నూతన గాయని పాడిన 'పండు వెన్నెల్లో ఈ వేణుగానం నీదేనా ప్రియనేస్తం అంటుంది నా ప్రాణం' పాటలో గజలా ప్రధాన పాత్రధారిణి. మధ్యమావతి రాగం అధార రాగంగా స్వరపరచబడిన ఈ పాట ఘంటాడికృష్ణ మెలొడీస్‌లో వన్ ఆఫ్ ది బెస్ట్ గా చెప్పుకోవచ్చు. చక్కటి ఉచ్చారణతో పాడిన టీనాకమల్ తెలుగులో బిజీ అయ్యే అవకాశం చాలావుంది. ప్రియనేస్తం, దిగుతావే చక్కా - అలిశాక నీ రెక్కా, కళ్యాణ రామయ్య, వరమాల ఇవి సీతారామశాస్త్రి గారిని పట్టి యిచ్చే పదాలు. జానకి రాముల కళ్యాణం గురించి 'విరహాల విల్లు విరిగేలా' అని వర్ణించటం ప్రశంసార్హమైన ప్రయోగం.

బాగా పాపులర్ అయిపోయిన ట్యూన్‌కి అనుకరణలు అనుసరణలు రావటం సహజం. అనుసృజనాలు రావటం కష్టం. లోగడ ఏవీయమ్ వారి 'చోరీ చోరీ' లో 'రసిక్ బల్‌మా' అంతకుముందు 'అహ్'లో 'ఏ శామ్ కి తన్‌హాయియా' పాటల ద్వారా శంకర్ - జైకిషన్ ఏర్పరుచుకున్న ముద్రతో సమానంగా 'పేయింగ్ గెస్ట్' అనే సినిమాలో యస్.డి.బర్మన్ 'చాంద్ ఫిర్ నిక్‌లా' అనే పాటను స్వరపరిచారు. తెలియని వాళ్ళకి ఈ మూడూ ఒకే సంగీత దర్శకుడు స్వరపరిచాడని అనుకునే అవకాశం వుంది. ఇంచుమించుగా అటువంటి పేర్లల్ క్రియేషనే అనుసృజనం అంటే! సరిగ్గా అలాటిదే జరిగిందీ చిత్రంలో....

'మనసంతా నువ్వే' చిత్రం ద్వారా 'తూనీగ తూనీగ' ట్యూన్ ఎంత ప్రచారంలో కొచ్చిందో అందరికీ తెలుసు. సరిగ్గా ఆ ట్యూన్‌ను గుర్తుకు తెస్తూ కాపీ చెయ్యకుండా స్వంత ముద్రతో బాణీని సమకూర్చటం మామూలు విషయం కాదు. ఈ 'జానకి వెడ్స్ శ్రీరామ్' చిత్రంలోని 'రివ్వున ఎగిరే గువ్వా నీ పరుగులు ఎక్కడికమ్మా' పాటను విని, సమన్వయ భావంతో విశ్లేషించు కోగలిస్తే ఈ పాటలోని పనితనం, నేర్పరితనం తెలుస్తుంది. చైతన్యప్రసాద్ రాసిన ఈ పాటని సునీత, ఉష, సంజీవని, ఘంటాడికృష్ణ, ఘటికాచలం, వరికుప్పల యాదగిరి, బృందం పాడగా చిత్రంలోని ముఖ్య పాత్రధారులపై చిత్రీకరించారు. చక్కటి విజువల్స్ కలిగిన ఈ పాటని చైతన్య ప్రసాద్ రాసిన పద్ధతి కూడా ఎంతో బావుంది. 'ఫలానా అబ్బాయిని పెళ్ళి చేసుకో నీ కడుపున పుడతాను' అని ఓ పెద్దాయన అంటే 'కూతురుగా పుట్టు నీపేరే పెడతాలే' ఈ అమ్మాయి అనడం అందుకు ఉదాహరణ.

తైదలబాపు రాయగా సందీప్ భౌమిక్, సునీత, నిష్మా, బృందం పాడిన 'అందాల భామలు క్యాట్ వాకు చేపలూ' పాటను రోహిత్, గజాలా, రేఖ తో పాటు కొంతమంది నృత్య కళాకారులపై చిత్రీకరించారు. ఈ పాటకు కూడా




విడుదల : సూర్యా మ్యూజిక్
వెల : రూ 38/-

అధార రాగం మధ్యమావతే! చైతన్యప్రసాద్ రాయగా రాజేష్, నిత్య సంతోషిణి పాడిన 'ఎక్కడ నిన్ను వెదకాలి ఎవరిని నేను అడగాలి' పాటను రోహిత్, గజాలాపై చిత్రీకరించారు. ఘంటాడికృష్ణ తన సినీ జీవితంలో ఇప్పటివరకూ చెయ్యని ట్యూన్ ఇది. 'ఒకటో నంబరు కుర్రాడు' సినిమాలో కీరవాణి చేసిన 'నువు చూడు చూడకపో నే చూస్తూనే వుంటా' అనే పాట ప్రేరణ గాని అటువంటి ట్యూన్‌తో ఒక మెలోడి చెయ్యాలన్న కోరికగాని ఘంటాడికృష్ణలో ఉందేమోనని పిస్తుంది ఈ పాట వింటుంటే! ఈ పాటను కూడా చైతన్యప్రసాద్ చక్కటి బాలెన్స్‌తో రాశాడు. అన్ని కలిసొస్తే (మ్యూజిక్) ఇండస్ట్రీలో అతి ప్రముఖ స్థానాన్ని ఆక్రమించే రోజులు ఈయనకు అతి దగ్గరగా వున్నాయనిపిస్తుంది.

పాట చివర్లో వచ్చే 'జతగా తాను కలిసేవరకూ' అనే వాక్యంలో 'బ్రతికే శిలనమ్మా' అనే ఎక్స్‌ప్రెషన్ 'ఆత్మబలం' సినిమాలో 'నాలుగు కళ్ళు రెండయినాయి' పాటలో ఆత్రేయ రాసిన 'కదిలే శిలగా మారిపోతిని' అనే ఎక్స్‌ప్రెషన్‌కి మిర్రర్ ఇమేజ్ లాంటిది.

తైదలబాపు రాయగా ఉదిత్‌నారాయణ్, టీనా కమల్ పాడిన 'నిన్ను ఎంత చూసినా చూసినట్టు ఉండదు' పాట పక్కా మాస్ మసాలా పాట. రిథమ్ సెక్షన్ వరకు ఇంకొంచెం ఫోర్స్ ఉన్నా ఫరవాలేదనిపించే ఈ పాటను రోహిత్, అతని కన్నా సీనియర్ నటి అయిన ప్రేమతో పాటు మరికొంతమంది నృత్య కళాకారులపై చిత్రీకరించారు. సీనియర్ నటితో హీరోకి ఓ స్పెషల్ సాంగ్ ఉండాలనే ప్రస్తుతపు కమర్షియల్ ట్రెండ్‌కి అనుగుణంగా రూపొందించబడ్డ గీతమిది.

ఒకే ట్యూన్‌కి హ్యాపీ అండ్ శ్యాడ్ వెర్షన్‌లు వేర్వేరు రచయితలతో రాయించటం వల్ల వైవిధ్యం ప్రస్ఫుటంగా తెలుస్తుంది. ఇద్దరు రచయితలూ తమ తమ ప్రతిభలని పూర్తిగా అవిష్కరించే అవకాశం వుంటుంది. హ్యాపీ వెర్షన్‌లో ఫస్ట్‌హాఫ్‌లో వినిపింప చేసిన 'రివ్వున ఎగిరే గువ్వా' పాటను అదే మకుటంతో మూడవలైను నుండి మార్పు చేసుకుంటూ సీతారామశాస్త్రి గారితో రాయించిన శ్యాడ్ వెర్షన్‌కి గాత్రధారి బాలు. రిపీట్ అయినా సరే బోరు కొట్టకుండా - హృదయంలో మరింతగా బలపడే ఈ ట్యూన్‌కి హ్యాపీ వెర్షన్ బొమ్మ అయితే శ్యాడ్ వెర్షన్ బొరుసు. సీతారామశాస్త్రి కలం బలంతో ఆ బొరుసు కథాచక్రానికి ఇరుసులా నిలిచింది. రోహిత్, రేఖ ప్రధాన పాత్రధారులుగా కనిపిస్తారీ శ్యాడ్ వెర్షన్‌లో. తిరిగొచ్చే దారి మరవటం - ప్రేయసి జాడను చూపించమని అడుగుతూ ఉబికే కన్నీరు ఇంకి పోవక పోవటం - నక్షత్రాలు ఎదురుచూసే ప్రియుని చూపుల దీపాలవటం - ఆ దారిలో తూరుపుగా రమ్మని ప్రేయసిని కోరటం - ఆ తూరుపే ఓదారుపుగా ప్రేయసిని వర్ణించటం - బంధం తెగిపోలేదనటానికి, స్నేహం క్షేమంగా ఉందనటానికి సాక్ష్యం దేహంలో అయువుండటమేనని ప్రియుడు అనటం - ఇవన్నీ సీతారామశాస్త్రి గారి భావనలలో ఎంతటి గాఢత ఉందో తెలిపే అక్షర శిల్పాలు.

శంకర్ మహదేవన్, సురేఖామూర్తి పాడిన 'ఈఫిల్ టవరైనా మన చార్మినార్‌కి సాటిరాదురా' పాటను రోహిత్, రేఖ, మరికొంతమంది నృత్య కళాకారులపై చిత్రీకరించారు. రచయిత తైదలబాపు చక్కటి ప్రతిభ కనబరిచాడు. ఇండస్ట్రీలో ఆయన బాగా నిలదొక్కుకోవటానికి ఈ సినిమా దోహదం చేస్తుంది. అలాగే సురేఖామూర్తికి కూడా ఈ పాట ద్వారా మరింత గుర్తింపు లభించే అవకాశం వుంది.

ఘంటాడి కృష్ణకి గత వైభవాన్ని తిరిగి కల్పించగల ఈ ఆడియోని అతి తక్కువ ధరలోనే... అంటే యాభై అయిదు రూపాయలకే.... సీడీల ద్వారా సూర్యామ్యూజిక్ వారు అందించటం అభినందనీయం. ■

1

గానం : కార్తీక్, డిమ్మి, టిప్పు

ప: నేడే... నేడే... నేడే... నేడే... కావాలి..... నేడే కావాలి...
పదహారు ప్రాయంలో
నాకొక గర్ల్‌ఫ్రెండ్ కావాలి...
నేటి సరికొత్త జాజి పువ్వల్లె...
నాకొక గర్ల్‌ఫ్రెండ్ కావాలి....
వెబ్‌సైట్ కెళ్ళి
లవ్ ఫైల్ తెరచి
ఈ మెయిల్ హాసుకే కొట్టాలి...
చెమట పడితే
వానలో తడిస్తే
ముఖము ముఖముతో తుడవాలి....
నాకొక గర్ల్‌ఫ్రెండ్ కావాలెరా....
నాకొక గర్ల్‌ఫ్రెండ్ కావాలెరా....
గర్ల్‌ఫ్రెండ్స్ అంటే బాయ్స్‌కి బూస్టే కదా...
గర్ల్‌ఫ్రెండ్స్ లేని లైఫే వేస్టే కదా...
గర్ల్‌ఫ్రెండ్ కావాలి ॥పదహారు॥



చ: ఫ్రెండ్ యొక్క కవితను తెచ్చి
నా యొక్క కవిత అని చెప్పి...
హృదయంలో చోటే పట్టంగా...
ఫ్లాపైన సినిమాకు వెళ్ళి
కార్నర్‌లో సీటు ఒకటి పట్టి
బబుల్ గమ్ము - చిరుపెదవుల మార్చంగా...
సెల్‌ఫోన్ బిల్ పెరగ జోకులతో చెవి కొరక...
ఎస్.ఎమ్.ఎస్ పంప... కావలె గర్ల్‌ఫ్రెండ్ లే....

ప: నాతోటి నడిచేటి నాకొక గర్ల్‌ఫ్రెండ్ కావాలి
కాలం మరిచేటి కబురులాడేటి
నాకొక గర్ల్‌ఫ్రెండ్ కావాలి...
చంద్రుని చెణుకై - గదిలో చినుకై
సంపంగి మొలకై - ఉండాలి....
ఇంకొక నీడై ఇంకొక ప్రాణమై
ఇరవై వేళ్లయి ఉండాలి... ॥నాకొక॥



చ: బైకెక్కి ఊరంత తిరగ
ఆ... అంటే ట్రీట్ ఇచ్చు కొనగ...
ఊ... అంటే గ్రీటింగ్‌కార్డ్ ఇవ్వంగ....
హాచ్ అంటే కర్చీఫ్ ఇచ్చి...
ఉమ్ అంటే కుడిబుగ్గ చూపి
టక్ అంటూ తలమీద కొట్టంగ....
చూస్తే బల్బ్ వెలగ.... బార్బీడోల్ వంటి
పోనీటైల్ తోటి
కావలె గర్ల్‌ఫ్రెండ్ లె.... ॥గర్ల్‌ఫ్రెండ్స్॥



2

గానం : ఫ్లాసి, వసుందరాదాస్

సాకీ: ఎవరి నడిగి నా గుండెల్లో
ఎడం పక్క - నువ్వు దూరావు...
నీ ఊపిరిలో - నీ పేరులలో
కుడిపక్క - నా పేరు - చేర్చెదవా....
డి.ఎ.టి.ఐన్‌జి
యూ అండ్ మి వెర్ మీట్ టు బి
హా... ఐ కెన్ క్లియర్లీ సీ
డేటింగ్ ఈజ్ ఏ ఫ్యాంటసీ
ఊ....

బా: బాయ్స్‌ని నవస్థ పెట్టొద్దు
హార్టుకి హెల్మెట్ తొడగద్దు
ఫ్రెండ్ అని ఫుల్‌స్టాప్ పెట్టొద్దు
ప్రేమిస్తే శీలం చెడిపోదు....

గ: గర్ల్స్‌ని చూయింగమ్ గమ్ చెయ్యొద్దు
హార్టులో గుడిశే వెయ్యొద్దు
పురాతన వస్తువు తొవ్వొద్దు
చెలిమికి రెడ్‌రోజ్ చూపొద్దు.....

బా: డు దట్ తింగ్ యు లైక్ టు డు
డు లెట్ మి విన్ యువర్ హార్ట్
లెట్ మి నెవర్ స్టాప్ అండ్ లెట్ మి స్టార్ట్
ఆల్ ఐ వన్నా డు ఈజ్ విన్ యువర్ హార్ట్...

గ: అయ్యో... లవ్ ఈజ్ ఫుల్ ఆఫ్ పేయిన్ ॥2॥
పోరా.... లవ్ ఈజ్ యే జస్ట్ ఎ స్ట్రేయిన్.... ॥2॥
ఐ డోంట్ వన్నా లవ్
ఐ డోంట్ వన్నా లవ్.....
లవ్ ఈజ్ హాట్ ఎ గేమ్ లవ్ ఈజ్ హాట్ ఎ గేమ్...

బా: ఫ్రెండ్షిప్ అంటే ఆర్.ఎ.సి.లవ్
కన్ఫర్మ్ చెయ్యవె ప్రేయసీ...
ఫ్రెండ్షిప్ అంటే ఫుల్ సేఫ్టీ
లవ్‌లో లేదోయ్ గ్యారంటీ.... ॥అయ్యో॥

గ: గర్ల్... యూ నో గెట్ మి థింకింగ్ ఆల్ ఎబౌ యూ
అండ్ ఐ రియల్లీ వాన్నా నో.. ఇట్ యూ లవ్ మి టూ...
విల్ యూ లెట్ మి నో... కాస్ మై హార్ట్ ఈజ్ ట్రూ
బాబి వెన్ ఐ సీ యువర్ ఫేస్ ఐ వన్నా బి విత్ యూ

గ: తమ తమ నెలవులు తప్పినచో
తమ మిత్రులె శత్రులవునంట....
కచట తపలు గసడ దవలు
మరిపించుటయే లవ్వంట.....

బా: ఐ రియల్లీ డు కేర్ అండ్ ఐ విల్ బి దేర్
ఐ కేన్ టేక్ యూ ఎవరీ వేర్
స్టే విత్ మి అండ్ ఐ విల్ లెట్ యూ సీ
ఇన్ మై హార్ట్ వేర్ యూ విల్ బి

గ: లవ్వులో పడితే లేవరు ఎవరు
ప్రేమ పచ్చి అబద్దాల బ్యాంకు...
ప్రేమ కామ భిక్షను కోరు
బోరు... హా హా... వద్దమ్మా..... ॥ఫ్రెండ్‌షిప్॥

చ: లవ్ ఈజ్ నాట్ ఎ ఫ్యాషన్ లవ్ ఈజ్ నాట్ ఎ ట్రెండ్
లవ్ ఈజ్ ఫర్ లూజర్స్ బీట్ ఇట్ మై ఫ్రెండ్
లవ్ ఈజ్ నాట్ ఫర్ మి లవ్ ఈజ్ నాట్ ఫర్ యూ
లవ్ ఈజ్ బట్ ఏ డ్రీమ్ సో బీ మై ఫ్రెండ్

గ: చిన్న చిన్న తప్పులు చిన్న చిన్న ఒప్పులు
చెయ్యమని చెప్పెను కుర్రతనం...
డాష్ డాష్ ఏమీ ఇంత వరకెరుగము....
ఖాళీలన్నీ పూరిద్దాం...

గ: లవ్ ఈజ్ సచ్ ఎ బిగ్ మిస్టేక్
లిస్టన్ టు మి బాయ్ ఐ నో
ఓన్లీ ఫ్రెండ్షిప్ టేక్స్ యూ హైయ్యర్ ఎవరీ డే
యాజ్ ఫ్రెండ్స్ వి గ్రో

బా: ఏ తప్పులు మేము - చేయ్ బోము
గిప్టులు మాత్రం చేస్తుంటాము...
మా పర్సులు - మొత్తం ఖాళీ
అందులో ముద్దులు వెయ్యండి....
॥గర్ల్స్‌ని చూయింగమ్॥

**3** **గానం: కార్తిక్, చిత్ర, శివరామన్**



అ: ఎగిరి దుమికితే నింగి తగిలెను...
పదములు రెండూ పక్షులాయెను...
వేళ్ల చివర పూలు పూచెను...
కనుబొమ్మలే దిగి మీస మాయెను....
అలె...అలె...అలె..అలె...
అలెఅలెఅలెఅలెఅలెఅలెఅలె
ఆనంద భాష్పాల్లో - మునిగా....
ఆ: ఒక్కొక్క పంటితో నవ్వా...
అ: కలకండ మోసుకుంటూ నడిచా ఒక చీమై
ఆ: నే నీళ్లల్లో పైపైన నడిచా ఒక ఆకై.... అలె... అలె...
అ: ప్రేమను చెప్పిన క్షణమే - అది దేవున్ని కన్న క్షణమే...
గాలై ఎగిరెను - మనసే... ఓ.... ఓ.... ॥ఎగిరి॥
అ: నరములలో - మెరుపులికెనులే
తనువంతా - వెన్నెలాయెనులే...
ఆ: చందురుని - నువు తాకగనే
తారకలా - నే - చెదిరితినే...
అ: మనసున మొలకే - మొలిచెనులే
అది - కరువై - తలనే - దాటలే... అలె... అలె...
ఆ: నే చెలనం లేని కొలనుని
ఒక కప్ప - దూకగా - ఎండితిని ॥ప్రేమను॥ ॥ఎగిరి॥



ఆ: ఇసకంతా - ఇక చక్కెరయా
కడలంతా - మరి - మంచినీరా...
అ: తీరమంతా - నీ - కాలిగుర్తులా
అలలన్నీ - నీ - చిరునవ్వులా....
ఆ: కాగితం నాపై ఎగరగ - అది
కవితల పుస్తకమాయెనులే.... అలే అలే....
అ: హరివిల్లు తగులుతూ ఎగరగ - ఈ
కాకి కూడా - నెమలిగా - మారెనులే... ॥ప్రేమను॥ ॥ఎగిరి॥

**4** **గానం: లక్కీఅలి, క్లింటన్, ఫ్లాసి, వసుందరాదాస్**

అ: హే కో: హే ॥2॥ ఆ: హే కో: హే ॥2॥
అ: సే సా కో: సా ఆ: సే రీ కో: రీ
అ: సే గా కో: గా ఆ: సే హే కో: సే వాట్
అ: మార్చివేసెయ్ ఆ: మార్చి వేసెయ్
ఇ: మార్చివేసెయ్ ॥7॥ కో: దట్స్ వాట్ వుయ్‌సే
అ: ఓహో...హో..హో...
సారీ గమే పాదనిసే మార్చి వేసెయ్.... దట్స్ వాట్ వి సే...॥2॥
తెలుసుకో
లక్కు - పావుకిలో... లాసు - పావుకిలో...
లేబర్ - పావుకిలో... చేర్చుకో...
భక్తి - పావుకిలో... హోపు - పావుకిలో... టాలెంటు - పావుకిలో...
అన్నిటినీ - కలిపి కట్టిన పెద్ద పొట్లమే...సీక్రెట్ ఆఫ్ సక్సెస్॥సారిగమే॥
ఈ సంగీతం - సొంత గీతం వేదనలో - పుట్టిన గీతం...
టు బి ఎ స్టార్ విల్ షో యూ హౌ
టు రీచ్ ఫర్ ది స్కైస్ అండ్ నెవర్ నెవర్ గివ్ ఇట్ అప్
అ: బాధే విజయపు రహస్యము...
కో: వుయ్ ఆర్ ది బాయ్స్ ॥4॥
అ: పిట్టగోడ ఎక్కి - ఒట్టి మాటలాడి
ప్రేమలీలలో - పాటం ఖాళీలేరా
ఎడోలాసెంట్ ఏజ్ లో సుఖాలెన్నో - కోలి
దెబ్బలెన్నో తిన్నాం - కదరా...
ఆ: తప్పిన దారిలో - వెళ్లాం రైటైన రూటు - కనుగొన్నాం..
మిస్టేక్స్ ఆర్ ది సీక్రెట్ ఆఫ్ సక్సెస్
అ: మేము పారిపోయాం - లోకాన్నెరిగాం
ఆమె కోసమే - పనిలో పడ్డాం...
ఆ: లవ్ ఈజ్ ది సీక్రెట్ ఆఫ్ సక్సెస్ ॥సారీ॥
చ: హియర్ వి కమ్ హియర్ వి కమిన్
హే.... వి కమిన్ అప్ విత్ సమ్‌థింగ్ అండ్
యు నో దట్ వి ఆర్ బ్రింగింగ్ ఇట్ టు నంబర్ వన్
ఫుల్ ఆఫ్ ఫన్ అండ్ లాఫ్టర్ కమిన్ ఎ లిటిల్ ఫాస్టర్
హే! యు నో వి ఆర్ నంబర్ వన్...
కోతిలాగా - ఉడుం లాగా పట్టిందల్లా - పట్టు పట్టు
మాటిమాటికొచ్చునా - అవకాశం అనౌన్స్ చేసి వచ్చునా
లేబిల్ తోటి వచ్చునా...
ఏదో రోజు వచ్చురా...సీజ్ ద డే ॥సారీ॥ ॥హియర్॥
సుత్తిరా - సోదరా కష్టంరా - నష్టంరా
అయినా గాని - గట్టిగా చెబుతారా....
గెలుపుకి సీక్రెట్ గెలుపుకి షార్ట్‌కట్
నిజాయితీ నిజాయితీ నిజాయితీ రా.... ఒహోహో...హో..హో...
నిజాయితే - విజయపు రహస్యము... ఓహోహో...హో...హో...
నిజాయితే విజయపు రహస్యము....



**5** **గానం: ఉదిత్ నారాయణ్, సాదనాసర్గం**

అ: బూమ్‌బూమ్ షికికా షికికాకా
బూమ్‌బూమ్ ఏఏఏ ॥బూమ్॥
ఆ: ప్రేమ - ఇదితే - అదితే - అని అడుగునా...
ప్రేమ - స్థితిని - గతిని - అన్నీ చూచునా ॥ప్రేమ॥
అ: ముళ్లమీద - కాకిపిల్ల - నిదురించదా...
చెత్తకుప్పమీద రోజా - వికసించదా
ఆ: పూరిల్లైనా ఫర్వాలేదు - ప్రేముంటే చాలు...
పరమాన్నాలు అక్కర్లేదు - నీళ్లుంటే చాలు ॥ప్రేమ॥
అ: ప్రేమ పుడితే - ఇత్తడి కూడా
పుత్తడి గని ఔను...
ఆ: చిల్లుల డబ్బీలో - ప్రేమ దూరితే
పిల్లన గ్రోవౌను....
అ: చెట్టు చెక్కిన పొట్టు తోటి
పూల పానుపు - చేద్దాం..
ఆ: మెడ విరిగిన బాటిల్లో
దీపములై - వుందాం... ॥ప్రేమ॥
అ: పుట్ట గొడుగుని పట్టే నా చై
హత్తుకుని వుందాం....
ఆ: సాలె గూటిలో - సాలీడులమై
ఊయలలూగేద్దాం....
అ: వాన నీటి బురదలలో...
వానపాముల మౌదాం...
ఆ: కుళ్లిపోయిన మామిడిలో
జత పురుగుల మౌదాం... ॥ప్రేమ॥ ॥బూమ్॥

**6** **గానం: కార్తిక్, కునాల్, జార్జి, అనుపమ, సునితా**

ప: మారో మారో - చౌకా చక్కా - సౌ మారో
మారో మారో - బాయ్స్ చేతిలో - టుమారో...
మేరే సలాం - స్వరములతో పలుకుదాం...
అబ్దుల్ కలాం - చేత - బిరుదులు పొందుదాం...
ఢిల్లీ - బాంబే - కలకట్టా...
సంగీతంతో - చేపట్టా...
లండన్, మెల్‌బోర్న్, అట్లాంటా
అంతా - జే కొట్టా రబ్బా రబ్బా హైరబ్బా
జోరుగా ముందుకు సాగబ్బా
పాతని, రాతని. గీతని, దాటబ్బా....ఏఏఏ
అ: బ్రేక్ ద రూల్స్... కో: ఓయే
అ: చెవికి పోగు - పెడితే తప్పు
జుట్టుకు రంగు - కొడితే - తప్పు...
ఒంటికి పాంటూ - వేస్తే తప్పు..
ఫ్రెండ్స్ కూడా - తిరిగితే తప్పు...
ఆ: బొడ్డుకి రింగు - పెడితే తప్పు...
టైటుగా ప్యాంటూ - వేస్తే - తప్పు...
పెడిక్యూర్ తప్పు - మనిక్యూర్ తప్పు...
వాక్సింగ్ తప్పు - త్రెడింగ్ తప్పు...
అ: నైట్ అంతా మెలకువ తప్పు
9'ం క్లాక్ లేస్తే తప్పు...తప్పు
బిగ్గరగా నవ్వితే తప్పు... ఒళ్లంతా విరిస్తే తప్పు...
ఇ: ఊరుకుంటే ఎన్నో చెబుతార్రా..
అ: బ్రేక్ ది రూల్స్... కో: ఓయే ॥మారోమారో॥
అ: ఎక్జామ్ ఫీజు - నొక్కితే - తప్పు
పరీక్ష వేళ - క్రికెట్టు - తప్పు...
ఇంటి లేటుగ - వస్తే - తప్పు...
ఫ్యాషన్ చానల్ చూస్తే తప్పు...
ఆ: హృతిక్ రోషన్ - ఇష్టమంటే తప్పు
ఫోనులో హస్కు - కొడితే తప్పు...
మేడపైన నిలిచుంటే - తప్పు
మాటకి మాట చెపితే తప్పు...
అ: పువ్వుని - తుమ్మెద చూస్తే - తప్పు...
తుమ్మెద తుమ్మెద కలిస్తే తప్పు...తప్పు
కూర్చుంటే తప్ప తప్ప నిలుచుంటే తప్ప తప్ప
ఇ: ఊరుకుంటే ఎన్నో చెబుతార్రా..
అ: బ్రేక్ ద రూల్స్... కో: ఓయే ॥మారోమారో॥






ఎ.ఎం.రత్నం



శంకర్



ఎ.ఆర్.రెహమాన్



శివగణేష్

## తారాగణం

సిద్ధార్థ్, భరత్, నకుల్, మణికంఠన్, సాయి, జెన్నిలియా డిసౌజా

## సాంకేతిక నిపుణులు

| | | | | | |
|---|---|---|---|---|---|
| మాటలు | : | శ్రీరామకృష్ణ | ఫైట్స్ | : | సూపర్ సుబ్బరామన్ |
| సంగీతం | : | ఎ.ఆర్.రెహమాన్ | కెమెరా | : | రవిచంద్రన్ |
| పాటలు | : | ఎ.ఎం.రత్నం, శివగణేష్ | నిర్వహణ | : | అళహరి రఘురామ్ |
| ఎడిటింగ్ | : | వి.టి.విజయన్ | సమర్పణ | : | ఎ.ఎం.రత్నం |
| కళ | : | సాబు సిరిల్ | నిర్మాణం | : | శ్రీ సూర్యా మూవీస్ |
| డ్యాన్స్ | : | రాజు సుందరం | కథ, స్క్రీన్‌ప్లే - దర్శకత్వం | : | శంకర్ |

# ఆలోచిద్దాం ఆచరిద్దాం

సమాజంలో ప్రతి వ్యక్తి ఆత్మతృప్తికై శ్రమిస్తాడు. కళాకారుడు మాత్రం ఆత్మానందంతో బాటు సమాజానికి మేలు కలిగేందుకు, మేల్కొల్పేందుకు కృషి చేస్తాడు. ఆ సేవకు ప్రతిఫలం దక్కుతుందో లేదో తొలిదశలో పట్టించుకోడు. సమాజం మెప్పుకోసమే అతని ఆరాటమంతా...



ఉద్యోగిలా పెన్షన్, గ్రాట్యుటీలు లేవని, వ్యాపారస్థునిలా నాలుగు కాసులు వెనక వేసుకోలేదనీ అతను గ్రహించేసరికి జీవిత చరమాంకంలో ఉంటాడు. ఈ పరిస్థితి వల్లనే 'వృద్ధ కళాకారులను ఆదుకోవడం సమాజం బాధ్యత' అనే నినాదం తరచు వినబడుతూంటుంది. అయితే బాధ్యత ఎంతవరకు అన్నది చర్చనీయాంశంగా మారింది.

ఆర్థిక పరిపుష్టిలేని కళాకారులను ఆదుకోవడంతో ఆగాలా? లేక వారి కుటుంబ సభ్యులకు కూడా (కళతో కాక, కళాకారులతో బాంధవ్యం ఉన్న కారణంగా) రాయితీలు ఇస్తూ పోవాలా?

ప్రముఖ షెహనాయి విద్వాంసుడు బిస్మిల్లాఖాన్ తన మనుమడికి పెట్రోలు బంక్ శాంక్షన్ చేయకుండా తనకు సత్కారాలు చేస్తే ఏం ప్రయోజనమని అంటున్నారు.

'కళాకారుడి పట్ల సమాజం బాధ్యత' అనే ఈ సున్నితమైన అంశం గురించి ఇద్దరు విజ్ఞుల అభిప్రాయాలు అందిస్తున్నాం.



ఈ దేశంలో పుట్టిన గొప్ప కళాకారుల్లో చాలామంది తమ చరమాంకంలో దరిద్రాన్ని అనుభవించిన వారే ! బిస్మిల్లాఖాన్ కనీస అవసరాలకు లోటు లేకుండా చూసుకోవలసిన బాధ్యత ప్రభుత్వానిదీ, సమాజానిదీ! దేశాధి నేతల అభిమానాన్ని సైతం సంపాదించుకున్న ఎమ్మెస్ సుబ్బులక్ష్మి తన ఆస్తిని ట్రస్ట్ కిచ్చింది. మంగళంపల్లి బాలమురళీకృష్ణ ఒకానొక సమయంలో తన ఆత్మగౌరవాన్ని కాపాడుకోవటం కోసం అప్పటి ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఆంధ్రప్రదేశ్‌లో కచ్చేరీ ఇవ్వనని ప్రకటించి, పాటించారు కూడా! రుక్మిణీ అరండేల్ ప్రభుత్వం నుండీ ఏమీ ఆశించకుండా అకాడమీని ఏర్పాటు చేసుకుంది. కానీ ప్రభుత్వాన్ని ఇలా అడగవలసిన పరిస్థితి బిస్మిల్లాఖాన్‌కి రావటం నిజంగా దురదృష్టం. ఈ వార్ధక్యంలో ఆయనకి, ఆయన 'సమీప' కుటుంబ సభ్యులకి ఆర్థికపరమైన ఇబ్బందుల్లేకుండా ప్రభుత్వం చర్యలు తీసుకుంటే బావుంటుంది. అలాగని మొత్తం ఆయన బంధువర్గాన్ని పోషించాల్సిన బాధ్యత సమాజానిది కాదు. ఆయన పేరుని ఉపయోగించుకొని కుటుంబ సభ్యులు లబ్ధి పొందాలనుకోవటం, ఆ విధంగా ఆయన మీద పరోక్షంగా ఒత్తిడి తీసుకురావటం ఎంతమాత్రం సమర్థనీయం కాదు.

**- కె.రామచంద్రమూర్తి**
ఆంధ్రజ్యోతి దినపత్రిక సంపాదకులు



ఒక వ్యక్తికి ప్రభుత్వం జీవనోపాధి కల్పించడానికి మూడు రకాల సందర్భాలుండాలి

1. దేశాన్ని ప్రపంచ స్థాయిలో నిలబెట్టడానికి లేదా దేశ ప్రజల ఉన్నతికి, సంతోషానికి తన మొత్తం జీవితాన్ని వెచ్చించి సంపాదించే అవకాశం వున్నా ఏమీ సంపాదించుకోలేనివాడు
2. దేశ ప్రతిష్టను పెంచటమే తప్ప ఏ సంపాదనా లేనివాడు
3. దేశ ప్రతిష్టను పెంచే వృత్తిని చేస్తూ ఏదైనా ప్రమాదం ద్వారా జీవనోపాధి కోల్పోయినవాడు

బిస్మిల్లాఖాన్ పై మూడిటిలో ఏ కేటగిరిలో కొస్తారో అంచేత ఆయన మనవడికి పెట్రోల్‌బంకు ఇవ్వడం సమంజసమో అసమంజసమో అనే నిర్ణయాన్ని పాఠకులకే ఒదిలేస్తున్నాను.

**- యండమూరి వీరేంద్రనాథ్**
రచయిత

# రాజా ఆడియో రివ్యూ




విడుదల : హెచ్.ఎం.వి.
వెల : రూ 55/-

**యస్**.వరలక్ష్మి ఒక తరాన్ని ఉర్రూతలూగించిన నటి, గాయని... 15 చిత్రాలలో ఆమె గానం చేసిన ఓ 20 పాటలను 'హాసం' రిఫెరెన్స్ పర్సన్స్‌లో ఒకరైన జె.మధుసూధనశర్మ గారి నుండి సేకరించి ఫిల్మ్ హిట్స్ ఆఫ్ యస్.వరలక్ష్మి అనే మకుటంతో 'గోల్డెన్ హవర్' కలెక్షన్‌గా హెచ్.ఎం.వి. వారు అందించారు.

తెలుగులో సినిమాలు రావటం మొదలైనప్పటి నుంచి నేటి వరకు గల కాలాన్ని నాలుగు తరాలుగా విభజిస్తే - నాల్గవ తరానికి యస్.వరలక్ష్మి అంటే ఎవరో తెలియదు. మూడవ తరం వారికి కొద్దిగా తెలుసు. మొదటి తరం వారిలో అధికశాతం చనిపోయి రెండవతరం లో కొద్దిగా మిగిలి... కేవలం మూడవ, నాల్గవ తరం వారు మాత్రమే క్యాసెట్లు కొంటున్న ఈ తరుణంలో యస్.వరలక్ష్మి పాటలను ఆడియోగా రిలీజ్ చెయ్యటం ఎంత వరకు సబబు, ఎవరు కొంటారు అనే ఆలోచన రావటం సహజమే....

అందుకే ఓ ప్రయోగం చేసి చూద్దాం అనుకొని ఓ క్యాసెట్‌కొని అందులో బీ సైడున ఉన్న 'శ్రీదేవిని నీదుదేవేరిని' అనే పాటను మొదట వినండి... ఆ పాటలోని రెండవ చరణంలో యస్.వరలక్ష్మి చేసిన రాగాలాపనను గమనించండి. ఆమె ధాటి తెలుస్తుంది. ఆ తర్వాత రూపమునీయరయా (బాలరాజు) పాట వినండి. వివిధ రాగాలను మారుస్తూ ఆమె ఎంత సునాయాసంగా గానం చేసిందో తెలుస్తుంది. మనసారా కళ్యాణి పలికించు వీణ (వీర భాస్కరుడు) పాట వినండి. (పి.లీల సహగాయనిగా) ఆమె వేసిన స్వరాలను గమనించండి. ఆమెకున్న సంగీత జ్ఞానం ఎంత పటిష్టమైనదో తెలుస్తుంది. తన సమీక్షలలో సున్నితంగా చురకలు వేసే రోజుల్లో ముళ్లపూడి వెంకటరమణ గారు ఆమెను య'స్వర'లక్ష్మి అని ఎందుకు చమత్కరించారో అవగాహనకొస్తుంది. దాసిగా సేవించ తగనా (సతీ తులసి) పాటను వినండి. శోక రసానికి ఆలంబనగా నిలిచే విషాదాన్ని భాగీశ్వరి రాగం ద్వారా ఎంత బాగా పలికించవచ్చో 'జగదేకవీరుని కథ' లోని 'రారా కనరాదా' పాటలో ఘంటసాల ద్వారా - 'లవకుశ' లోని 'శ్రీరామ సుగుణధామా రఘువంశ జలధి సోమా' పాటలో లీల, సుశీల ద్వారా - 'సత్యనారాయణ మహత్యం' లోని 'ఓం నమో నారాయణ మాంపాహి నారాయణ' పాట ద్వారా - విని ఆ అనుభూతిని అసాంతం ఆస్వాదించిన వారికి - వీరందరి కన్నా ముందే 1959లోనే 'దాసిగ సేవించ తగనా' (సతీతులసి) పాట ద్వారా యస్.వరలక్ష్మి ఆ రసానుభూతిని రసజ్ఞ శ్రోతలకు అందించిందని తెలుస్తుంది.

'మీరజాలగలడా నా యానతి' అంటూ స్థానం నరసింహారావు గారు నాటకాల ద్వారా ప్రచారంలోకి తీసుకువచ్చిన ట్యూన్ తెలియని వారు 1966 లో వచ్చిన శ్రీకృష్ణతులాభారంలో సుశీల పాడిన ట్యూన్ తెలిసినవారు - 1955 లో వచ్చిన శ్రీకృష్ణ తులాభారం లో యస్.వరలక్ష్మి పాడిన వెర్షన్ వింటే (ఇది 'ఏ' సైడునవుంది) ఆమె స్వీయ ప్రతిభ ఎటువంటిదో అర్థమవుతుంది.

ఉపాయంలో అపాయం, ఖైదీ బాబాయ్, మంచి బాబాయ్ వంటి చిత్రాలకు దర్శకత్వం వహించి, ఆదుర్తి సుబ్బారావు దగ్గర ఎడిటర్ గా ఎన్నో చిత్రాలకు పనిచేసిన స్వర్గీయ టి.కృష్ణ తన తొలిరోజుల్లో - ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడుతూ - అజ్ఞాత జీవితాన్ని గడుపుతూ కూడా కేవలం యస్.వరలక్ష్మి పాటలు వినడం కోసం ముసుగులు కప్పుకుని బాలరాజు (1948) సినిమాకు వచ్చి 'ఓ బాలరాజా' పాటను విని వెళ్ళిపోయేవారు. ఆనాటి ఆ ఆరాధనా భావంతోనే తను తొలిసారి దర్శకత్వం వహించిన 'ఉపాయంలో అపాయం' చిత్రంలో 'ఓ... బాలరాజా' పాటను తిరిగి సుశీలతో ఓ ప్యారడీ బిట్‌గా పాడించుకున్నారు.

ఆదుర్తి సుబ్బారావుగారు కృష్ణప్రేమ (1961) తీసే రోజుల్లో ఆ చిత్రంలో నటించిన యస్.వరలక్ష్మిని దగ్గరగా చూస్తూ మరింత క్లోజ్‌గా మాట్లాడొచ్చు కదాని ఆమెను షూటింగ్‌కి తీసుకురావటం తిరిగి ఇంట్లో దిగబెట్టడం వంటి బాధ్యతల్ని స్వయంగా ఏరికోరి నెత్తిన వేసుకుని తృప్తి చెందారాయన. (ఈ విషయాలను, వివరాలను 'హాసం' 2వ సంచికలోని 64 పేజీలో రాయటం జరిగింది కూడా!) టి.కృష్ణ వంటి ప్రతిభావంతుడైన సాంకేతిక నిపుణుణ్ణే కాక ఇంకెంతో మంది సామాన్య ప్రేక్షకుల్ని, కళాకారుల్ని తన గానంతో ప్రభావితం చేసిన యస్.వరలక్ష్మి గత వైభవం ఎంతటిదో ఏ సైడున గల బాలరాజు పాటలు (ఓ బాలరాజా, ఎవరినే) వింటే తెలుస్తుంది.

ఇలా చారిత్రక ప్రాధాన్యం గల గాన జీవితం కలిగిన యస్.వరలక్ష్మి పాడిన కోయిలొకసారి వచ్చి (ఇల్లాలు - 1940), లీలా కృష్ణా నీ లీలలు (మహామంత్రి తిమ్మరుసు), ఎన్ని తరాల పుణ్యమో (వయ్యారి భామ), చందమామ (పల్నాటి యుద్ధం - 1947), వరాల బేరమయా (వెంకటేశ్వర మహత్మ్యం -1960), ఎవరో తానెవరో (సతీతులసి), ఆనందమౌగా పల్లెసీమ (జీవితం - 1950), నవనీత చోరుడు (కృష్ణప్రేమ), రామా ఇది ఏమి కన్నీటి గాథా (అభిమానం - 1960) పాటలతో పాటు - సతీ సావిత్రిలో బాలమురళీకృష్ణతో పాడిన ఓహోహో విలాసాల పాట, పల్నాటియుద్ధం లో నేటికీ ప్రసిద్ధనటుడైన అక్కినేని నాగేశ్వరరావుతో పాడిన ఓహో చారుశీలా పాటలు కూడా ఉన్నాయి ఈ క్యాసెట్‌లో.

గతాన్ని విస్మరించని వారు భవిష్యతులో రాణిస్తారంటారు. మనకు తెలిసిన గతాన్ని స్ఫురణకు తెచ్చుకోవటమే కాకుండా తెలియని గతాన్ని గురించి కూడా తెలుసుకోగలిగితే ముందు తరాలవారికి మరి కొన్ని మార్గదర్శక సూత్రాలను అందించగలం. ఈ క్యాసెట్ లోని పాటలు విని సాధన చేసి పట్టు సాధించ గలిగినవారికి ఇవాళ వస్తున్న పాటలను పాడడం మంచినీళ్ళు తాగినంత సులువని అనిపిస్తుంది. అందుకే రసజ్ఞ శ్రోతలతో పాటు నేటి తరం గాయనీమణులు, లేక గాయనులుగా వెలుగొందాలని కోరుకునేవారు ఈ క్యాసెట్‌ని వినడమే కాక అధ్యయనం చేయటం కూడా తప్పనిసరి. ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్స్‌లో సంగీత విభాగాన్ని ఏర్పాటు చేయాలనుకునేవారు - ఒకవేళ ఇదివరకే ఉంటే మరింత బలోపేతం చేయాలనుకునేవారు - ఒక సిలబస్‌లా విద్యార్థులకు అందించాల్సిన క్యాసెట్ యిది.

ఇటువంటి ఉపయోగ కారకమైన ఆడియోను ప్రజలకు అందించాలను కోవటం కమర్షియల్ గా క్లిక్ అవటం కోసమా లేక అభిరుచి ప్రసరింప చేయటం కోసమా అన్నది ఎవరికివారు నిర్ణయించుకోవలసిందే. ■



విడుదల : సురభి మ్యూజిక్
వెల : రూ.50/-(క్యాసెట్), రూ.100/-(సి.డి.)

ఈ క్యాసెట్లు, సి.డి లు 'హాసం' ఆఫీసులో లభ్యమవుతున్నాయి. నేరుగా కావాలనుకునేవారు దిగువ నున్న అడ్రస్‌కు ఎం.ఓ. ద్వారా పైకాన్ని పంపి కొరియర్‌లో తెప్పించుకొన వచ్చును. కొరియర్ చార్జీలు అదనం.

1-9-289/3/1/ఎ, విద్యానగర్, పోస్టాఫీసు దగ్గర, మెగాసిటి నెం.774, హైదరాబాద్-500 044. (ఫోన్ : 27616880)

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం

ఇలపావులూరి మురళీమోహనరావు



13

**హెచ్చరిక**

విరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్‌చదవడం నిషేధం. ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.





**జరిగినకథ**

వెంకట్రావు, సుందరిల ఇంట్లో ఓ ఎలుక చేరి నానా రభసా చేస్తూంటుంది. దాన్ని చంపడానికి పెట్టిన మందును వాళ్ల పాప రుచిచూడడంతో ఉత్తుత్తి పరీక్షల పేరిట డాక్టర్లు వేలాది రూపాయలు ఖర్చుపెట్టిస్తారు. ఎలుకలబోను పెడితే దాన్ని ఎలుక కొరికేస్తుంది. మేనేజరు ఇంటినుండి పిల్లిని తెస్తారు. అది ఎలుకను పట్టకుండా పడినిద్రపోతూ ఉంటే వెంకట్రావు మండిపడతాడు. తిండిపెట్టక మాడుస్తాడు. మర్నాడు చీలికలు పేలికలై కనిపించింది ఎలుక. అప్పటినుండి పిల్లి కనబడడం మానేస్తుంది. కంగారుపడుతూండగానే కొన్నాళ్లకు ఆరుకూనలతో సహా అటకమీద ప్రత్యక్షమవుతుంది. పిల్లి కూనలలో ఒకటి చనిపోవటంతో పక్కింటి ఆండాళ్ళమ్మ సలహాతో ప్రాయశ్చిత్తం చేయించాలని పురోహితుడు శాస్త్రిని కలుస్తాడు. శాస్త్రి వెంకట్రావు ఇంటికి వస్తాడు.

-(ఇక చదవండి)

"మధ్యలో అనడానికి నేనెవర్నండీ! ఇంతకూ పిల్లి విషయం..."

"చెబుతాను చెబుతాను. అమ్మాయ్... ఇవాళ టిఫినేం చేశారు?"

"ఇపుడే తినేశామండీ"

పగలబడి నవ్వారు శాస్త్రిగారు.

"అమ్మాయి కూడా చమత్కారాల్లో మిమ్మల్ని మించిపోతున్నదండీ. నా ఉద్దేశ్యం అది కాదు... టిఫిను ఏం వండావూ అని."

"పెసరట్టు, ఉప్మా కొబ్బరి చట్నీ, అల్లప్పచ్చడి, కారప్పొడి" చెప్పింది సుందరి.

బాధగా మూలిగారు శాస్త్రిగారు.

"హతవిధీ.... ఒఖ్ఖ అరగంట ముందుగా రాకపోతినే! దాన్దేముందిలే ఉప్మాలేకపోతే పోయే! ఓ డజను అట్లు వెయ్యడం నీకెంతసేపు పని?" అన్నారు.

తిట్టుకుంటూ లోపలికెళ్ళింది సుందరి.

శాస్త్రిగారి వాలకం చూస్తే అట్లుతిని మరో లోటా కాఫీ తాగితేనే కానీ ఇహలోకం లోకి వచ్చేట్లు లేరు.

"శాస్త్రిగారూ.... పిల్లి సంగతి?"

"వస్తున్నా అబ్బాయ్... మనం దేనికీ తొందర పడరాదు. నిదానమే ప్రధానం. కడుపులో ఎలుకలు పరిగెడుతున్నాయ్.."

"అయ్యబాబోయ్.... ఎలుకలా? ఎక్కడ?" కెవ్వున కేక పెట్టింది సుందరి ప్లేటుతో వస్తూ.

నవ్వారు శాస్త్రిగారు, వెంకట్రావు.

"ఒక ఎలుక మిమ్మల్ని ఇంతగా భయ పెట్టిందంటే విశేషమే. ఎక్కడా కాదమ్మాయ్... నా కడుపులో. ఆ ఎలుకలకు మందు నువ్వుపెట్టే వేడి వేడి పెసరట్లే. రెండు చట్నీలు కలిపి కారప్పొడి అద్ది గొంతులోకి తోశానంటే చచ్చూరు కుంటాయ్."

వెుత్తం అట్టును ఒకే మడతగా చుట్టి చట్నీలలో ముంచి నోట్లోపెట్టుకున్నారు శాస్త్రిగారు.

"ఆహా.. ఈ అల్లప్పచ్చడి అమృతం. కొబ్బరి చట్నీ దివ్యం. కారప్పొడి పూల నుగంధాల వుప్పొడి. దీనికితోడు సాంబారు కూడా ఉంటేనా! వదిజన్మల పర్యంతం మర్చిపోలేం."

మధ్యే మధ్యే ఉదకపానీయంలా కామెంట్లు చేస్తూ ప్లేటు, గిన్నెలు ఖాళీ చేశారు శాస్త్రిగారు.

"అమ్మాయ్.... కమ్మని టిఫిన్ చేసిన తరువాత కాఫీ తాగకపోవడం శాస్త్ర విరుద్ధం. కాబట్టి శాస్త్రీయంగా మరో లోటా కాఫీ పట్రామ్మా" అన్నారు శాస్త్రిగారు.




శాస్త్రిని బండ బూతులు తిట్టుకుంటూ వంటింట్లోకెళ్ళింది సుందరి. కాఫీని సేవించి తృప్తిగా త్రేన్చి రెండు సార్లు గొంతు సవరించుకున్నారు శాస్త్రిగారు.

"హమ్మయ్య... మరో గంటపాటు దిగుల్లేదు. ఇపుడు చెప్పండి వెంకట్రావుగారూ... ఎన్ని పిల్లులను చంపారు?" అడిగారు.

"అయ్యయ్యొ... మేమేమీ పిల్లులను పనిగట్టుకుని చంపలేదండీ. పిల్లులు కాదు... పిల్లి.... పిల్లి... ఒక్క పిల్లి కూన చచ్చింది." కోపంగా అన్నాడు వెంకట్రావు.

"ఆఁ... ఏదైతే ఏం లెండి? చచ్చాడన్నా ప్రాణం పోయిందన్నా ఒకటే. మీరు చంపినా తాను చచ్చినా పిల్లి ప్రాణం పోయింది మాత్రం మీ ఇంట్లోనే. అవునా!" నవ్వుతూ అన్నారు శాస్త్రిగారు.

"అవుననుకోండి"నని గాడుం వెంకట్రావు.

"అది సరేనండి. ఇపుడు మేమేం చెయ్యాలో సెలవివ్వండి." అన్నది సుందరి.

"అందుకే కదా వేంవున్నది. మేముండగా మీరు భయపడటం దేనికి? జాగ్రత్తగా వినండిద్దరూ. వెయ్యి మేకలను, ఐదొందల కుక్కలను చంపడం వంద ఆవులను చంపడంతో నమానం. అటువంటి పదివేల ఆవులను చంపడం కంటే ఒక్క పిల్లిని చంపడం మహాపాపమనీ, లక్షమంది బ్రాహ్మల్ని హత్య చేసినంత పాతకం చుట్టుకుంటుందని, మార్జాల పర్వం నాలుగో ఆశ్వాసంలో బిడాల మహర్షికి నారదుల వారు సెలవిచ్చారు. దీన్నిబట్టి పిల్లిని చంపడం ఎంత మహాపాతకమో మానవుడి ఊహకు అందదు." ఆపారు శాస్త్రిగారు.

సుందరి వెంకట్రావులలో సన్నగా వణుకు ప్రారంభమైంది. వారి స్పందన తృప్తి కలిగించింది శాస్త్రిగారికి.

"వందమంది బ్రాహ్మల్ని హత్య చేసినవాడిని వెల్లికిలా పడుకోబెట్టి కదలకుండా కట్టేసి ఇనుప ముక్కుల కాకులతో కళ్ళలో పొడిపించమన్న యమధర్మరాజు, వెయ్యిగోవులను చంపినవాడి కాళ్ళు గాడిపొయ్యిలో పెట్టి కాలబెడుతూ నూనె కాగబెట్టమన్న ఆ సమవర్తి ఒక్క పిల్లిని చంపిన వాడిని మాత్రం తోలు వలిచి ముక్కలు ముక్కలు చేసి శనగపిండిలో కలిపి పకోడీలను వేయించినట్లు ఎర్రగా వేయించమని చెప్పాడని యమ పురాణంలో తొంభై ఆరో పర్వంలో స్పష్టంగా చెప్పబడి ఉంది." నశ్యం పట్టు బిగించి చెప్పారు శాస్త్రిగారు.

చెమటలు కారిపోయాయా దంపతు లకు.

"అసలీ పిల్లి ఎంతటి మహర్జంతువో చెబుతా వినండి. పిల్లి సాక్షాత్తూ శ్రీ మహా విష్ణువుకు బంధువర్గంలోనిది."

"పిల్లి మహావిష్ణువుకు బంధువా? ఎలాగా?"

"వినండి అసలు పిల్లి ఎవరు?"

"ఎవరూ అంటే పిల్లే...."

"..తప్పు. పిల్లి సాక్షాత్తూ పులికి మేనల్లుడు. పులి ఎవరు?"

## ఎలుకను కొట్టబోయి కరెంట్ షాక్‌కు గుర్రై వ్యక్తి మృతి

చిక్కడపల్లి, జూన్ 16 (న్యూస్‌టుడే): నిద్రకు భంగం కలిగిస్తున్న ఎలుక అంతుచూద్దామని ప్రయత్నించి ప్రాణాలు పోగొట్టుకున్న ఓ యువకుడి ఉదంతమిది. ఎలుకను చంపేందుకు దానిని వెంబండించిన ఆ యువకుడు పట్టుకున్న ఒక మెటల్ పైపు ప్రమాదవశాత్తు హైటెన్షన్ వైర్లకు తగలడంతో అతను విద్యుదాఘాతానికి గుర్రై మరణించిన ఈ సంఘటన చిక్కడపల్లి పోలీసు స్టేషన్ పరిధిలో జరిగింది. సబ్-ఇన్‌స్పెక్టర్ ఎ.సు దర్శన్ కథనం ప్రకారం.... న్యూబాకారంలోని అన్న పూర్ణ నిలయంలోని 202 ఫ్లాట్‌లో నివసిస్తున్న జి.రజనీకాంత్(28) వృత్తిరీత్యా కంప్యూటర్లను అద్దెకు ఇస్తుండేవారు. అతనికి భార్య ఒక బాబు ఉన్నారు. వాళ్ళ ఇంట్లో ఎలుకల బెడద విపరీతం. వాటిమూలంగా కొన్ని సందర్భాల్లో వీరికి రాత్రంతా నిద్ర కూడా ఉండేది కాదు. ఇటీవల ఒకరోజు రాత్రి నిద్రపోతుండగా రజనీకాంత్‌కు ఎలుక కరిచింది. ఆదివారం రాత్రి కుటుంబ సభ్యులందరూ పన్నెండు గంటల వరకు టి.వి.చూస్తున్నారు. ఇంతలో ఒక ఎలుక భార్య జ్యోతిపై నుంచి వెళ్లడంతో ఆమె గట్టిగా అరిచింది. ఈ సంఘటనతో మరింత కోపోద్రిక్తుడైన ఆయన ఒక ఇనుప రాడ్డు చేతిలో పట్టుకుని ఆ ఎలుక వెంట పడ్డాడు. అది ఫ్లాట్ బాల్కనీలో కనిపించడంతో దాన్ని కొట్టేందుకు చేసిన ప్రయత్నంలో ప్రమాదవశాత్తు చేతిలో పట్టుకున్న రాడ్ హైటెన్షన్ వైర్లకు తగిలింది. అంతే, ఆయన ఒక్కసారిగా విద్యుదాఘాతానికి గుర్రై కిందపడిపోయాడు. వెంటనే కుటుంబసభ్యులు అతడిని సాగర్ లాల్ ఆస్పత్రికి తీసుకువెళ్లారు. అప్పటికే రజనీకాంత్ మృతి చెందినట్లు వైద్యులు ధ్రువీకరించారు.

"ఎవరు?"

"పులి సాక్షాత్తూ ఆదిశక్తి వాహనం. ఆదిశక్తి ఎవరు?"

" ఆదిశక్తి అంటే.. అది...అది.."

"వినండి ఆదిశక్తి లక్ష్మీదేవి అంశలోనిది. ఆ లక్ష్మీదేవి మహా విష్ణువు సతీమణి. ఆ విధంగా పిల్లి శ్రీ మహావిష్ణువు బంధువైంది. అంతేకాదు. పిల్లి మేనమామ పులి అయ్యప్పస్వామికి వాహనం. అయ్యప్పస్వామి హరిహరసుతుడు. ఆ విధంగా ఆదిశంకరుడికి కూడా పిల్లి బంధువైంది. మరి అటువంటి పిల్లిని చంపితే ఆ యముడు ఊరు కుంటాడా?"

"పిల్లికంతమంది బంధువులుంటారని మాకు తెలియదండీ. చాలా పాపం చేశాం" భయంగా అన్నాడు వెంకట్రావు.

"అంతేనా! శతకకారుడు గొద్దెన ఏమన్నాడు?"

"గొద్దెన ఎవరండీ?"

"బద్దెన బ్రదరు. ఏమన్నాడు?"

"తెలియదండీ."

**"పర్జన్య శంఖము కన్న**
**గర్జించెడి దర్పసింగ గజముల కంటెన్**
**మార్జాలము సాటి యేది మహిలో సుమతీ!**
అని చాటాడు."

"మేమేన్నడూ ఈ పద్యం వినలేదండీ. సుమతీ శతకం చదివే కానీ ఇలాంటి పద్యం తగల్లేదు." చెప్పింది సుందరి.

"చిన్నప్పుడు చదివారు కదా. మర్చి పోయుంటార్లే. ఇంకా ఈ పిల్లి గురించి భాగవతంలో పోతన వారేం చెప్పారో తెలుసా?"

"తెలియదండీ... భాగవతం శ్రీకృష్ణ లీలలని విన్నాం. అందులో కూడా పిల్లి గురించి ఉందా?"

"అయ్యో... ఇందు గలదని అందులేదని సందేహం వలదు. ఎందెందు వెదకి జూచిన అందందే గలదు బిడాలము కంటే! అని.... ఆ పద్యాలు... శ్లోకాలు మీకు కొరుకుడు పడవు కానీ తాత్పర్యము వివరిస్తాను వినండి. చూడమ్మాయీ సుందరీ. శ్రీ కృష్ణున కిష్టమైన పదార్థములేమిటి?"

"అందరకూ తెలిసినవేగా పాలు, పెరుగు, వెన్న"




"చూశారా... పిల్లిని కూడా సరీష్టూ ఇవంటేనే ఇష్టం. శ్రీకృష్ణుడు దొంగతనంగా గోపెమ్మల ఇళ్ళలో దూరి పాలు, పెరుగు కాజేస్తూ ఎవరైనా వస్తున్న అలజడి కాగానే తుర్రున పారిపోతాడు. పిల్లి కూడా ఎవరూ చూడటం లేదులే అనుకుని దొంగతనంగా ఇళ్ళలో దూరి కళ్ళుమూసుకుని పాలు, పెరుగు తాగుతూ ఏదైనా అలజడి కాగానే తుర్రున పారిపోతుంది. శ్రీకృష్ణుడు వెన్న తిన మూతి తుడుచుకొనట్లే పిల్లికూడా పాలుతాగి మూతి తుడుచుకోదు. శ్రీకృష్ణుడిని నల్ల పిల్లిగా అభివర్ణించారు కవులు. దీన్నిబట్టి మీకేం అర్థమౌతున్నది.?"

"అది కూడా మీరే చెప్పండి"

"పిల్లి శ్రీకృష్ణుడి హంశతో పుట్టింది. పిల్లిని చంపడం అంటే సాక్షాత్తూ శ్రీకృష్ణభగవానుడిని చంపినట్లే. లక్షమంది ఇంద్రులను, పది లక్షల మంది ద్విజులను చంపడం కంటే ఒక్క పిల్లిని చంపడం పాతకాలలోకెల్లా మహాపాపమని బ్రహ్మపురాణం. అఖండ పురాణం. వైదిక శాస్త్రాలలోనూ వేదాలలోనూ, వేదాలలోనూ, ఉపనిషత్తులలోనూ, యోగ సాంఖ్యాయనంలో, జ్యోతిషాది మంత్రశాస్త్రాలలోనూ ప్రవచించడం జరిగింది." మరో నశ్యం పట్టు పట్టారు శాస్త్రిగారు.

గొంతు తడారిపోయింది దంపతులకు.

"దీని వెనక ఇంత గందరగోళం ఉంటుందనుకోలేదు. పుణ్యానికిపోయి పాలు పోస్తే పాపం మెడకు చుట్టుకుంది." విచారంగా అన్నది సుందరి.

"ఇంకా వినండి. అజ్ఞాతవాన సమయంలో అర్జునుడు అఖుభుక్కు మహర్షి ఆశ్రమాన్ని సందర్శించినపుడు అర్జునుడికి నీతి సూత్రాలు బోధిస్తూ జంతు దయ గురించి ప్రస్తావిస్తూ ఆ మహర్షి ఏం చెప్పాడో తెలుసా?"

"మేం అసలు ఆ మహర్షి పేరు కూడా వినలేదు. మీరే చెప్పండి"

"తప్పేదేముంది? వినండి.
**ఆర్జన లేని పెనిమిటిని**
**తర్జన భర్జనలు లేని తర్కములున్నూ**
**మార్జాల రహిత గృహముది వి**
**సర్జింప వలయును వినుము సరిగా పార్థా!'**
ఈ విధంగా పిల్లి ప్రాశస్త్యాన్ని ఎందరెందరో చాటారు."

"మైగాడ్... దరిద్రపు పిల్లికి కూడా ఇంత చరిత్రం ఉందని, కవులు, మునులు కూడా పిల్లికి ఇంత ఇంపార్టెన్స్ ఇచ్చి మా కొంప ముంచుతారని మేము ఊహించలేదు. ఇపుడు మీరు చెబుతుంటే మాకు వెన్నులో చలివేస్తున్నది. ఏం చెయ్యాలి?" వణుకుతూ అన్నది సుందరి.

"అవును శాస్త్రిగారూ. నాదో సందేహం" అన్నాడు వెంకట్రావు.

**-(ఇంకావుంది)**




# కొమ్మ కొమ్మకో సన్నాయి...

## నాయుడుగారూ - నవమినాటి వెన్నెల నేను దశమి నాటి జాబిలి మీరు



అక్షరాన్ని అమృతకలశంగా మూగవేదనను మురళీగానంగా వ్యథిత హృదయాన్ని సుధాలాపంగా మార్చి నేను వెలిగించుకున్న అక్షర దీపాలతో స్వరలక్షణ హారతులందించిన సరస్వతీ చరణచారణ చక్రవర్తి శ్రీ రమేష్ నాయుడు. ఆయన భౌతికంగా దూరతీరాలకు, సుధాలోకాలకు వెళ్లిపోయిన రోజు సెప్టెంబరు 2. అందుకే ఆయన మధుర స్మృతికి ఈ అక్షరాశ్రు తర్పణం.

మురళీధరుడైన రాముడు, కోదండధరుడైన కృష్ణుడు, చక్రధరుడైన శివుడు, చంద్రధరుడైన విష్ణువు, బుద్ధుడి సౌందర్యలహరి, ఆదిశంకరుడి ధమ్మపదం, ఈక్వేటర్‌లో హిమాలయాలు, ఉత్తరధృవంలో హిందూ మహాసముద్రం - ఇవి కలుసుకునే తీరాలు. కలలకే స్వప్నాలు - ఒక్కముక్కలో చెప్పాలంటే అదృశ్యాలు, అసాధ్యాలు. కల్పనా బలం కొద్దీ తలపెట్టే అఘాయిత్యాలు.

అయినా యివి సాధ్యాలే.. కల్పనలు కూడా సత్యాలే - అటువంటి అభూతకల్పన అక్షరసత్యంగా మారిన అపురూప సంఘటన పేరే రమేష్‌నాయుడు -

రమేష్‌నాయుడుకి పదకొండో ఏట వసంతం వచ్చింది. పుట్టిన కృష్ణాతీరం నుంచి, కొండపల్లి నుంచి సుదూర తీరాలకు సహ్య పర్వత ప్రాంత స్వరారణ్యాలకు రెక్కలు కట్టుకు ఎగిరిపోయే ఘడియ వచ్చింది. కానీ అప్పుడా చిరుతప్రాయపు చికిలిపిట్టకు గళం లేదు. స్వరం రాదు. ఎక్కడున్నదీ ఎందుకు వచ్చిందీ తెలియదు. ఇంట్లో వారిపై అలక ఒక్కటే తెలుసు. కడుపులో ఆకలి తెలుసు. అది తీర్చుకునే దారి తెలియదు.

బొంబాయి మహానగరంలో ఈ అబ్బాయి బాట తెలియని బాటసారిగా కడుపు చేత బట్టుకుని తిరిగితిరిగి సొమ్మసిల్లి ఒక చోటికి చేరాడు. అదీ నడిరోడ్డే. అక్కడొక పేవుమెంటు. పక్కనే చెట్టు. అర్ధరాత్రి వేళకు ఓ నాలుగు గంటలపాటు అక్కడ పడుకోడానికి వీలు దొరికింది. అప్పటినుంచీ కొద్ది రోజులు అదే తలదాచుకునే గూడైంది. ఆ ఎదురుగానే ఒక మ్యూజికల్‌షాపు. సితారలు, వేణువులు, తబలాలు వగైరాలు అమ్మే షాపు. ఆ షాపు యజమాని ఈ మైనర్ ఆంధ్రావాలాను చూసి ముచ్చటపడి ఉద్యోగ మిచ్చాడు. షాపులో పనిపాటలు చూడడం, బేరగాళ్లకు వాయిద్యాలు చూపించడం, దులిపి శుభ్రం చేయడం వగైరా పనులు.

ఆ షాపుకు ఎందరో ప్రసిద్ధులైన గాయకులు, వాద్యప్రవీణులు సినిమావాళ్లు, కానివాళ్లు వచ్చేవారు. నిరంతరం బేరసారాలతో పాటు సంగీత గోష్ఠి జరుగుతూ వుండేది. ఆ చిన్న వయసులో ఈ గోష్ఠితో బాలనాయుడికి కడుపునిండేది. తనకు తెలియకుండానే ట్యూన్లు అవ్యక్తంగా పుట్టుకొచ్చేవి. వాద్యాలన్నీ అతనికి మంచి ఫ్రెండ్స్ అయిపోయాయి. వాటిని పలకరించడం, అవి పలికితే పులకరించిపోవడం జరిగేది.



అక్కడికి కొలంబియా, ఓడియన్ గ్రామఫోను కంపెనీల వాళ్లు తరచు వస్తూవుండేవాళ్లు. మొట్టమొదటిసారిగా వాళ్లకు రమేష్‌నాయుడు మీద దృష్టి పడింది. 'పాటలు కొన్ని యిస్తాం కంపోజ్ చేస్తావా' అని అడిగారు. అప్పటికి అతను బొంబాయి చేరి మూడేళ్ళు. అతనికి పద్నాలుగేళ్ళు. నాయుడు కంపోజింగ్ చేసిన తీరు వాళ్లకి నచ్చింది. సంగీత శాస్త్రజ్ఞులూ మెచ్చారు. అజ్ఞాతంగా అతనిలో నిక్షిప్తమై వున్న నాదబీజానికి అంకురార్పణ జరిగింది. ఆనాడే సంగీత దర్శకుడు రమేష్‌నాయుడు జన్మదినం జరుపుకున్నాడు.

అంతలో ఎన్నో క్లాసిక్ చిత్రాల నిర్మాత, దర్శకుడు, నటుడు శ్రీ కిశోర్‌సాహూ దృష్టి నాయుడుపై పడింది. ఆయన తీసిన 'హామ్లెట్' ఆంగ్ల చిత్రానికి రీరికార్డింగు చేయడానికి పిలిపించారు. ఎంతో దక్షతతో ఆ పని పూర్తి చేసి అటు తర్వాత మరి రెండు సాహూ చిత్రాలకు ఉప సంగీత దర్శకుడుగా, సహాయకుడుగా అతను పనిచేశాడు. అప్పటికి తనకంటూ ఒక నివాసం అద్దెకు ఏర్పాటు చేసుకోగల స్తోమత అతనికి కలిగింది. అదే ఇంట్లో రమేష్ నాయుడితో పాటు అద్దెలో భాగం పంచుకుంటూ మరి ముగ్గురు చేరారు. వారే ఆనాటి ఔత్సాహికులు. మరునాటి ప్రసిద్ధ కళాకారులు సునీల్‌దత్, మాలాసిన్హా, సిప్పీలు.

రమేష్‌నాయుడు సంగీతంలో తొలి మలయ మారుతాలు వీస్తున్న రోజుల్లో మహా సంగీత దర్శకుడు చితల్కర్ (సి.రామచంద్ర) దృష్టి ఇతనిపై పడింది. కొత్తగాలితో సరికొత్త హాయితో పలుకుతున్న ఈ తెలుగు వేణువును ముద్దాడాలనిపించింది ఆయనకు. ఢిల్లీకి తనతో తీసుకువెళ్లి రెండేళ్ళపాటు సహాయకుడుగా చేసుకుని బెంగాలీ, అస్సామీస్ సంగీతాల పరిచయానికి కారణమైనారు చితల్కర్.

అటు తరువాత తన నివాసం కలకత్తాకు మార్చుకుని బెంగాలీ సంగీత వైదుష్యం తనలో పెంపొందించుకుని డబ్బింగ్ ప్రొడ్యూసర్‌గా కొత్త అవతారం ఎత్తి తన ఆంధ్రత్వాన్ని చాటుకున్నాడు. తెలుగులో వచ్చిన అనేక పౌరాణిక, సాంఘిక చిత్రాలను బెంగాలీలోకి 'డబ్బింగ్' చేసి తెలుగు సినిమాకు పేరు ప్రతిష్టలతో పాటు అధిక లాభాలు సమకూర్చిపెట్టాడు. ఆ పనుల మీద తరచుగా మద్రాసు వస్తూ వుండడంతో స్వతహాగా బంధువైన జెమినీ థియేటర్ సౌండ్ ఇంజనీర్ జెమినీ కోటేశ్వరరావు గారికి సన్నిహితుడై ఆయన సలహా, ప్రోత్సాహాల మేరకు తెలుగు సినిమాలకు సంగీత దర్శకత్వం బాధ్యత చేపట్టారు.

ఆ సుముహూర్తమెటువంటిదో గాని తెలుగు చలనచిత్ర సంగీతం కొత్త ఊపిరి పీల్చుకుంది. హాయినిధులు వాయులీనమై గాలికెగిరిపోకుండా ప్రాణవాయువుగా మార్చుకుని ఆయువు పెంచుకుంది. ఘంటసాల గాత్ర మాధుర్యంతో, దక్షిణాత్య పద్ధతిలో చాలావరకు సాగిపోతున్న సంగీత యాత్రకు కొత్త మలుపు, మజిలీ చూపించింది రమేష్‌నాయుడు సంగీతం, మనోరమ, స్వయంప్రభ, దాంపత్యం వగైరా చిత్రాలు రమేష్‌నాయుడు తొలిసారిగా తెలుగు నేలపై జల్లిన మధుర స్వరవర్షాలు. 'అందాల సీమ సుధానిలయం ఈ లోకమే దివ్య ప్రేమమయం' అని తలత్ మహమ్మద్ పాడిన పాట రమేష్ సరిగమలకు తలత్ మధురిమలకు శాశ్వతంగా నిలిచిపోయే నిధి. అలాగే 'దాంపత్యం'లో 'తానేమి తలంచేనో' అనే పాట దాని లలిత వాద్య సమ్మేళనం కూడా మరిచిపోలేనివి.

ఆనాడు రమేష్ రాగోదయం తెలుగింట వెలగడానికి కారకులైన జెమినీ కోటేశ్వరరావు, నటి, నిర్మాత్రి కృష్ణవేణి గార్లను ముఖ్యంగా స్మరించక తప్పదు.

స్వేచ్ఛ కళాకారుడికి ప్రాణం - అది కొరవడి మళ్లీ రమేష్‌నాయుడు బొంబాయి వెళ్లిపోయారు. ఇక్కడున్న రెండుమూడేళ్లలో మూడు చిత్రాలకు మధురాతి మధురమైన సంగీతం సమకూర్చినా తన బాణీకి 'యిక్కడ అవకాశం తక్కువ' అని బాధపడి తిరిగి వెళ్లడం జరిగింది. ఈలోగా తెలుగువారికి అప్పుడప్పుడే పరిచయమవుతున్న ఎ.ఎం.రాజాని మరింత వెలుగులోకి తెచ్చారు నాయుడు గారు. రాజా చేత, రావు బాలసరస్వతీ దేవి చేత కొన్ని ప్రయివేటు సాంగ్సు పాడించారు. అప్పటికే బాలసరస్వతి గాయనిగా ఎస్.రాజేశ్వరరావుతో కలిసీ, విడిగాను ఎన్నో మధుర గీతాలు పాడారు. 'పొదరింటిలోనుండి... ఆ తోటలోనొకటి... ముసురేసిందంటే' వగైరా గీతాలు.

ఇలా సాగుతూ వచ్చిన రమేష్ నాయుడు గారి సంగీత జీవిత యాత్రలో ప్రధాన ఘట్టం 1960 దశకంలో జరిగింది. తిరిగి ఆయన అమ్మ పాట అయిన తెలుగు పాట కోసం... 'అమ్మ మాట' కోసం మద్రాసు రావడం జరిగింది. ఆ చిత్ర నిర్మాత జి.వి.యస్.రాజు, జెమినీ కోటేశ్వరరరావుల పూనిక వల్ల మళ్లీ తెలుగు రంగానికి వచ్చిన రమేష్ నాయుడు తిరిగి వెళ్లిపోలేదు. 'అమ్మమాట'లో ఆయన చేసిన పాటలన్నీ వాణి పరంగా వాణిజ్య పరంగా సూపర్‌హిట్లు అయ్యాయి. అందులో ఎల్.ఆర్.ఈశ్వరి పాడిన 'మాయదారి సిన్నోడు నా మనసే లాగేసిండు' పాట వాడవాడలా ఈనాటికీ మోగుతూనే వుంది. ఆనాటినుంచీ రమేష్ నాయుడు శకం ప్రారంభమైంది. తన స్వరంతో ఒక తరాన్ని నిర్మించుకుని తరతరాలకు తరగని మాధుర్యాన్ని అందించిన నాదతపస్విగా ఆయన అందరికీ ఆరాధ్యుడైనాడు. ఆ దశలో ఆయనకు ఎం.ఎస్.శ్రీరామ్, యనమంద్ర (వయొలిన్) శర్మ, చిత్తరంజన్, పూర్ణచందర్ వంటి సంగీతజ్ఞుల సహాయ సహకారాలు లభించాయి. అటు తర్వాత నేటి ఆకాశవాణి (విశాఖపట్నం) సంగీత దర్శకుడు కె.యస్.చంద్రశేఖర్ కూడా ఆయనకు సహాయకుడుగా పనిచేశారు.

ఆయన సంగీతం సమకూర్చిన చిత్రాలలో చెప్పుకోవలసినవి తాతమనవడు, జీవితం, బహుదూరపు బాటసారి, మీనా, అందాలరాశి, భోగి మంటలు, హేమాహేమీలు, ముద్దమందారం, మల్లెపందిరి, దేవుడు చేసిన మనుషులు, సువర్ణసుందరి (కొత్తది), శ్రీవారికి ప్రేమలేఖ, శివరంజని, చిల్లరకొట్టు చిట్టెమ్మ, ఆశాజ్యోతి, తూర్పు పడమర, కళ్యాణి, రెండుజెళ్ల సీత, అహనా పెళ్లంట, మేఘసందేశం, ఆనందభైరవి ఇలా ఎన్నో సుమధుర

సంగీత సంచికలు, సుపర్వాణగాన విపంచికలు స్వరమేశ్వరుడి గానలహరులై రసానందంలో శ్రోతలను ముంచెత్తాయి.

రమేష్‌నాయుడు సంగీత దర్శకుడుగా సాగించిన ప్రస్థానంలో ఆ గానమాధుర్య నిధులు తెలుగు వారికి మిగలడానికి సంగీత రసజ్ఞులైన ముగ్గురు కారణం, వారు దాసరి నారాయణరావు, విజయనిర్మల, జంధ్యాల. ఈ ముగ్గురికీ నాయుడు గారి సంగీతమంటే ప్రాణం. ఆయనకు అండదండలు వారి ప్రోత్సాహం, సహకారం.

'గురులేక ఎటువంటి గురిని కానగరాదు' అనే వాగ్గేయం నాయుడు గారి విషయంలో చిత్రమైన అర్థం చెప్పింది. ఏ జన్మదో నిద్రాణమై వున్న సంగీత బీజం బొంబాయి సంగీత వాద్యాల షాపులో మొలకెత్తింది. ఆ షాపు యజమాని నీడలో ఎదిగింది. నిత్యావసరాలుగా మారిన నవరసాల రాగాల తోడు దొరికింది. వింటే వినిపించే సంస్కారం పుట్టుకొచ్చింది. అంటే ఆలాపనై ఆకర్షించే స్థితికి పెరిగింది. సి.రామచంద్ర వెన్ను తడితే అది మిన్ను దాటింది. తిమిర్‌బరన్, సైగల్, కె.సి.డే, పంకజ్‌మల్లిక్ వంటి మహనీయుల స్వర విహారంలో అతని తీరం అతనికి కనిపించింది. విష్ణుపంత్ ఫగ్నీస్, ఖేమ్‌చంద్‌ప్రకాష్, ఎస్.డి.బర్మన్, మదన్‌మోహన్‌ల ప్రభావం అతని ఎదుగుదలకు ఆస్కారం కల్పించింది. తనకు శ్రవేణేంద్రియం గురువైంది. లాలస పిపాసగా మారింది. జీవితం, అనుభవం, స్నేహం, ఉద్యోగం, గోష్ఠి పాఠ్యగ్రంథాలైనాయి.



అమ్మమ్మను, మేనమామను వదిలి ఏడురంగుల రెక్కలు విప్పుకుని రైలెక్కి బయలుదేరిన ఈ కొండపల్లి బొమ్మ బొంబాయిలో కొలాబా, కామాటిపురా ప్రాంతాలలో తిరిగి సప్తవర్ణాల సంగీత విహంగమై ఎగిరి, తిరిగి తిరిగి మళ్లీ తెలుగు చిత్ర సీమకే వచ్చి సుధాలాప వేణువులను, సారణి వీణలను పలికించింది. జనహృదయ కేదారాలను పండించింది. ఎన్ని అమృత మధురమైన గీతాలు, ఎన్ని అద్భుత స్వర సమ్మేళనాలు, ఎన్ని ఎల్లలు లేని మనోధర్మ సంగీత ప్రస్థారాలు, ఎన్ని రాగరాగిణీ సంగమాలు, ఎన్నయినా ఎన్నడూ వీడని లాలిత్యాలు, హాయిని గూర్చే మాధుర్యాలు!

ఆయన గురుముఖాన నేర్చిన శాస్త్రీయ సంగీతం లేదు. అయినా ఆయనలో సంగీత సరస్వతి శాస్త్రీయ వైభవంతో కొలువుదీరింది. ఆయనలోని సంస్కారం ఆ తల్లికి సంస్థానమైంది. సంగీత దర్శకుడు గానే కాక గాయకుడుగా కూడా ఆయన జాతీయ గౌరవాన్ని రెండుసార్లు పొందారు.

సినిమా సంగీతం వరకు అపురూపరాగాల అనాఘ్రాత సౌరభాలతో ప్రేక్షక శ్రోతలను సమ్మోహనం చేసిన గంధర్వుడు శ్రీ రమేష్‌నాయుడు శివరంజని, అమృతవర్షిణి, ఆనందభైరవి, కళ్యాణి, మోహన కళ్యాణి, మాల్కోస్, సింధుభైరవి రాగాలను ఆయన సినిమా గీతాలకు అనువదించిన తీరు అపూర్వం, ఆయన శైలి అనితర సాధ్యం. ఆయన జానపద బాణీలు వాటికవే సాటి.

అన్నిటికీ మించి ఆయన మహాజ్ఞాని. మధుర నాద సుధాలోక శారీరుడు. ఎన్నడూ బాణీల స్టాకు పెట్టుకుని రచయితలపై విసిరిన వాడు కాదు. రాసిన గీతాన్ని చూసి అక్షరాత్మను అవగాహన చేసుకుని స్పందించిన స్వరసముద్రుడు. ఈ విషయంలో ఆయనకు దీటు రాగలిగిన వారు కె.వి.మహదేవన్ ఒక్కరే - అంతకు పూర్వతరంలో రాజేశ్వరరావు, పెండ్యాల నాగేశ్వరరావు అటువంటివారు. అంతర్నిహితంగా నాయుడు గారి ఆత్మ సంస్కారం ఆయన సంగీతానికి ఆధారంగా ఉండేది. అందుకనే 'జోరుమీదున్నావు తుమ్మెదా నీ జోరెవరికోసమే తుమ్మెదా' అని దాసం గోపాలకృష్ణ గారు పల్లవి రాయగానే ఎవరూ ఊహించని విధంగా జానపదానికి శాస్త్రీయ సంగీత సౌరభాలు అద్ది మోహన కళ్యాణిలో ఆయన స్వరపరిచారు. ఆ స్వరరచనా వైదుష్యానికి రసాలూరు రాజేశ్వరు డంతటివాడు ఆశ్చర్యపోయి నాయుడిగారికి స్వయంగా అభినందనలు తెలిపి, ఆశీర్వదించడం జరిగింది.

రమేష్‌నాయుడు ఏనాడూ హోలెడు ఆర్కెస్ట్రాతో బోలెడు రొదచేసే వాద్య మహాసభలు ఏర్పాటు చేసి రికార్డింగులు చేయలేదు. ఏనాడో గోల్డెన్ స్టూడియోలో చిత్తూరు నాగయ్య గారు ఒక గదిలో కూర్చుని నాలుగు వాయిద్యాలతో పాడగా రికార్డింగు జరిగిన సంఘటనలు జ్ఞప్తికి తెచ్చే విధంగా చేసేవారు. శబ్దాడంబరం కాక నాదాత్మ ఆయన స్వరకల్పనలో ధ్రువంగా దర్శనమిచ్చేది. శ్రవణేంద్రియానికి దర్శనమిచ్చే ఆలాపన అది.. రవమది.. రాగమది. ఏనాడో పెండ్యాల గారు సాధించినదా మహోన్నత ఫలితం. 'దొంగరాముడు' చిత్రంలో సుశీల పాడిన

**'అనురాగము విరిసేనా ఓ రేరాజా**
**అనుతాపము తీరేనా**
**వినువీధినేలే రాజువే**
**నిరుపేద చెలిపై మనసౌనా**
**కొనసాగే మోహాలేమో-**
**చెలరేగే సందేహాలేమో**
**నీ మనసేమొ తేటగా**
**తెనిగించవయా మహారాజా'**

పొగడపూల మాల అల్లికను గుర్తు చేసే ఈ సుకుమార సురభిళ గేయ పంక్తులకు (హిందుస్తానీ తోడి, నటభైరవి) నాడు పెండ్యాల గారు చేసిన స్వరాభిషేకం రసహృదయం ఏనాటికీ మరచిపోదు. అలాగే ఒక్క 'ఏకతార' ప్రధాన వాద్యంగా రమేష్‌నాయుడు చేసిన 'జోరుమీదున్నావు' సంగీతం ఉన్నన్నాళ్లూ వుంటుంది. మొదటి పాటలో 'ఓ రేరాజా' అన్నప్పుడు, రెండవ పాటలో 'నీజోరెవరికోసమే' అన్నప్పుడు మధురగానశీల సుశీల గాత్రంలో ముగ్ధ మోహనంగా, హాయిలీనంగా వెలువడిన 'రేఫ'లు 'ఓ రే'.. 'జోరె'లు శ్రవణేంద్రియాలకు శాశ్వతనిధులు.

సాహిత్యాన్ని ఆరాధించిన సంగీతవేత్త రమేష్ నాయుడు. పాటరాసి ముందు పెట్టగానే ఆ పాటను తనకళ్లతో ఛాయాగ్రహణం చేసుకుని హృదయంలోకి అనువదించుకుని అక్షరనాదాన్ని, గీతంలో భావాన్ని వ్యక్తం చేయడానికి ఆయన పడే మధురయాతన 'మౌనావస్థ' చూస్తుంటే మనస్సు వినమ్ర భావంతో ఆయనకు నమస్కరించేది. 'టైగర్ బామ్' ఆయన ఎప్పుడూ దగ్గర వుంచు కునేవాడు. ముఖాన, ముకుపుటాలపైన, మెడకు అది పూసుకుని ఆ సెగలోంచి సరిగమలు పుట్టించి ఆయన బాణీలు కట్టడం జరిగేది. ఆ సమయంలో తన పరిసరాలతో పాటు ప్రపంచాన్నే మరచిపోయి స్వర ప్రపంచంలో అనూనమైన పుష్పాలకోసం భ్రమర కుమారుడు అన్వేషణ చేస్తున్నాడా అనిపించేది.

లతా మంగేష్కర్ తొలి రోజులలో పాడిన నామదేవుడి మరాఠీ గీతం 'వృక్షవల్లీ అమా సోయరీ' ఆయనకు ప్రాణ సమానమైన పాట. దాని అర్థం నాకు చెప్పి ఇలాంటి పాటలు రాసి స్వరపరచి కాసెట్‌గా విడుదల చేయాలని కలలు కనేవాడు.

ప్రముఖ దర్శకుడు శ్రీ తాతినేని ప్రకాశరావు తీసిన 'ఆశాజ్యోతి' చిత్రానికి పడవపాట ఒకటి కావలసి వచ్చింది. సన్నివేశం చాలా ఉదాత్తమైనది. తన ప్రియుడు పడవలో గోదావరి దాటివెళ్ళి పోతుంటే తన మనసు అతనికి చెప్పాలని పరుగు పరుగున వచ్చిన కన్నెపిల్ల, మాటకందని దూరంలో వెళ్ళిపోతున్న పడవలో ప్రియుడు.. ఇదీ సన్నివేశం ఇక్కడ పడవవాడు.. ఆ సన్నివేశంలో తను పాడుకునే ఓ పడవ పాట. ఆ సన్నివేశానికి, ఆ కన్నెపడుచు మనోభావానికి అద్దం పట్టే పాటగా వుండాలి. ఒకరిద్దరి చేత దర్శకుడు రాయించి నాయుడు గారికి యిచ్చారు. కానీ నాయుడు గారికి ప్రేరణ కలగలేదు. కంపోజింగు ఆగిపోయింది. 'ఏం చేద్దాం' అన్నారు దర్శకులు. వెంటనే నాయుడు గారు విజయాగార్డెన్స్‌కు వచ్చి 'నాకో పాట కావాలి... సన్నివేశం నేను చెబుతాను.. రాసి పెట్టండి' అన్నారు. ఆ తరువాత ఆ పాట నేను చెబుతుంటే ఆయనే రాసుకున్నారు.

**'ఏరెల్లి పోతున్నా నీరుండిపోయింది**
**నీటి మీద రాత రాసి నావెళ్లిపోయింది**
**కోటిపల్లి రేవుకాడ సిలకమ్మ గొడవ**
**కోరంగి దాటింది గోరంక పడవ'**

ఇదీ పల్లవి. ఈ పల్లవి నేను చెప్పగానే ఆయన 'చరణాలు రాసి పంపించండి - మనిషిని పంపుతాను. నా మటుకు నాకు పాట వచ్చేసింది' అని హుటాహుటిని వెళ్లిపోయారు. ఆ పాట రికార్డింగుకు కూడా నేను వెళ్లలేదు. అది వినిపించడానికి నాయుడు గారు, ప్రకాశరావు గారు నన్ను వెతుక్కుంటూ వచ్చారు. చాలా ఆనందంతో ప్రకాశరావు గారు నన్ను ఆలింగనం చేసుకున్నారు. ఆ పాట వింటే రమేష్ స్వరకల్పనా శిల్పం రేఖామాత్రంగా శ్రోతలకు దర్శనమిస్తుంది.

ముట్టుకుంటే కందిపోతాయేమో అన్నంత సున్నితంగా హార్మోనియం రీడ్స్‌పైన వేళ్లు ఆనీ ఆనకుండా ట్యూన్ చేస్తూ గుండెలోతుల్లో నుంచి ఎలుగెత్తి పాడే రమేష్ నాయుడు కవుల జీవితాన్ని సార్థకం చేసిన సంగీత దర్శకుడు - ఆయనకు నేను రాసిన గీతాలు నా జీవితోద్యానంలో ఆత్మానందం కలిగించే అతసీ కుసుమాలు - గీత గోవింద సమాలు 'మేఘసందేశం' చిత్రంలో నేను రాసిన 'నవరససుమమాలిక నా జీవనాధార నవరాగ మాలిక' (జేసుదాసు) మా యిద్దరి కలయికలో పుట్టిన పాటల వల్ల కలిగిన పులకరింతకు పల్లవి పలకరింత అది నా స్వానుభవం. రసానుభవం.



'మేఘసందేశం' కంపోజింగు రకరకాల ప్రదేశాలలో జరిగింది. అందులో రెండు పాటలు 'ఆకాశదేశాన ఆషాఢ మాసాన మెరిసేటి ఓ మేఘమా', 'పాడనా వాణి కళ్యాణిగా' మైసూర్ లలితా మహల్ పాలెస్‌లో రాశాను. అప్పుడు ఆ చిత్రం షూటింగు కూడా అక్కడే జరుగుతుండడంతో నన్నూ, నాయుడు గారినీ కూడా అక్కడికే పిలిపించారు. ముఖ్యంగా 'ఆకాశదేశాన' పాట రాసిన సన్నివేశం నేను మరువలేనిది. లలితామహల్ రెండవ అంతస్థులో దర్బార్‌హాలులో రమేష్‌నాయుడు తన వాద్య బృందంతో కొలువుతీరారు. దర్శకుడు దాసరినారాయణరావు గారు, పాలగుమ్మి పద్మరాజు గారు తదితరులు కూడా వున్నారు. నేను ఆ బయట కారిడార్‌లో రమణబాబు అనే సహాయ దర్శకుడితో కూర్చుని వున్నాను. ఆకాశం సన్నివేశానికి అద్దం పడుతూ కాలమేఘాలతో కటిక చీకట్లు చిమ్ముతోంది. వర్ష ఋతుపవనాలు జల్లున ఈదురుగాలులుగా వస్తున్నాయి. కారు మబ్బులు లలితామహల్ శ్వేత శిఖరాల మీద వాలుతూ తేలిపోతున్నాయి. తుంపర ప్రారంభమై జల్లుగా మారి నాకు చల్లగా తాకింది. ఆ హర్మ్య గవాక్షాల నుండి ఆకాశం వంక చూస్తుంటే కూని రాగంలా 'ఆకాశదేశాన ఆషాఢమాసాన' అంటూ పల్లవి అప్రయత్నంగా వచ్చింది. వెనక నిలబడి చూస్తున్నారు కాబోలు పద్మరాజుగారు. వెనకనించి కూర్చుని వున్న నా భుజాలపై చెయ్యివేసి 'ఆకాశదేశాన' అన్న ఆ ఒక్కమాట చాలయ్యా అంటూ మెచ్చుకున్నారు. పాట రచనంతా దర్శకులు క్షుణ్ణంగా సన్నివేశం చెప్పివుండడం వల్ల ఆనాడే అయిపోయింది. నేను రాస్తుంటే రమేష్ నాయుడు గారు 'శివరంజని'లో దాన్ని స్వరపరచిన తీరు అందరికీ తెలిసిందే.

కళ్యాణి రాగం సినిమా సంగీతంలో ఎన్నో కొత్త అందాలు దిద్దుకుంది. ఉత్తర దక్షిణ సంగీత సంప్రదాయాలను తనలో ఇముడ్చుకొని కొత్తదనంతో హృదయాలకు హత్తుకుపోయింది. రసమేదైనా రాగరంజితం చేసింది. 'దేవదాసు' చిత్రంలో గుండెలు పగిలే కొండలు రగిలే విషాద గీతానికి కళ్యాణి రాగాన్ని వాడిన ఘనత సి.ఆర్.సుబ్బరామన్ గారిది. రాజేశ్వరరావు, పెండ్యాల, మహదేవన్, ఘంటసాల కళ్యాణిలో చిరస్మరణీయమైన పాటలు చేశారు. మహానటి, గాయని శ్రీమతి పి.భానుమతికి కళ్యాణి రాగమంటే ఎంతో యిష్టం. ఆమె స్వీయ సంగీత దర్శకత్వంలోను, ఇతరత్రా కూడా ఆమె ఆ రాగంలో పాడిన పాటలు చాలా పేరు గడించాయి.

రమేష్‌నాయుడు 'మేఘసందేశం'లో నేను రాసిన 'పాడనావాణి కళ్యాణిగా' అనే పాటను కళ్యాణి రాగంలో స్వరకల్పన చేయగా శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ నటిస్తూ పాడారు. కర్ణాటక హిందుస్తానీ ఫణితులను కలబోసి చేసిన ఆ పాటకు బాలమురళిగారు స్వరం రాసుకుంటూ మధ్యమధ్య చేసిన ఆనంద ప్రకటనలు 'సెభాష్' 'ఆహా'లను విని నేనెంతో ఆశ్చర్యచకితుడనైనాను. అంతటి సంగీత సముద్రుడు పాటంతా స్వరాలు రాసుకున్న తరువాత నాయుడు గారిని 'వాయిస్ రూం'లోకి పిలిచి కౌగిలించుకున్నారు. ఆ సంతోషంలో ఆయన అద్భుతంగా గానం చేసిన పాట అది.

అదే చిత్రంలో 'నిన్నటి దాకా శిలనైనా నీ పదము సోకి నే గౌతమినైనా' సింధుభైరవిలో సుగమ సంగీత సంప్రదాయంలో శ్రీమతి సుశీల చేత పాడించారు. ఆమె తొలినాళ్ల కంఠ లాలిత్యంతో మనోహరంగా ఆ పాట పాడడానికి స్వరమేశ్వరుడి స్వరసౌకుమార్యమే కారణం.

జంధ్యాలకి రమేష్‌నాయుడు గారంటే అమితమైన అభిమానం, ఆరాధనాభావం. తన తొలిచిత్రం 'ముద్దమందారం' స్వరకల్పన కార్యక్రమం అందాలు చిందే కృష్ణవేణమ్మ తీరాన నాగార్జునసాగర్‌లో జరిగింది. వారం రోజులు ప్రపంచానికి దూరంగా అక్కడి అశోక్‌విహార్ అతిథిగృహంలో మా సిట్టింగ్స్ జరిగాయి.

జంధ్యాల హాస్యమంటే నాయుడు గారికి విపరీతమైన ఇష్టం. కొన్ని సన్నివేశాలు జంధ్యాల చెబుతుంటే అందులో హాస్యానికి 'కళ్లనీళ్ల పర్యంతం' నవ్వేవారు నాయుడుగారు. నవ్వకుండా వుండడం ఎవరితరం! అందరూ నవ్వేవారు. ఆ వారం రోజులూ మంచి విందులతో, వీనుల విందులతో క్షణంలా గడిచిపోయాయి. ముద్దులు మూటగట్టుకున్న ముచ్చటైన పాటలతో మూటముల్లె సర్దుకుని తిరుగు ప్రయాణమయ్యే వేళకు కృష్ణవేణమ్మను స్మరిస్తూ ఒక అందమైన పాట వుంటే ఎలా వుంటుంది అని జంధ్యాల అనడం... ఒక పూటలో ఆ పాట పూర్తి కావడం జరిగింది. **'నా వాలుజడ కృష్ణవేణి.... వెన్నెలా గోదారి'** అనే పాట అది.

లలిత లలితమైన నాయుడు గారి స్వరలహరికి పులకరించిన ఆనాటి పాటలలో ఒకటి -

**'అలివేణీ ఆణిముత్యమా**
**నీకంట నీటిముత్యమా**
**ఆవిరి చిగురో అది ఊపిరికబురో**
**స్వాతివానా లేత ఎండలో - అవి**
**జాలినవ్వు జాజిదండలో'**

అలాగే మరొక పాట, మరువలేని సన్నివేశం పలికించిన సంగీత సాహిత్యాల మూట -

**'నీలాలు కారేనా కాలాలు మారేనా**
**నీ జాలినే పంచుకోనా**
**నీ లాలినే పాడలేనా**
**జాజి పూసేవేళ జాబిల్లివేళ**
**పూలా డోలా నేను కానా...**
**సూరీడు నెలరేడు సిరిగలదొరలేకారులే**
**పూరీ గుడిసెల్లో పేదా మనసుల్లో**
**వెలిగేటి దీపాలులే**
**ఆ నింగి ఈ నేల కొనగల సిరులే లేవులే**
**ఒడిలో నీవుంటే ఒదిగీ పోతుంటే కడతేరిపోతానులే**

ఈ పాట స్వరకల్పనలో అంతర్నిహితంగా 'మాండ్' రాగచ్ఛాయ అంతరాత్మగా గోచరిస్తుంది. దేశ్ రాగచ్ఛాయలు కూడా ఇందులో ఉన్నాయి. జాలితో అంటే కరుణ రసంతో కూడిన వైరాగ్యాన్ని నైరాశ్యంతో నిజాన్ని సమీపించే హేతువాదాన్ని స్ఫురింపజేసే రాగరచన అది.

-(తరువాయి వచ్చే సంచికలో)

**-వేటూరి సుందరరామమూర్తి**



# రమేష్ నాయుడు హిట్స్

## తూర్పుపడమర

రచన: సి.నారాయణరెడ్డి  గానం: యస్.పి.బాలసుబ్రహ్మణ్యం

ప: శివరంజనీ! నవరాగిణీ!
వినినంతనే - నా తనువులోని
అణువణువు కరిగించే అమృతవాహినీ
చ: రాగాల సిగలోన సిరిమల్లివి సంగీత గగనాన జాబిల్లివి
స్వరసురఝరీతరంగానివి
సరస హృదయవీణావాణివి ॥శివరంజనీ॥
చ: ఆ కనులు పండువెన్నెల గనులు
ఆ కురులు ఇంద్రనీలాలవనులు
ఆ వదనం అరుణోదయకమలం
ఆ అధరం సుమధురమధుకలశం ॥శివరంజనీ॥
చ: జనకుని కొలువున అల్లనసాగే జగన్మోహినీ జానకీ!
వేణుధరుని రథమారోహించిన విదుషీమణి రుక్మిణీ!
రాశీకృత నవరసమయ జీవన రాగచంద్రికా!
లలిత లావణ్య భయద సౌందర్య కలిత చండికా!
రావే... రావే నా శివరంజనీ! మనోరంజనీ!
రంజనీ! నా రంజనీ!
నీవే నీవే నాలో పలికే నాదానివి
నీవే నా దానివి నా దానివి నీవే నా దానివి

## కళ్యాణి

రచన: సి.నారాయణరెడ్డి  గానం: ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం

ప: లలిత కళారాధనలో వెలిగే చిరుదివ్వెను నేను
మధుర భారతి పద సన్నిధిలో
ఒదిగే తొలి పువ్వును నేను ॥లలిత॥
చ: ఏ ఫలమాశించి మత్తకోకిల ఎలుగెత్తి పాడును
ఏ వెల ఆశించి పూసే పువ్వు తావి విరజిమ్మును
అవధిలేని ప్రతి అనుభూతికీ
ఆత్మానందమే పరమార్థం ॥లలిత॥
చ: ఏ సిరికోరి పోతన్న భాగవత సుధలు చిలికించెను
ఏ నిధి కోరి త్యాగయ్య రాగ జలనిధులు పొంగించెను
రమణీయ కళావిష్కృతికి రసానందమే పరమార్థం ॥లలిత॥

## శివరంజని

రచన: దాసం గోపాలకృష్ణ  గానం: పి.సుశీల

జోరు మీదున్నావు తుమ్మెదా నీ జోరెవరి కోసమే తుమ్మెదా
యిల్లిల్లు తిరిగేవు తుమ్మెదా - నీ ఒల్లు జాగరతె తుమ్మెదా
ముస్తాబు అయ్యావు తుమ్మెదా - కస్తూరి రాసావు తుమ్మెదా
మనక యెన్నెల్లోన తుమ్మెదా మల్లె పందిరికాడ తుమ్మెదా
మాల కడుతున్నావు తుమ్మెదా - ఆ మాలెవరి కోసమే తుమ్మెదా
॥జోరు॥
మెత్తని పరుపూలు తుమ్మెదా - గుత్తంగా కుట్టావు తుమ్మెదా
వత్తైన పరుపుపై తుమ్మెదా - అత్తర్లు చల్లావు తుమ్మెదా
పక్కవేసుంచావు తుమ్మెదా - ఆ పక్కెవరికోసమే తుమ్మెదా
॥జోరు॥

## మనోరమ

రచన: సముద్రాల జూనియర్  గానం: తలత్ మహమ్మద్

అందాల సీమా సుధానిలయం
ఈ లోకమే దివ్య ప్రేమమయం ॥అందాల॥
వలపేమో తెలియకా తెలవారు బ్రతుకేలా
తొలినాటి ప్రేమలూ కలయైన ఫలమైనా
తీయని గాయమై మిగిలినా అది నయం ॥తీయని॥ ॥అందాల॥
అందాల వెలుగులా అలరారు ఆనందం
అందించు సొగసులా ఆనందమున తేలే
తీయని అనుభవం దేవుని పరిచయం ॥తీయని॥ ॥అందాల॥

## అమ్మమాట

రచన: సి.నారాయణరెడ్డి  గానం: ఎల్.ఆర్.ఈశ్వరి

ప: మాయదారి సిన్నోడు - నా
మనసే లాగేసిండు - నా మనసే లాగేసిండు
లగ్గమెప్పుడురా మావా అంటె
మాగమాసం యెల్లేదాకా మంచిరోజు లేదన్నాడే
ఆగేదెట్టాగా? అందాకా ఏగేదెట్టాగా?
రత్తమ్మ! సెప్పవే అత్తమ్మ సెప్పవే!
కావమ్మ సెప్పవే! - రావమ్మ సెప్పవే!
ఆగేదెట్టాగా - అందాకా ఏగేదెట్టాగా
చ: సింతసెట్టెక్కి - సిగురులు కోస్తుంటే
సిట్టి సిట్టి గాజులూ - తాలం యేస్తుంటే
సిగురుల్లో - సిగురుల్లో - సిగురుల్లో మాటేసి కన్నుగీటిండే
సిత్రంగా పానాలు తోడేసిండే
లగ్గమెప్పుడురా మావా అంటే
సంకురాతిరి పొయ్యేదాకా మంచి గడియలేదన్నాడే
ఆగేదెట్టాగా? అందాకా ఏగేదెట్టాగా?
యెల్లమ్మ సెప్పవే! - మల్లమ్మ సెప్పవే!
పుల్లమ్మ సెప్పవే! - చెల్లెమ్మ సెప్పవే! ॥ఆగే॥
చ: ఊరి సెరువులో - నేనీదులాడుతుంటే
నీటి నురగల్లో - తేలి తేలి పోతుంటే
బుడుంగున - బుడుంగున - బుడుంగున మీదికి తేలిండే - నా
తడికొంగు పట్టుకొని లాగిండే
ఎప్పుడురా మావా అంటే
శివరాతిరి యెల్లేదాకా సుబలగ్గం లేదన్నాడే
ఆగేదెట్టాగా? అందాకా ఏగేదెట్టాగా?
పున్నమ్మ సెప్పవే! గున్నమ్మ సెప్పవే!
కన్నమ్మ సెప్పవే! సిన్నమ్మ సెప్పవే! ॥ఆగే॥
చ: కందిసేలల్లో కావలి కాసేసి
సందెకాడ ఒంటరిగా - డొంకదారి నొస్తుంటే
గబుక్కున - గబుక్కున
గబుక్కున - కళ్ళు రెండు మూసిండే లిప్పున వాటేసి నవ్వేసిండే
ఏందిరా మావా అంటే
కోడికూసి కూయంగానే తాళికడతానన్నాడే
ఆగేదెట్టాగా యీ రాతిరి యేగేదెట్టాగా?
అమ్మమ్మ సెప్పవే! అయ్యమ్మ సెప్పవే!
పెద్దమ్మ సెప్పవే! పిన్నమ్మ సెప్పవే! ॥ఆగే॥

# డిసీజ్ ఖర్మ... దట్సాల్...!

సత్యమూర్తి



గవర్నమెంటు నుండి పర్మిషన్ తెచ్చుకుని ఊళ్ళో అందర్నీ కూడగట్టుకుని శ్రమదానం చేయించుకుని సొంత డబ్బుకూడా వేసి ఇంటి ముందు మంచి రోడ్డు వేయించుకుంటారు.



వేసిన మర్నాటి నుండి వారానికొకరు చొప్పున టెలిఫోన్ వాళ్ళు, వ్రాటర్‌వర్క్స్ వాళ్ళు, డ్రయినేజీ కోసం మున్సిపాలిటీ వాళ్ళు తవ్వేస్తూ పాత రోడ్డు కన్నా అధ్వాన్నం చేసేస్తే....





మాంచి సీరియలొకటి ప్లాన్ చేసి బాగా సర్క్యులేషన్ ఉన్న పత్రిక ఎడిటర్ గారిని కష్టపడి ఒప్పించి వెంటనే మొదలయ్యేలా చూసుకుంటారు.





నాలుగు సంచికలు ప్రజల్లోకి వెళ్ళి గుర్తింపు వచ్చిన తరువాత పత్రిక ఆఫీసుకు వెళ్ళగా అప్పుడే ఛార్జి తీసుకున్న కొత్త ఎడిటర్ మీ సీరియల్ ఆపేయమని చెబితే....



ధారాపాతంగా పడుతున్న నీళ్ల కింద శిరఃస్నానం చేస్తే ఒంట్లోని నరాలన్నిటికీ మంచిదని తెలిసి - వెతికి వెతికి ఊరి చివర్న ఓ జలపాతాన్ని కనుక్కొని స్నానానికి ఉపక్రమిస్తారు.



సగం స్నానం అవుతుండగా - జలపాతం మొదలైన చోట రెగ్యులర్‌గా ఆడుకునే పిల్లలు సరదా కోసం వరసపెట్టి పైనుంచి రాళ్లను దొర్లిస్తూ ఉంటే...



# బాపు విశ్వరూపం 19

మనుష్యుల రూపురేఖలనే కాదు, వారి వ్యక్తిత్వాన్ని కూడా కొన్ని గీతల్లోనే దర్శింపచేయగల బాపుప్రజ్ఞ గురించి ఇదివరకే ముచ్చటించుకున్నాం. ఆ పని బ్రష్‌తో కాక పెన్‌తో చేసే సందర్భం వచ్చిందొకసారి.

కథలు రాసిన వాళ్లందరూ వ్యాసాలు రాయలేరు. రెండూ చేయగలిగిన వాళ్లు కూడా సంపాదకత్వం వహించగలరన్న గారంటీ లేదు. ఇవన్నీ రచనా వ్యాసంగానికి సంబంధించినవే అయినా ఈ కళలన్నీ వేటికవే. కథకుడిగా, సంపాదకుడిగా కూడా ఈ శీర్షికలో మనకు పరిచయమైన బాపు కుంచెతో వేసినంత హాయిగా కలం ఝుళిపించి తమ తల్లి గారి గురించి ఓ స్కెచ్ రాశారు...కాదు, కాదు.. మన కళ్లక్కట్టేటట్టు ఆవిడ జీవితచిత్రం గీశారు.

ఆంధ్రజ్యోతి వీక్లీ వారు 'అమ్మకు జేజే' అనే శీర్షిక మొదలుపెట్టి ప్రముఖులందరినీ వారి మాతృమూర్తి గురించి రాయమన్నారు. ప్రారంభం ముళ్లపూడి వెంకటరమణ గారితో! రెండవది బాపుగారు రాయాలి. రమణ గారి జీవితంలో ఎంతో డ్రామా ఉంది. 'రాగ్స్ టు రిచెస్' కథలు మనల్ని ఎప్పుడూ ఆకర్షిస్తాయి. రమణగారి తల్లి కొంతకాలం భోగభాగ్యాలనుభవించి హఠాత్తుగా భర్త పోవడంతో దారిద్ర్యం చుట్టుముట్టినా మొక్కవోని ధైర్యంతో పరిస్థితుల నెదుర్కొని బిడ్డలను సాకిన ధీరమహిళ. ఆవిడ కథను రమణగారి వంటి చేయి తిరిగిన రచయిత తన కథనంతో ఎంత రక్తి కట్టించివుంటారో ఆ 'లైఫ్ స్కెచ్' చదవనివారు కూడా ఊహించుకోవచ్చు.

బాపుగారి తల్లి వద్దకు వస్తే ఆవిడ ఉన్నత కుటుంబీకురాలు. జీవితంలో ఆటుపోట్లు పెద్దగా పడనవసరం లేకుండా పెద్ద సంసారాన్ని దక్షతతో నడుపుకు వచ్చినావిడ. పాఠకులకు ఉత్కంఠ కలిగించే నాటకీయత లేదు ఆవిడ జీవితంలో. రమణ గారి రచనకు తీసిపోకుండా పాఠకుల ఆసక్తి నిలిపేలా ఎలా రాయాలన్నది బాపుగారి ముందున్న ప్రశ్న. ఆ సందర్భంలో ఆయన ఎలా నెగ్గుకొచ్చారో మీరే చూడండి -

## ఉత్తమాయిల్లాలు - మా అమ్మ - బాపు

గడుసే తనగడు
చారన్నమే పరమాన్నం
లేక కాదు. సమస్తం పుష్కలంగా ఉంది.
తాను నిడుమోలు వారి ఆడపడుచు. సత్తిరాజు వారి
కోడలు. శరత్ సాహిత్యం అంటే ఎంతో ఇష్టం. కేటయో గానీ
మొష్టడిది. స్త్రీవాద చైతన్యం తెలిసినా - పక్కింటి కన్నా బాధ్యతలు
ఎక్కువ అని ఎత్తించిన ఇల్లాలు.
ఉత్తమాయిల్లాలు. ఉత్త మాయిల్లాలు.
మా అమ్మ. సూర్యకాంతమ్మ.

కన్నది అయిదుగురినే అయినా పెంచింది పదిమందిని. ప్రతినిత్యం ఆదరించి సేవించినది పాతికమందిని - అత్తగారూ మరియు ఆవిడ చెల్లెళ్లు ఆరుగురు పిన్నత్తగార్లూనూ - అస్తమానం వాళ్లకోసం వస్తూ పోతూండే వాళ్ల కొడుకులూ కోడళ్లూ స్నేహితులనూ కంటె కాసులపేరు వడ్డాణం లాటి నగలలా ధరించి భరించిన గృహలక్ష్మి.

"నీ తిండి నువ్వే హరాయించుకోవాలి. నీ కష్టాలు నువ్వే భరాయించుకోవాలి." అంటూ గోరంతదీపం సినిమాలో తండ్రిలా ఆవిడకు చిన్నప్పుడు ఏ పెద్దలూ హితోపదేశాలు చెయ్యలేదు, ఆవిడే నేర్చుకుంది.

ఊహ తెలిసీ తెలియని లేత వయసులో పదహారేళ్ల నరసాపురం అమ్మాయి భర్తతో అత్తగారితో చెన్నపట్నం వెళ్లింది. వేణుగోపాలరావుగారి ఇల్లాలుగా మైలాపూరులో స్థిరపడింది. 101, అప్పరసామి కోవెల వీధి యిల్లు నరసాపురం, కంతేరు, ఏలూరు కుటుంబాలకి రాజధాని అయిపోయింది! చదువులూ పెద్ద చదువులూ ఉద్యోగాలూ పెళ్లి సమ్మంధాలూ కొత్తకాపురాలు తిరుపతి యాత్రలు ఊటీ విహారాలు మెడ్రాస్ వైద్యాలు - ఇలా ఎవరికే పని వచ్చినా - మా నాన్నగారి సలహాలు మా అమ్మగారి సేవలు! అయిదుగురు పిల్లలూ ఏడుగురు అత్తగార్లూ వాళ్ల చుట్టాలూ కాకుండా కోర్టుపనుల మీద పల్లెటూళ్లనుండి వచ్చే క్లయింట్లు (మా నాన్నగారు లాయరు) మా యింటో వరండాలోనే బస! ఆ రోజుల్లో మెడ్రాసు తెలుగు లాయర్లందరికీ ఇదో ఆచారం. ఈ పల్లెటూరు అమాయకులు కోర్టులో కేసు గెలిస్తే మరి కనిపించేవారు కాదు. ఓడితే రైలు ఛార్జీలు అడిగి తీసుకుపోయేవారు. మా నాన్నగారు ఇచ్చేవారు! వీళ్లందరికీ మా అమ్మ కాఫీలూ భోజనాలూ - చేసి పెట్టేది.

మా నాన్నగారికి స్వల్పంగా ఆస్తమా వుండేది. డాక్టరు చుట్టం ఒకాయన ఆర్సనిక్ ఇంజక్షన్ రికమెండ్ చేశాడు. అది కాస్తా వికటించి ఆయన జబ్బుపడిపోయారు. ఆయన బాధను మేము దగ్గరగా చూట్టం ఇష్టం లేక - కోపం నెపంగా మమ్మల్ని దూరంగా అట్టేపెట్టేవారు. మా అమ్మకి అందరిలాగ పగలు పనిచేయడం, రాత్రి నిద్రపోవడం - తెల్లారగట్ల లేవడం - ఇలా వుండేది కాదు. నాన్నగారికి గంటగంటకీ మందులివ్వడం - ఆయన దగ్గి దగ్గి ఆయాసపడుతూంటే వీపు రాయడం..అందుకని గడప మీద తల పెట్టుకుని పడుకునేది - ఎప్పుడు లేవవలసివస్తుందో అని. ఖాళీ వున్నప్పుడు - ఒక్క కునుకు...

తెల్లవారగానే కాఫీలు - చద్దన్నాలు - స్కూలు వంటలు - కోర్టు వంటలు, అత్తగార్లకి ఇష్టవంటలు, సాయంత్రం చేగోడీ వంటి చిరుతిళ్లు - తిరుపతి భక్తులకు పులిహోర పొట్లాలూ - విలాస యాత్రికులకు చచ్చిన కాలేజీ (మ్యూజియం) బతికిన కాలేజీ (జూ), మూర్ మార్కెట్, లైట్ హవుసు, బీచి, సెకండ్ షో చూసి వచ్చిన వాళ్లకి లేటు వంటలూ - ఇలా అన్నిటికీ ఒక్క అమ్మ - రెండు కుంపట్లూనూ - అన్నాలకి పెద్దది కాఫీ టీ కూరా చారులకి చిన్న కుంపటి.

ఈ సత్తిరాజువారి సత్రంలో మా అమ్మకి పైన చెప్పిన సేవలు కాకుండా ప్రత్యేక బోనస్ రెండో కొడుకు బాపూ వాడి అల్లరీనూ. (జాతీయోద్యమం రోజులు కదా - అందుకని అటు మహాత్ముడి పేరూ - అటు మాతామహుడిపేరు కలిసొచ్చేలా ఈ ప్రబుద్ధుని బాపు అని పిలిచేవారు) మా అన్నయ్య తమ్ముడూ సాధువులు. మా అక్కయ్య సరే ఆడపిల్ల. మా చిన్నతమ్ముడు పసిబిడ్డ. అంచేత అల్లరీ రౌడీతనం నా బాధ్యతలై పోయాయి. మేడ వరండా కిటికీలోంచి వంగి కిందకి చూస్తూ, 'అమ్మా బెల్లమ్ముక్క ఇవ్వకపోతే దూకుతా' అని అరిచేవాడినట. ఆ భయంతో మా అమ్మ ఆ కిటికీకి నిలువెత్తు కటకటాలు పెట్టించింది. తన కోసం అడిగి చేయించుకున్న నగ యిదొక్కటే! నాకు కోపం వచ్చినప్పుడు ఆ కటకటాలకే తల కొట్టుకుని గోల చేస్తూంటే కిందకి తెచ్చి ఓ స్తంభానికి తాడు పోసి కట్టేసేది మా అమ్మ, 'నల్లకిష్టుడు, రోలు కేసి కట్టు' అనేది బామ్మ. తాడు తెగేదాకా లాగి బోర్లపడేవాణ్ణట.



వంటింటో బొగ్గులతో నేలంతా బొమ్మలు వేసేవాణ్ణిట. ఓ సారి మా నాన్నగారు బొమ్మలు చూసి వెధవా - ఏమిటీ పిచ్చిగీతలు అని కోపడ్డారు. నేను చెరిపేయబోతే - సర్లే వుణ్ణీ వుణ్ణీ - మసి - చూసుకో! అన్నారు. రోజూ ఆయనొచ్చేముందు ఆఫీసు కుర్చీలో కూచుని ఆయన కేసు పేపర్ల చివర ఖాళీలలో నేను బొమ్మలనుకొనే గీతలు గీసేవాడిని. అవన్నీ దాచి, వచ్చే స్నేహితులకూ, పాపం క్లయింట్లకి కూడా 'మా వాడు' అంటూ చూపించేవారు......

అమ్మగారి కథతో మొదలుపెట్టి నాన్నగారి సంగతులు కలిసిపోయాయి అనుకుంటున్నారా - అనుకోండి. నాన్న అమ్మా - బొమ్మాబొరుసూ. నాన్న కోపం వల్ల అమ్మప్రేమ రుచి తెలుస్తుంది. ఆ రుచి మరిగి రెచ్చిపోకుండా నాన్నకోపం కళ్లెం వేస్తుంది ప్రేమతో. రెండూ ప్రేమలే.

మా అమ్మ రమణగారిని - "నాకు ఇంతమంది కొడుకులున్నా రమణే నా పెద్దకొడుకు.' అంటుంది. 'సీతాకళ్యాణం' సినిమా లండన్ ఫిల్మ్ ఫెస్టివల్‌కి వెళ్లిన సందర్భంలో మొదటిమాటు విదేశీప్రయాణం చేయబోతూ అమ్మకాళ్లకి దణ్ణం పెడితే - 'నీక్కాస్త పేరేదేనా వస్తే అంతా రమణ చలవే - అతని వల్లే. అతనికి దణ్ణం పెట్టు.' అంది.

మా అమ్మ చల్లని చేతుల్లో పెరిగి పెద్దవాడైన మరిది మరో గొప్ప రచయిత - బుచ్చిబాబుగారు. ఓ సారి అమ్మని ఇంగ్లీషులో వేళాకోళం చేశాడు. 'మైడియర్ సిస్టరిన్లా! ఎప్పుడూ వండివార్చడం - వడ్డించడం - ఇంతేనా! ఈ అరవచాకిరీతో బొత్తిగా వంటింటి కుందేలయిపోతున్నావు....' అన్నాడు.

'ఎవరికోసం నాయనా - ఎవర్ని ఉద్ధరించడానికి చేస్తున్నాను? నా మొగుడికీ పిల్లలకీ చేసేది - చాకిరీ ఎలా అవుతుంది? నువ్వు మాత్రం ఆఫీసులో కూచుని రాయడం రాయడం రాయడం - ఇంతేగా - నేను వండడం వార్చడంలా - నేను వంటింటి కుందేలైతే నువ్వు ఆఫీసు కుందేలువి" అంది.

బుచ్చినాన్నగారు పకపకా నవ్వారు. ఆయన పసిపిల్లాడిలా చాలా హాయిగా నవ్వుతారు. "నిజమే వదినోయ్. నాకు రేడియోలో రాయడం వాగడం వచ్చుగానీ వండడం రాదు"

"నాకు వాగడం కూడా వచ్చు"

"అయితే మా రేడియోలో మాట్లాడతావా? టాక్ ఇప్పిస్తాను"

"మహరాజులా" అంది మా అమ్మ.

అప్పుడు మా యింటి మహరాజు మహరాణీ కూర్చుని రేడియో ప్రసంగాలు రాసేవారు. ఓ రోజు మా అక్కయ్య పెళ్లి సమ్మంధం కోసం ఎవరో వస్తే 'కూచోండి - మా అమ్మ రేడియోటాక్‌కి వెళ్లింది. ఇపుడే వస్తుంది.' అని గర్వంగా చెప్పాం.

బుచ్చిబాబుగారి భార్య శివరాజు సుబ్బలక్ష్మి గారు నాకు మరో అమ్మ. పి.జి.వుడ్‌హౌస్ రచనలు పరిచయం చేసినది ఆవిడే.

నేను గర్వంగా చెప్పుకునే బంధువులు మరొకరు - మా అమ్మ తమ్ముడు నిడుమోలు జగన్నాథ్ గారు (ఒకప్పుడు తారుమారు, భలేపెళ్లి 2ఇన్ 1 సినిమా తీశారు) వారి శ్రీమతి కళ్యాణసుందరీ జగన్నాథ్. జగన్నాథం మావయ్యగారు ఆ రోజుల్లో కులాంతర వివాహం చేసుకుని పెద్ద సెన్సేషన్ క్రియేట్ చేశారు. ఆయన తను నమ్ముకున్న దానిముందు ఎవ్వరికీ - దేనికీ తలొంచేవారు కాదు.

మా అమ్మకీ కులం మతం పట్టింపులు అసలు లేవు. నేను - 'అమ్మాయి పెళ్లికి ఆర్భాటంగా ఆహ్వానపత్రికలూ పందిళ్లూ వేసి అనవసరపు ఖర్చు పెట్టదలచుకోలేదు. ఆ అయే డబ్బు వధూవరుల కివ్వదలచుకున్నాను.' అంటే ఆవిడ - వెంటనే ఒప్పుకుంది. 'అసలు వాళ్లు మీరు. మీరు సంతోషంగా వుండాలి అదీ ముఖ్యం' అంది. మనుమరాలు కులాంతర వివాహం చేసుకుంటానంటే మనసారా ఆశీర్వదించింది. కలసి వుండేదీ కాపురం చేసేదీ భార్యాభర్తలు కానీ మనం కాదు - అంది.

నా కాలేజీ రోజుల్లో మా క్లాసుమేటు ఒకతన్ని భోయినానికి పిలిచాను.అప్పుడు డైనింగు హాల్సూ టేబిల్సూ లేవు. వంటింట్లోనే పీటలూ కంచాలూ.

నాకు నేను రోజూ తినే కంచంలోనూ - మా ఫ్రెండుకి విస్తరాకులోనూ వడ్డించింది మా అమ్మ. అతనిది వేరే కులం. రోషం వచ్చింది. 'తిన్న తరవాత ఇస్తరి నేనే ఎత్తెయ్యాలాండీ' అన్నాడు. మా అమ్మ "నాయనా. నీకూ కంచం పెడితే ఇంకోళ్లు తినే ఎంగిలి పళ్లెం అనుకుంటావని శుభ్రంగా ఇస్తరేశాను. అంతేకానీ - అలాటి పట్టింపులుంటే నీకు వంటింట్లో పీట వేస్తానా?' అంది.



జీవనయాత్ర మధ్యలోనే మా నాన్నగారు పడవ దిగి ఆగిపోయినా మా అమ్మ మా అందరి కోసం ముందుకు సాగుతూనే వుంది. కొడుకులూ కూతుళ్లూ కోడళ్లూ మనమలూ మునిమనమలూ పెళ్లిళ్లూ పురుళ్లూ బారసాలలూ నామకరణాలూ చదువులూ పెళ్లిళ్లూ పురుళ్లూ బారసాలలూ....

**బాపుగారి ఫ్లో చూడండి.**

**చదువులూ..పెద్ద చదువులూ. పేరాలోనూ, చివరి పేరాలోనూ కళ్లముందు బొమ్మ కట్టేశారు. మహరాజు వద్ద లింకు చేయడం, పల్లెటూరి అమాయకులు వద్ద వ్యంగ్యం, మాట్లాడినట్లే- 'భోయినం', 'ఆ అయే ఖర్చు' రాసుకుపోవడం ఇవన్నీ గమనార్హం. ఆ తరం వాళ్లలో కులం పట్టింపులు లేకపోవడాన్ని పెద్ద విశేషంగా హైలైటు చేయకుండానే మేటరాఫ్ ఫాక్ట్‌లీ గా రాయడం బాపుగారి సంస్కారానికి నిదర్శనం. అ సంస్కారం ఎలా అబ్బిందో ఈ అక్షరచిత్రం ద్వారా పరిచయమయ్యే ఆయన తల్లి కథ తెలియబరుస్తుంది.** ■

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | తెలుగు | తమిళం |
|---|---|---|
| చిత్రం | : అంతులేని కథ | అవళ్ ఒరు తొడర్ కదై |
| రచన | : ఆచార్య ఆత్రేయ | కణ్ణదాసన్ |
| సంగీతం | : ఎమ్.ఎస్.విశ్వనాథన్ | ఎమ్.ఎస్.విశ్వనాథన్ |
| గానం | : కె.జె.ఏసుదాస్ | కె.జె.ఏసుదాస్ |










దెయ్‌వమ్ తన్‌ద వీడు వీదియిరుక్కు
ఇన్‌ద ఊరెన్‌న సొన్‌ద వీడెన్‌న జ్ఞానప్‌పెణ్‌ణే
వాళ్‌విన్ పొరుళెన్‌న నీవన్‌దక్‌కదై యెన్‌న
వాళ్‌విన్ పొరుళెన్‌న నీవన్‌దక్‌కదై యెన్‌న ॥దైవమ్॥

నాన్ కేట్‌టుత్‌తాయ్ తన్‌దై పడై త్‌తారా - ఇల్‌లై
ఎన్ పిళ్‌ళై ఎన్నైక్‌కేట్టు పిఱన్‌దానా?
దెయ్‌వమ్ శెయ్‌ద పావమ్ ఇదు పోడి తంగచ్‌చి
కొన్‌ఱాల్ పావమ్ తిన్‌ఱాల్ పోచ్‌చి
ఇదుదాన్ ఎన్ కట్‌చి
అది వీడు అన్‌దమ్ కాడు
ఇదిల్ నానెన్‌న - అడియే నీ ఎన్‌న జ్ఞానప్‌పెణ్‌ణే
వాళ్‌విన్ పొరుళెన్‌న నీవన్‌దక్‌కదై యెన్‌న ॥దైవమ్॥

వెఱుమ్ కోయిల్ ఇదిలెన్‌న అబిషేగమ్ - ఉన్
మనమెంగుమ్ తెరుక్‌కూత్‌తు పగల్ వేషమ్
కళ్‌ళిక్‌కెన్‌న ముళ్‌ళిల్ వేలి పోడి తంగచ్‌చి
కాట్‌టుక్‌కేదు తోట్‌టక్‌కారన్ -
ఇదుదాన్ ఎన్ కట్‌చి
కొన్‌డదెన్‌న కొడుప్‌ప దెన్‌న - ఇదిల్
తాయెన్‌న మణన్‌ద తారమెన్‌న జ్ఞానప్‌పెణ్‌ణే
వాళ్‌విన్ పొరుళెన్‌న నీ వన్‌దక్‌కదై యెన్‌న ॥దైవమ్॥

తెళివాగత్‌తెరిన్‌దాలే సిద్‌దాంతమ్ - అదు
తెరియామల్ పోనాలే వేదాన్‌తమ్
మణ్‌ణైత్‌తోన్‌డిత్ తణ్‌ణీర్ తేడు అన్‌బుత్‌తంగచ్చి
ఎన్‌నైత్‌తోన్‌డి జ్ఞానమ్ కన్‌డేన్-
ఇదుదాన్ ఎన్ కట్‌చి
ఉణ్‌మై ఎన్‌న పొయ్‌మై ఎన్‌న - ఇదిల్
తేనెన్‌న - కడిక్కుమ్ తేళ్ ఎన్‌న జ్ఞానప్‌పెణ్‌ణే
వాళ్‌విన్ పొరుళెన్‌న నీ వన్‌ద కదైయెన్‌న ॥దైవమ్॥

'అవళ్ ఒరు తొడర్ కదై' (ఆమె ఒక ధారావాహిక) తమిళ చిత్రం 1974లో విడుదల యింది. కథానాయిక కథ 'సీరియల్'లాగా సాగిపోతూనే ఉంటుందని చిత్రానికి ఆ పేరు పెట్టారు దర్శకులు కె.బాలచందర్. సుజాతను నాయికగా పరిచయం చేసిన ఈ చిత్రాన్ని 1977లో జయప్రద నాయికగా 'అంతులేని కథ'గా తెలుగులో నిర్మించారు. చిత్రంలో - నాయికకు విచిత్రమైన అన్నయ్య ఒకరున్నారు. తమిళంలో జయగణేష్ పోషించిన ఆ పాత్రను తెలుగులో రజనీకాంత్ ధరించారు.

ఈ అన్నయ్య పాత్ర స్వభావాన్ని వివరించే పాట ఒకటి చిత్రంలో ఉంది. తమిళ చిత్రంలోని పాటను కణ్ణదాసన్ రాశారు. తెలుగు పాట రాసినవారు ఆచార్య ఆత్రేయ.

తమిళ చిత్ర గీతం భావం:

దైవం ఇచ్చిన ఇల్లు వీధి ఉంది
ఈ ఊరేమిటి సొంత ఇల్లేమిటి జ్ఞాన బాలికా
జీవితపు అర్థమేమిటి నీవు వచ్చిన కథ ఏమిటి
నేను కోరగా తల్లీ తండ్రీ (నన్ను) సృష్టించారా - లేదా
నా బిడ్డ నన్నడిగి పుట్టాడా?
దైవం చేసిన పాపం ఇది పోవే చెల్లెలా
చంపితే పాపం (చంపిన పాపం) తింటే పోతుంది
ఇదే నా పక్షం (ఇదే నా అభిప్రాయం)
ఆది ఇల్లు, అంతం కాడు
ఇందులో నేనేమిటీ ఓసీ నీ వేమిటీ జ్ఞాన బాలికా
జీవితపు అర్థమేమిటి నీవు వచ్చిన కథ ఏమిటి?
ఒట్టి గుడి - ఇందులో ఎందుకు అభిషేకం - నీ
మనసంతా వీధినాటకం పగటి వేషం
జెముడు కెందుకు ముళ్లకంచె పోవే చెల్లెలా
అడవికుంటాడా తోటమాలి
ఇదే నా పక్షం
ఉన్నదేదీ ఇచ్చేది ఏది ఇందులో
తల్లి ఏమిటి పెళ్లాడిన భార్య ఏమిటి జ్ఞాన బాలికా
జీవితపు అర్థమేమిటి నీవు వచ్చిన కథ ఏమిటి
తేట తెల్లంగా తెలిస్తే సిద్ధాంతం - అది
తెలియకుండా ఉంటే వేదాంతం
మట్టిని తోడి నీటిని వెదకు ప్రియమైన చెల్లెలా
నన్ను తోడి (తరచి) జ్ఞానం కనుగొన్నాను

**ఇదే నా పక్షం**
**సత్యమేమిటి అసత్యమేమిటి - ఇందులో**
**తేనె ఏమిటి కరిచే తేలు ఏమిటి జ్ఞాన బాలికా**
**జీవితపు అర్థమేమిటి నీవు వచ్చిన కథ ఏమిటి?**

'అవళ్ ఒరు తొడర్ కదై' చిత్రం విజయానికి ఆ చిత్రంలోని పాటలూ కారణాలే. కణ్ణదాసన్ రాసిన పాటలకు ఎం.ఎస్.విశ్వనాథన్ సంగీతం సమకూర్చారు. తమిళ చలన చిత్ర నేపథ్య సంగీత చరిత్రలో అది- ఏసుదాస్ యుగం. (తబలా విద్వాంసులు ఒకరి గురించి ఏసుదాస్‌కు ఆ తర్వాత పేచీ వచ్చేదాకా- విశ్వనాథన్ సంగీత సారథ్యంలో ఏసుదాస్ తమిళ చిత్రాల కోసం ఎన్నో పాటలు పాడారు).

'అవళ్ ఒరు తొడర్ కదై' లో నటించిన వారందరికీ ఎంతో గుర్తింపు వచ్చింది.

'దైవమ్ తన్‌ద వీడు వీది ఇరుక్కు' పాట విశేష ప్రజాదరణ పొందినది. నాయిక కుటుంబం పెద్దది. పాత రోజులలో చిత్రాలలో కథానాయికకు ఉండే కష్టాలన్నీ ఈ నాయికకూ ఉన్నాయి. కుటుంబ భారాన్ని అంతటినీ ఆమె మోస్తుంటుంది. ఆమె మీద ఆధారపడి బతుకుతున్న ఆ కుటుంబం ఆమెను మనసుగల మనిషిగా కాక నియంతగా చూస్తుంటారు. ఆమె విలువ తెలిసిన అన్నయ్య కూడా ఆమెను బాధించేవాడే. చెల్లెలిని 'జ్ఞానప్పెణ్' (జ్ఞాన బాలిక లేదా జ్ఞాని అయిన స్త్రీ) అని పిలవడం ద్వారా ఆ అన్నయ్య చెల్లెలి గొప్పతనాన్ని గుర్తిస్తున్న సంగతి స్పష్టమవుతుంది. రెండుసార్లు 'తంగచ్చి' (చెల్లెలు) అనీ ఒకసారి 'అన్బుత్తంగచ్చి' (ప్రియమైన చెల్లెలు) అని పిలుస్తాడు. తన 'కట్చి' (పక్షం లేదా అభిప్రాయం) ఏమిటో చెబుతున్నాడు. వేదాంతసారం వల్లిస్తున్నాడు. తన పుట్టుకకు తాను కారకుడు కాడట. తన బిడ్డ తనకు చెప్పి పుట్టలేదట. అది దేవుడి దోషమట. చంపిన పాపం తింటే పోతుందట. దైవం లేని ఒట్టి గుడికి అభిషేకం అవసరం లేదు. మనసు పగటి వేషాలు వేస్తున్నది. ముళ్లచెట్టుకి కంచె అనవసరం. అడవికి తోటమాలి అనవసరం. తల్లి ఎవరు? భార్య ఎవరు? తెచ్చుకొందేమిటి? ఇచ్చేదేమిటి? తెలిస్తే సిద్ధాంతం. తెలియకపోతే వేదాంతం. మట్టిని తవ్వి నీళ్లను వెదకాలి. తాను - తననే తరచి జ్ఞానం సంపాదించుకొన్నాడట. తన దృష్టిలో సత్యమనీ అసత్యమనీ తేడాలేదు. తీయని తేనె అయినా కరిచే తేలయినా తనకు ఒకటేనట.

ఇంతటి వేదాంతి కాబట్టే తనకు ఊరంటూ సొంత ఇల్లంటూ అవసరం లేదు. తనకు వీధి అనే ఇల్లు ఉండనే ఉంది. అదే తనకు దేవుడిచ్చిన ఇల్లు.

ఈ (మెట్ట?) వేదాంతమంతా తెలుగు పాటలో ఎలా వ్యక్తమైంది?

తమిళ గీతంలో చెల్లెలిని 'జ్ఞానప్పెణ్' అనడంలోనే ఆ అన్నయ్యకు ఆ చెల్లెలి విలువ తెలుసుననే ధ్వని ఉంది. తెలుగు పాటలో 'ఏల యీ స్వార్థం?' అని అడగడం వల్ల చెల్లెలి గురించి అన్నయ్య అవగాహనలో తేడా కనిపిస్తున్నది. అయితే ఆ తేడాను మరపించేది తెలుగు పాటలోని 'కళ్లు లేని కబోది చే దీపం నీవమ్మా' అనే పంక్తి. చూపు లేని వారికి దీపం విలువ తెలియనట్టే నాయిక కుటుంబం వారికి ఆమె విలువ తెలియడం లేదని సూచన.

తమిళ గీతం పల్లవి 'దేవుడు ఇచ్చిన ఇల్లయిన వీధి ఉంది' (వీధినే దేవుడు ఇల్లుగా ఇచ్చాడు) అని ఉన్న భావం తెలుగులో పూర్తిగా రాలేదు. 'దేవుడే ఇచ్చాడు వీధి ఒకటి' అనడంలో 'ఇల్లు లేకపోయినా వీధే ఇల్లయింది' అనే తమిళ గీతంలోని భావం రాలేదు. తమిళ గీతంలో 'దేవుడు చేసిన పాపం' అని ఉన్న భావం కన్నా తెలుగు పాటలోని 'పాపం పుణ్యం నాది కాదే' అనే భావం 'నారు పోసి నీరు పోసే నాథుడు వాడమ్మా' అనే భావం వేరుగా ఉన్నాయి. 'శిలలేని గుడికేల నైవేద్యం - ఈ కలలోని సిరికేల ఈ సంబరం' అనే పంక్తులు తమిళ గీతంలో కనిపించవు. తనను తరచి తాను జ్ఞానం పొందానని తమిళ చిత్రపు అన్నయ్య చెబుతుండగా తెలుగు చిత్రపు అన్నయ్య 'నిన్ను నువ్వే తెలుసుకుంటే చాలును పోవమ్మా' అంటున్నాడు. తమిళగీతంలో మమకారం ప్రస్తావనా అహంకారం ప్రస్తావనా లేవు. కాగా మొత్తం మీద తెలుగు పాట తమిళగీతంలోని భావజాలాన్ని ప్రతిబింబించినట్టు కనిపించదు. తెలుగు పాట పల్లవి దగ్గరే మొదలయిన తేడా దాదాపు పాట చివరిదాకా సాగినట్టు కనిపిస్తుంది. తమిళ గీతం బాణీలోనే తెలుగు పాట కూడా సాగింది. తమిళ చిత్రపు పాట బాణీ తెలుగు పాటకు బరువైనట్టు అనిపిస్తుంది.

(వచ్చే సంచికలో 'అంతులేని కథ' చిత్రం లోని 'తాళికట్టు శుభవేళ' పాట ముచ్చట్లు).

**- పి.ఎస్.గోపాలకృష్ణ**

**దేవుడే యిచ్చాడు వీధి ఒకటి**
**ఇక ఊరేల సొంత యిల్లేల ఓ చెల్లెలా**
**ఏల యీ స్వార్థం ఏది పరమార్థం**
**నన్నడిగి తలిదండ్రి కన్నారా - నా**
**పిల్లలే నన్నడిగి పుట్టారా**
**పాపం పుణ్యం నాది కాదే పోవే పిచ్చమ్మా**
**నారుపోసి నీరుపోసే నాథుడు వాడమ్మా**
**ఏది నీది - ఏది నాది**
**ఈ భేదాలు ఉత్త వాదాలె ఓ చెల్లెలా**
**ఏల యీ స్వార్థం ఏది పరమార్థం**
**శిలలేని గుడికేల నైవేద్యం - ఈ**
**కలలోని సిరికేల ఈ సంబరం**
**ముళ్ళ చెట్టుకు చుట్టూ కంచె యెందుకు పిచ్చమ్మా**
**కళ్ళులేని కబోది చేదీపం నీవమ్మా**
**తొలుత యిల్లు తుదకు మన్ను**
**ఈ బ్రతుకెంత దాని విలువెంత ఓ చెల్లెలా**
**ఏల యీ స్వార్థం ఏది పరమార్థం**
**తెలిసేట్లు చెప్పేది సిద్ధాంతం - అది**
**తెలియకపోతేనే వేదాంతం**
**మన్నులోన మాణిక్యాన్ని వెతికే వెర్రెమ్మా**
**నిన్ను నువ్వే తెలుసుకుంటే చాలును పోవమ్మా**
**ఏది సత్యం - ఏది నిత్యం**
**ఈ మమకారం వట్టి అహంకారం ఓ చెల్లెలా**
**ఏల యీ స్వార్థం ఏది పరమార్థం...**

'దేవుడే ఇచ్చాడు వీధి ఒకటి' పాట పాఠం ఇది:



## హ్యూమర్ బాక్స్



మొదటి రాత్రి వధువుతో వరుడు : ఇవాళ నుండి నువ్వే నా ప్రేరణ, నువ్వే నా సాధన, నువ్వే నా ఆశ

వధువు (ముందర గతుక్కుమని.. తర్వాత జవాబివ్వకపోతే ఏమనుకుంటాడోనని ఫీలవుతూ) : ఇవాళ నుండి నువ్వే నా ఎన్.టి.ఆర్, నువ్వే నా ఉదయ్‌కిరణ్, నువ్వే నా తరుణ్.



ఒకాయన ఓ హోటల్ కొచ్చాడు. సప్లయ్ చేయాల్సిన సర్వర్ అది గమనించకుండా తన కాలును ఐదారు నిమిషాల వరకూ గోక్కుంటూనే ఉన్నాడు. దాంతో ఆ వచ్చినాయన "దురదగాని ఉందా?" అని అడిగాడు సానుభూతిగా.

సర్వరు "మెనూ లో చూసుకోండి సార్ అందులో ఉంటే తెస్తా" అన్నాడు చిరాగ్గా పరపరమని గోక్కుంటూ.



జడ్జి : నీకు ఇద్దరు భార్యలు ఉన్నట్టు ఋజువు కానందున నిన్ను విడుదల చేస్తున్నాం. ఇక ఇంటికి వెళ్లవచ్చు.

ముద్దాయి : ఏ భార్య ఇంటికి సార్ !?



పెళ్లయి అత్తవారింటికి వెళ్తున్న అమ్మాయి వాళ్ల అమ్మను వాటేసుకుని ఏడుస్తోంది.

తల్లి : అలా ఏడవకూడదమ్మా ! నవ్వుతూ ఆనందంగా వెళ్లాలి! నేను కూడా ఒకప్పుడు ఇలాగే మా అమ్మా, నాన్నని వదిలి మీ నాన్నతో వచ్చాను తల్లీ

కూతురు : (వెక్కిళ్లతో) నువ్వైతే డాడితో వచ్చావు! కానీ నేను... అసలు ముక్కూ మొహం తెలియని అబ్బాయితో వెలుతున్నాను కదా!



"నీకు తెలుసా సీత రాముడితో వనవాసానికి ఎందుకు వెళ్లిందో?"

1వ ఆమె : తెలుసు. ఎందుకంటే ఆమె రాముణ్ణి విడిచి ఉండలేదు కనుక...

2వ ఆమె : అదేం కాదు. అయోధ్యలో ఉండి ముగ్గురు అత్తగార్లతో వేగేకంటే అడవే మేలని వెళ్లింది.





ఇద్దరు స్నేహితులు బోటుషైర్ చేస్తున్నారు. మధ్య మధ్య బోటు బాగా కదిలి పోతోంది. ఒకడు "బోటు మునిగిపోతుందేమోరా!?" అన్నాడు భయంగా.

రెండవతను "బోలెడు అద్దె డబ్బులు గుంజాడు. మునిగిపోతే మునిగిపోనీ... అప్పటికి గానీ ఎదుటివాళ్ల దగ్గర అన్యాయంగా డబ్బులు తీసుకోకూడదని తెలిసిరాదు వెధవకి" అన్నాడు కసిగా నవ్వుకుంటూ

**ఈ జోకులను పంపినవారు: జి.బి.లక్ష్మి, హైదరాబాద్.**

"ఇంటికి దీపం ఇల్లాలని పెళ్లి చేసుకున్నావు... ఎలా వుంది?"

"ఇల్లు కాలిపోతోంది"





ఎస్.ఐ : ఏరా ఒకప్పుడు కనిపించిన ప్రతివాడినీ దోచుకునేవాడివి ఇప్పటికైనా మారావా లేదా?

దొంగ : చాలా మారాన్సార్ ఇప్పుడు దేవుణ్ణే నమ్ముకున్నాను.

ఎస్.ఐ: అంటే.... భక్తి మార్గంలో పడ్డావన్నమాట... గుడ్..

దొంగ : లేద్సార్... గుళ్లు మాత్రమే దోచుకుంటున్నాను

**ఈ జోకులను పంపిన వారు ఎం.శిరీష, చిత్తూరు.**



"ఏవే సరోజా... నిన్ను చూడ్డానికి వచ్చిన పెళ్లికొడుక్కి తెగ నచ్చేసావట కదా?" అడిగింది అనంతలక్ష్మి

"అవునే... ఓరల్ ఓకేట ప్రాక్టికల్స్ అయ్యాక రిజల్ట్ కన్ఫర్మ్ చేస్తానన్నాడు" అంది - కాంపిటీటివ్ ఎగ్జామ్స్‌కి ఎక్కువగా వెళ్లే అలవాటున్న సరోజ.



"మనిషికి జ్ఞాపక శక్తి లేనప్పుడు అతని బ్రతుకు వృధా అంటూ కన్నీళ్లు పెట్టుకుంటూ, తగిన మందిమ్మంటూ మిమ్మల్ని కాళ్లా వేళ్లా పడి బ్రతిమాలుకుంటున్న ఆ వ్యక్తి ఎవరు డాక్టర్ !?"

"ఓ వడ్డీ వ్యాపారిలే..ఊరంతా అప్పులు తీసుకునేది అతని దగ్గిరే..."



"అందం అనేది జన్మనిచ్చిన తల్లిదండ్రుల బట్టి వుంటుంది"

"అలాగా... మరి నువ్వింత అందంగా పుట్టడానికి మీ అమ్మ నాన్నలని ఎలా సెలెక్ట్ చేసుకున్నావో చెప్పవూ !?"



"అవు... అంబోతు తెలుసుగానీ... మధ్యలో ఈ 'ఎద్దు' అంటే ఏంటి? చెప్పగలవా?"

"పాలు... పెరుగు తెలుసుకదా నీకు..? మరి జున్ను సంగతేంటి... అలాగే అనుకో"



ఆత్రం ఎక్కువ ఉన్న విజయ్, ఉద్యోగం కోసం ఇంటర్వ్యూకి వెళ్తూ "ఇక మీ పన్లో మీరుండండి నాన్నా" అని అన్నాడు తండ్రితో.

"అంటే అర్థం ఏమిటి బాబూ!?" అడిగాడు తండ్రి బుర్రగోక్కుంటూ

"అదే నాన్నా... నాకు పెళ్లి సంబంధాలు చూసే విషయం" అన్నాడా పుత్రరత్నం భవిష్యత్తుని తల్చుకుని తల్చుకుని మురిసిపోతూ



"ఏరా రాము! స్కూల్నించి వచ్చి హోం వర్క్ చూసుకోకుండా... ఏమిటి ఈ ఆటలు?" అడిగింది ఓ తల్లి తన కొడుకుని

"ఇదీ హోం వర్కేనమ్మా... మా డ్రిల్లు మాస్టారిచ్చారు" అంటూ ఆడుకోవడానికి మళ్లీ పరిగెత్తాడా కుర్రాడు.

**ఈ జోకులను పంపినవారు: లకనం మూర్తి, కాకినాడ.**

"నాకు పాతికేళ్లు వచ్చేటంత వరకూ వివాహం చేసుకో దల్చుకోలేదే".

"అది సరే! మరి... నీకు ఆ పాతికేళ్లు ఎప్పుడొస్తాయి?"

"అదేమిటి? అలా అడుగుతున్నావ్?"

"నువ్వు వివాహం చేసుకునేటంత వరకు నీకు ఆ పాతికేళ్లు రావుగా..."





"అరేయ్! నేను నీరులేని నదులు.. మట్టిలేని నేల.. జనం లేని నగరాలు చూసాను తెలుసా?"

"అరె! ఎక్కడ...?"

"ఇండియా మ్యాప్‌లో...."

"ఎక్కడికిరా...అలా సుత్తీ, మేకూ తీసుకుని వెళుతున్నావు"

"సముద్రం ఒడ్డుకి"

"ఎందుకూ!?"

"ఇంట్లో చిల్లిగవ్వకూడా లేదంది మా ఆవిడ. అందుకని ఏదైనా ఓ గవ్వ సంపాదించి దానికి చిల్లి పెట్టి ఇద్దామని..."



**ఈ జోకులను పంపినవారు డి.వి.యస్.బాబు, తెనాలి.**

సుమధుర స్వర సరస్వతి



# లతా మంగేష్కర్



ప్రఖ్యాత నేపథ్య గాయకుడు,

బహుభాషా కోవిదుడు, కవి, రచయిత

'కళైమామణి', 'గానకళా సార్వభౌమ' బిరుదాంకితులు

**డా॥ పి.బి.శ్రీనివాస్**

'కోసం' పాఠకుల కోసం

తన అభిమాన గాయని జీవిత చరిత్రను

అక్షరబద్ధం చేస్తున్న సీరియల్ ఇది

లతాకు తొలిదినాలలో అందరూ ప్రోత్సహించేవారే దొరికారని అనుకోకూడదు. తమ తమ వికారాలతో ఆమెను ఇబ్బంది పెట్టినవారూ ఉన్నారు.

మహమ్మద్ రఫీ తన యుగంలో రాజ్య మేలినట్లే ఆయనకు ముందు యుగంలో మకుటం లేని మహారాజ గాయకుడిగా పరిగణింపబడిన గాయక శిఖామణి - జి.ఎమ్.దుర్రానీ. ఆయన పాటల్లో రఫీ కోరస్ పాడిన సందర్భాలున్నాయి. 'హం సబ్ చోర్ హై' (1956 )నాటికి రఫీ లీడ్ సింగర్ అయిపోయారు. 'హంకో హస్‌తే దేఖ్ జమానా జల్‌తా హై' అనే పాట పాడేటప్పుడు దుర్రానీ ఆయనకు సహగాయకుడు. అదే ఆయన ఆఖరిపాట కూడా.

స్వభావరీత్యా రఫీకి దుర్రానీ పూర్తిగా వ్యతిరేకి. ప్రతిభకు మించిన గర్వం, అహంకారం. సుపీరియారిటీ కాంప్లెక్సు, కాంతల పట్ల దురాసక్తి కూడా ఉన్నాయని ఆయన్నెఱిగిన వారికందరికీ అనిపించే విధాన వ్యవహరించేవాడు. ఆ రోజుల్లో దుర్రానీది తారస్థాయి. అంటే స్టార్ స్టేటస్. చాలా ఆడంబరంగా వస్త్రధారణ చేసేవాడు. నౌషాద్ సంగీతంలో "చాంద్‌నీరాత్" సినిమాకి దుర్రానీ లతతో డ్యూయట్ పాడవలసివుంది. "హై ఛోరేకీ జాత్ బడీ బేవఫా" అనేది మొదటివాక్యం.

అప్పట్లో రికార్డింగుల్లో రెండే మైకులుండేవి. ఆర్కెస్ట్రా అంతటికీ ఒకటి. పాడేవారికి ఇంకోటి. దుర్రానీ, లతా ఎదురెదురు నిలిచి ఒకే మైకులో పాడవలసిన పరిస్థితి. మొదటివాక్యం పాడగానే దుర్రానీ వెఱ్ఱిమొఱ్ఱి చేష్టలు జుగుప్సాకరంగా వుండేసరికి లతాకు కోపం వచ్చింది. కానీ ఎలాగో సమాళించుకుంది. మరో రికార్డింగునాడు లతా ధరించిన దుస్తులను హేళన చేస్తూ, "మంచి రంగురంగుల డ్రెస్ వేసుకోకుండా, ఇల్లా తెల్లటి దుప్పటి చుట్టుకువచ్చావేమిటి?" అని దుర్రానీ అడిగేడు. అదీ ఏకవచనంలో సంబోధిస్తూ.

ఉర్దూ సంస్కృతిని బాగా యెఱిగిన దుర్రానీ 'మీరు' అనకుండా 'నీవు' అనడం లతా ఆత్మాభిమానాన్ని బాధించింది. పాటగురించి మాట్లాడితే ఫర్వాలేదు కానీ దుస్తుల గురించి అక్కఱ ఎందుకు? అనుకుంది. తనను



రఫీకి ముందు తరం గాయకుడు దుర్రానీ -తలత్, రఫీలతో. లతా ఈయనతో పాడడానికి నిరాకరించింది.

కూతురుగా సంభావించే నౌషాద్ దగ్గరకు వెళ్లి జరిగినది చెప్పి, 'ఈ దురహంకారితో కలిసి నేను పనిచేయ దలచుకోలేదు. నా వల్లకాదు." అని మొత్తుకుంది.

దానికి నౌషాద్ "అమ్మాయీ, నువ్విప్పు డిప్పుడే పైకి వస్తున్న ఆర్టిస్టువి. ప్రపంచంలో చాలామంది ధోరణి ఇటువంటిదే. ఇవన్నీ మనం లెక్కచేయకూడదు. అతని లాటి స్టార్ సింగర్ పట్ల ఇలా తీర్మానించుకుంటే నష్టం నీకే. నువ్వు టాప్ సింగర్ అయేక ఎలాంటి నిర్ణయం తీసుకున్నా ఫరవాలేదు. అప్పటిదాకా ఇటువంటివి పట్టించుకోకుండా ముందుకు సాగు." అని హితవు చెప్పారు.

ఒకపక్క ఆయన సలహా వినాలని వున్నా దుర్రానీ దుష్ప్రవర్తనని విస్మరించలేక "నన్ను మన్నించండి. అతనితో పాడడం నా తరం కాదు."అని ఆమె నిష్కర్షగా చెప్పడంతో "సరే నీ యిష్టం" అని వూరుకున్నారు నౌషాద్. లతా ఆ రికార్డింగులో పాడకుండా నేరుగా ఇంటి కెళ్లిపోయింది.

నౌషాద్ మళ్లీ తనని మఱోపాటకై పిలుస్తారో లేదో అన్న తలపే ఆమెకు కలగలేదు. ఆత్మాభిమానం దెబ్బతిన్నచోట అరక్షణం కూడా నిలవడం కూడా ఆమెకు దుర్భరంగా తోచింది. ఇంటికెళ్లి తలుపులు బిడాయించుకుని కూచుంది. కుటుంబసభ్యులకు కూడా చెప్పలేదు. తనది చాలా విచిత్రమైన స్వభావం. ఇలాటి విషయాల్లో సర్దుకుపోలేని స్వభావం. దీని వల్ల భవిష్యత్తులో ఇంకా ఎలాటి సన్నివేశాలు ఎదుర్కోవలసివస్తుందో, దాని వల్ల తనూ, కుటుంబసభ్యులూ ఎలాటి ఇబ్బందుల నెదుర్కోవలసివస్తుందోననిమాత్రం ఆమె ఒకింత కలవరపడింది.

ఆ తరవాత, లతాకి ఇతరగీతాలు పాడే అవకాశాలు కొన్ని వస్తూనే వున్నా దుర్రానీతో పాడే అవసరం మాత్రం కలగనే లేదు. బహుశ అయితే దుర్రానీయే తనకి బదులు వేఱేవారిచే

పాడించమని చెబుతూ ఉండవచ్చునని కూడా తోచిందట. అయినా ఏ మాత్రం చింత లేకుండా కూచుంది లతా.

కొన్నాళ్లకు తెలిసింది - తను అతనితో పాడక పోవడం వలన కలిగిన నష్టం అతనికే అని. తన చేతనే పాడించదలచుకున్న వారు, మేల్ సింగర్‌గా మొదట అతన్ని అనుకున్నా ఈ గొడవ వల్ల ఇతరులను ఎన్నుకోవడంతో క్రమంగా దుర్రానీ అవకాశాలు తక్కువై పోయాయి. ఓడ బండి అయిపోయింది.

ఇలాగే మరో వ్యక్తి కూడా లతాకు అసహనీయమైన ఇబ్బంది కలిగించాడు. అతను నఖ్‌శబ్ అనే గీతరచయిత. అతను కూడా స్టార్ వాల్యూ ఉన్న గీతరచయిత. వ్యసనపరుడు.

'మహల్' సినిమాకు పాటలు రాసే సమయంలో లతా అతనికి పరిచయమయింది. రిహార్సల్స్ సమయంలో లతా వద్ద ఉన్న పార్కరు పెన్ను గురించి తెగ మెచ్చుకున్నాడు. లతాకు ఓ చిన్న దౌర్బల్యం. తన దగ్గర వున్న వస్తువును మెచ్చుకుంటే అది వారికి బహుమతిగా ఇచ్చేసేది. ఆ పెన్ను కూడా అలాగే నఖ్‌శబ్‌కు ఇచ్చేసింది. వచ్చిన చిక్కేమిటంటే దాని మీద లతా పేరు చెక్కివుంది!

నఖ్‌శబ్ ఆ పెన్నుని అందఱికీ చూపిస్తూ లతాకు తనమీద ప్రత్యేక అభిమానం ఉందని



నఖ్‌శబ్ (మధ్యలో)- 'ఆయేగా ఆనేవాలా' వంటి వెంటాడే పాట రాసిన ఈయన లతా వెంటపడి వేధించాడు. హీరాసింగ్, మదన్‌పురిలతో..

చాటుకోసాగేడు. అది లతాదాకా వచ్చినా, దానికేదైనా సంజాయిషీ ఇస్తే లోకులు మరింత లోకువ కడతారని లతా కిమ్మనలేదు. అందుచేత అతను మతీ మితిమీతీ విజృంభించాడు. నౌషాద్ సంగీతంలో నఖ్‌శబ్ రాసిన పాట లతా పాడే రిహార్సల్లో నఖ్‌శబ్ ఆ పాటలో ఇంకా శృంగారం ఒలికించాలని చెబుతూ వెకిలిచేష్టలు చేయసాగేడు. అతని ఆంతర్యాన్ని గ్రహించినా, ఏమీ తెలియనట్లే ఆ పాట పాడేసి వెళ్లిపోయింది లతా.

నఖ్‌శబ్ అంతటితో ఆగలేదు. లతా ఇంటికే చెప్పా పెట్టకుండా దయచేశాడు. అతన్ని చూడగానే లతా మనస్సు భగ్గుమంది. వసారాలో చెల్లెళ్లు వుండగా చిత్తమొచ్చినట్లు మాటాడుతాడేమోనని భయపడి రోడ్డుమీదకి నడిపించింది. చీరచెంగు నడుంచుట్టూ బిగించి, "పిలవని పేరంటంగా నువ్విక్కడికి రావడంలో అర్థమేమిటి? మళ్లీ ఈ చుట్టుపక్కల ఎక్కడయినా కనిపించావంటే నీ ప్రాణాలు నీకు దక్కవ్. జాగ్రత్త. ముక్కముక్కలుగా నఱికి నీ శవాన్ని కుళ్లు కాలవలో పారేస్తాను." అని అరిచేసరికి జడిసిపోయి అతను అక్కడినుండి ఉడాయించాడు.

వ్యక్తిగతంగా నఖ్‌శబ్ లతాను ఇలా ఇబ్బంది పెట్టినా, అతడు లతాకు అజరామరమైన ఒక పాటను సమకూర్చిపెట్టాడు. అది 'మహల్' లోని 'ఆయేగా ఆయేగా ఆనేవాలా' పాట. వీనస్ ఆఫ్ ఇండియన్ స్క్రీన్ అని బిరుదు పొందిన మధుబాలపై చిత్రీకరించిన ఆ పాటతో లతా పాప్యులారిటీ దినదినలా వ్యాపించింది. స్మృతిపథంలో నిరంతరంగా నినదించే బాణీ - హాంటింగ్‌ట్యూన్- కావడం వల్ల అది ఈ నాటికీ జనప్రియమే.

అసలు హాంటింగ్ పాటలకు లతా పెట్టింది పేరు అనుకోవాలి. ఆమె పాడిన హాంటింగు పాటలెన్నో స్ఫురణకు వస్తాయి. "నైనా బర్ సే", "వో భూలీ దాన్‌తాన్" వంటివి ఎన్నో. 'అనార్కలీ'లోని 'యే జిందగీ ఉసీకీ హై' 'ఆజా అబ్‌తో ఆజా' గీతాలు కూడా వాటి హాంటింగ్ ఎలిమెంట్‌ని ఋజువు చేసుకున్నాయి. ఈ జన్మలోని గతాన్ని మాత్రమే కాక క్రితం జన్మలోని సన్నివేశాలనీ సందర్భాలనీ కూడా గుర్తుకి తెచ్చి మనోవీధిలో నృత్యం చేసే భావాలని రూపొందిస్తాయి.

'ఆజారే పర్‌దేశీ' (మధుమతి) 'ఆప్‌కీ నజరోంనే సమ్‌ఝా' (అన్‌పఢ్), నతుమ్ బేవఫా హో, నహమ్ బేవఫా హై', 'జో వాదా కియా' (తాజ్ మహల్) 'జిందగీ భర్ నహీ భూలేంగే నో బర్సాత్ కీ రాత్', 'మేరే నైనా సావన్ భాదో ఫిర్‌భీ మేరా మన్ ప్యాసా' ...ఎలా ఎన్నెనా చెప్పవచ్చు.

హాంటింగు పాటలన్నిటిలోనూ తనదైన ముద్ర వేసుకున్న గొప్ప పాట - 'కహీ దీప్ జలే కహీ దిల్'. అది రూపొందిన విధానం చెప్పుకోదగ్గ ఉదంతం.

సంగీతదర్శకుడు హేమంత్‌కుమార్ నిర్మాతగా మారి తీసిన చిత్రం - 'బీస్ సాల్ బాద్'. షెర్లాక్‌హోమ్స్ కథపై ఆధారపడిన డిటెక్టివ్ సినిమా. చిత్రంలోని సన్నివేశానుసారం, హేమంత్, ఒక హాంటింగ్ మెలొడీని సృష్టించారు. హమ్మింగ్‌లో "దసగా గారి/దసగారీ'సా" అనే స్వర ప్రయోగం కంపోజర్ కల్పనాశక్తికి సంపూర్ణ నిరూపణం. ఆ మూడ్‌లో పాడకపోతే సంపూర్ణ న్యాయం లభించదు. అల్లాంటి క్లిష్ట సృష్టిని, 'లత' క్లిష్ట సమయంలో ఇష్టం లేకుండా పాడవలసి వచ్చింది.

కారణం అప్పట్లో ఆమె ఎదుర్కోవలసి వచ్చిన ఆకస్మిక అస్వస్థత. తన గళస్వరం తన స్వాధీనంలో వున్నప్పుడే పాడే అలవాటు లతది. ఏ చిన్న సంకోచం తోచినా రికార్డింగుని వాయిదా చేయించుకుని, తనకి నమ్మకం కుదిరిన



'యాద్ రఖ్‌నా చాంద్‌తారో' (అనోఖా ప్యార్)

'జమానే కా దస్తూర్ హై యే పురానా' (లాజవాబ్)

'జా మైం తోసే నహీ బోలూ' (సౌతేలా భాయీ)

వంటి హిట్‌సాంగ్స్ లతాచే పాడించిన అనిల్ బిశ్వాస్ లతా తొలిరోజుల్లో పాడే టెక్నిక్ నేర్పి ఆమె ప్రగతికి తోడ్పడ్డారు. వినేవారికి తెలియకుండా పాటల మధ్య ఊపిరి యెక్కడ తీసుకోవాలో, యెక్కడ వదలాలో, కంఠస్వర సంస్కృతి, పదోచ్చరణా, మోడ్యులేషన్ అనే అంశాలు ఎలా అలవరచుకోవాలో ఆయన లతాకు విశదీకరించారు.

లతాతో డ్యూయెట్ పాడే అవకాశం నాకు లభించినప్పుడు మాటల సందర్భంలో ఎంత పొడుగాటి లైనయినా విఱిగగొట్టకుండా సాగదీస్తూనే పాడగలగడం ఎలా సాధ్యం అయిందని అడిగేశాను. నా ఆకాంక్ష గమనించి ఆమె ఆ ప్రశ్నకు సమాధానం మాటలరూపంలోనే కాక, ఉదాహరణ సహితంగా విపులంగా తెలియజేశారు. ఆ విధంగా కొంత సాధకం రోజూ చేస్తే తేలికగా పాడగలరని చెప్పారు కూడా. ఇంచుమించు ప్రాణాయామాన్ని లాటిదే ఆ పద్ధతి. ఆ విధంగా చేసి పొడుగాటి వాక్యాలు కూడా మధ్యలో తెంచకుండా పాడగలగడం నేర్చుకున్నాను. ఆ ఉపకారానికి నేనామెకు ఏ నాటికీ కృతజ్ఞుణ్ని. అంతేకాదు మరొకదానికి కూడా కృతజ్ఞుడిని. నాతో డ్యూయట్ పాడి బొంబాయి తిరిగివెళ్లిన తర్వాత ఎందరో సంగీతదర్శకుల వద్ద నా సింగింగ్ గుఱించి ప్రశంసించిడం జరిగింది. నేను బొంబాయి వెళ్లినప్పుడు పలువురు ఆ విషయం ప్రస్తావించినప్పుడు నేను ఆశ్చర్యపడి ఆమె సహృదయతకు, దొడ్డగుణానికి జోహార్లు అర్పించాను.

- పి.బి.యస్.



## సురైయా కెరియర్‌పై శ్రద్ధ వహించివుంటే..

# లతాకు ఇన్ని అవకాశాలు వచ్చేవా?

లతా రంగంపైకి వచ్చేనరికే నూర్జహాన్, సురైయా ఇద్దరూ గాయక నటీమణులుగా వెలుగొందుతున్నారు. నూర్జహాన్ కంటె వయసులో చిన్నది, అందగత్తె అయిన సురైయాకు ఎంతోమంది అభిమానులు ఉన్నారు. అప్పట్లో ప్లేబ్యాక్ విధానం అంతగా పాప్యులర్ కాలేదు. అందంగా ఉండి, బాగా నటించగలిగి, ఎవరిపాట వాళ్లు పాడగలిగిన వాళ్లకే అవకాశాలు ఉండేవి. లతా నటి కాకపోవడం వలన గాయనిగా ఎదగడానికి అది అవరోధం అవుతుందని సురైయా భావించింది. కానీ దీనికి విరుద్ధంగా జరిగింది. నూర్జహాన్ పాకిస్తాన్ వెళ్లిపోగా సురైయా తన కెరియర్ పట్ల, ముఖ్యంగా పాటలు పాడడం పట్ల శ్రద్ధపట్టకపోవడం లతాకు కలిసివచ్చిందని అనాలి.

సురైయాకు జీవితంలో అన్నీ సులభంగా కలిసివచ్చాయి. 10 వ యేట బాలనటిగా సినిమాలలో ప్రవేశించింది. 14 వ యేట హీరోయిన్ అయింది. పాటపాడడం రాదు మొర్రో అన్నా నౌషాద్ పట్టుబట్టి ఆమెచే పాటలు పాడించాడు. ఆమె పాటకు ప్రజలు ముగ్ధులయ్యారు. 1949లో ఆమె నటించిన 11 సినిమాలు విడుదలయ్యాయి అంటే ఆమె డిమాండ్ ఊహించుకోవచ్చు. అప్పుడు ఆమెకు 20 యేళ్లు మాత్రమే! ఆ టైములోనే దేవ్ ఆనంద్‌తో ప్రేమలో పడడం జరిగింది. కానీ ఇంట్లో ఒప్పుకోకపోవడంతో పెళ్లాడలేకపోయింది. ఇటువంటి వ్యక్తిగత సమస్యలు కూడా ఆమెకు కెరియర్‌పై ఉత్సాహాన్ని చంపేశాయి. 33 యేళ్లకే రిటరయిపోయింది.



సురయాచే ప్లేబ్యాక్ పాడించుకున్న మెహతాబ్

కావాలంటే ఆమె నటన మానేసి ప్లేబ్యాక్ సింగర్‌గా కొనసాగవచ్చు. ముందులో మెహతాబ్‌కు, ఇతరులకు ప్లేబ్యాక్ పాడి పేరు తెచ్చుకున్నా ఆమె ఆ వైపు మళ్లీ పోలేదు. దానికి కారణం ఆమెయే చెప్పింది - "2,000 పాటల దాకా పాడినా వాస్తవానికి నేను నటిని మాత్రమే. నౌషాద్ పట్టుదల కొద్దీ నన్ను గాయనిగా తీర్చిదిద్దాడు. స్వభావతహ నేను బద్ధకిస్తుని. ఏ పనీ చేయకుండా రోజులు గడిపేయాలనుకునేదాన్ని. అందుకే నేను కెరియర్‌గురించి పట్టించుకోలేదు."

వినయం కొద్దీ సురైయా అలా చెప్పుకున్నా ఆమె గాయనిగా కూడా రాణించింది. ఖుర్షీద్ అన్వర్, శ్యామ్ సుందర్, అనిల్ బిశ్వాస్, సజ్జాద్, హంసరాజ్ బెహల్, హుస్నలాల్-భగతరామ్ వంటి గొప్ప సంగీతదర్శకుల వద్ద పనిచేసి మెప్పించిన కళాకారిణి ఆమె. అంతే కాదు, గాయనిగా ఆమె కు మంచి మార్కెట్ కూడా ఉండేది. 'దునియా' (1949)సినిమా తీసేటప్పుడు సురైయా తన ప్లేబ్యాక్ తను పాడుకోవడం ఇష్టం లేదని లతా చేత పాడించమని సంగీతదర్శకుడు సి.రామచంద్రను కోరింది. అంతకు ముందు సురైయాచే 'సామ్రాట్ చంద్రగుప్త'కై పాడించిన రామచంద్ర సురైయా ప్రతిభ ఎఱిగినవాడు. లతాకు అప్పుడు కూడా అయినా రామచంద్ర ఈ ప్రతిపాదన ఒప్పుకోలేదు.

"నీకేం మతిపోయిందా? ఈ సినిమా మార్కెట్ గురించి నీకు తెలుసా? సింగింగ్ స్టార్‌గా నీ ఇమేజిని దృష్టిలో పెట్టుకునే డిస్ట్రిబ్యూటర్స్ ముందు కొచ్చారు. లతా ప్లేబ్యాక్ అంటే వెనక్కి వెళ్లిపోతారు." అంటూ మందలించాడు.

మరి అలాటప్పుడు లతా పేరు సురైయా ఎందుకు ప్రతిపాదించినట్లు? సురైయా చెప్పింది - 'నేను నూర్జహాన్, లత ఇద్దరితోనూ కలిసిపాడాను. గాయనిగా వాళ్లిద్దరితో పోలిస్తే నా ప్రతిభ తక్కువనే చెప్పాలి. నూర్జహాన్ వజ్ బోర్న్ గ్రేట్, లతా ఎఛీవ్డ్‌గ్రేట్‌నెస్..ఆమె సినీరంగ ప్రవేశం చేసిన కొత్తలో హుస్నలాల్ భగత్ రామ్, ముఖ్యంగా హుస్నలాల్ లతాను ఎంతో ప్రోత్సహించి, ఆమెను తీర్చిదిద్దాడు. ఇక నా సంగతంటారా..ఐ హేడ్ సింగింగ్ గ్రేట్‌నెస్ థ్రస్ట్ ఆన్ మీ."

కళాకారుల మధ్య సాధారణంగా ఉండే స్పర్థ చూపకుండా సురైయా లతాను ఈ విధంగా ప్రోత్సహించడం లతా అదృష్టమే కదూ!

- సి.ఎస్.ఎన్.మూర్తి

పిమ్మటనే కాల్‌షీట్ ఇచ్చి, పాటని తనకి తృప్తిగా వచ్చే వరకూ పాడే నిశ్చితనిర్ణయం గల లత, అస్వస్థత సమయంలో పాడేందుకుకెలా పూనుకోగలదు? పైగా వైద్యులు ఆమెకి కొంతకాలం విరామం తీసుకోవడం అనివార్యం అని చెప్పినప్పుడు? అందువల్ల రెండుమూడుసార్లు రికార్డింగు ఫిక్సు అయికూడా కేన్సిల్ చేసకుంది.

చిక్కెక్కడ వచ్చిందంటే, వ్యాపారదృష్ట్యా హేమంత్ తన చిత్రాన్ని సాధ్యమైనంత త్వరగా పూర్తిచేసి విడుదల చెయ్యవలసిన పరిస్థితి వచ్చిపడింది. రిలీజ్ డేటు ప్రకటించేశారు. ఈ పాట సినిమాకు ప్రాణప్రదం. తీసేయడానికి లేదు. ఒకపక్క లత గొంతు పరిస్థితి చూడబోతే ఇలా వుంది. పాడగలదా?



హేమంత్‌కుమార్ -లతాచే 'కహీదీప్ జలే కహీ దిల్' పాట పాడించడానికి నెలల తరబడి వేచివున్న నిర్మాత, సంగీతదర్శకుడు

పాడినా తననుకున్న ఎఫెక్టు వస్తుందాని కలత చెందారు హేమంత్. పోనీ వేరెవరిచేతనైనా పాడించాలన్నా ఆ పాటకి లతలా మరెవ్వరూ న్యాయం చేకూర్చలేరనేది ఆయన అకుంఠిత విశ్వాసం.

మూడు నెలలకు పైగా నిరీక్షణ తర్వాత ఏమైతే అది అయిందని రికార్డింగు డేటు నిర్ణయించేశారు. లత కొంచెం కోలుకుని, రికార్డింగుకి వచ్చారట. కాని రిహార్సల్సు చేస్తున్న సమయాన ఆమె గళం ఇంకా సంపూర్ణంగా కోలుకోలేదని విస్పష్టంగా అందరికీ తోచింది. అయినా హేమంత్‌కి ఏదో తెలియని గట్టి నమ్మకం. లతకి మాత్రం ఇంకా నమ్మకం కుదరలేదు. తన వాయిస్ ఇక ఎప్పటికీ బాగుపడదేమో నన్నంతగా నిరాశ ఆవరించింది. దైవం మీద భారం వేసి ఒక టేకులాటి రిహార్సలు ఇచ్చింది.

రిహార్సలు ముగించి హేమంత్‌కుమార్‌ని సందేహిస్తూనే అడిగింది. "నా వాయిస్ గురించి మీకేం అనిపిస్తోంది" అని. హేమంత్ ఏ బదులూ చెప్పకుండా, ఆమెని పిలిచి రిహార్సల్సు జరుగుతున్నప్పుడే ఆమెకి చెప్పకుండా తను రికార్డు చేయించేసిన పాటని వినమని చెప్పారు.

లత తన చెవుల్ని తనే నమ్మలేకపోయింది. నమ్మలేనంత బాగా తన వాయిస్ రికార్డ్ అవడం తెలిసి, తను కోల్పోయిన నమ్మకం తిరిగి కలిగే సరికి, ఆమె పొందిన ఆనందం అపారం. చాలా క్లిష్టమైన సంగీత సృష్టిని ఏమాత్రం అలసట లేకుండా తను సులువుగా పాడగలిగిన ఆ సన్నివేశం ఆమె గళస్వరానికే పునర్జన్మ ప్రసాదించినంతగా ఫీలయి, చెప్పనలవికానంత రిలీఫ్ పొందింది. ఆవిడ కెరియర్ ఆ సంఘటన ఒక కొంగ్రొత్త మలుపు అనిపించింది. (నా కాశ్చర్యమేమిటంటే నా వృత్తి జీవనంలో కూడా, ఇలాంటి సంఘటన ఎం.ఎస్.విశ్వనాథన్‌గారు స్వరపరిచిన భావపూర్ణమైన గీతం ('రాము' చిత్రానికై పాడిన నిలవే - ఎన్నిడం) రికార్డింగు సందర్భంలో జరగడం. కళాకారుల జీవితాలలో ఇలాంటి విచిత్రాలు అనివార్యాలు కాబోలు!

ఆ పాట సాధించిన ఘనవిజయం వల్ల హేమంత్ కుమార్‌పై లతా కు గౌరవం ఇనుమడించింది. ఆ మాటకొస్తే హేమంత్ అంటే లతా కు ఎప్పుడూ గౌరవమే. అది 'ఆనంద్‌మఠ్' (1952) సినిమా నిర్మాణంలో మరింతగా బయటపడింది. ఆ సినిమాను తీస్తున్న ఫిల్మిస్తాన్ కంపెనీకి లతకీ మధ్య వైమనస్యం పెరగడం వలన ఆమె ఆ కంపెనీకి పాడడం ఇష్టపడని రోజులవి. ఆ సినిమాలో 'వందేమాతరం' పాటను విభిన్నంగా మార్చింగ్‌సాంగ్‌లా వినిపించాలని సంగీత దర్శకుడుగా నియమింపబడిన హేమంత్‌కుమార్ ఆలోచన. ( ఆ పాట ఇప్పుడు టీవీ యాడ్స్‌లో కూడా తరచుగా వినిపిస్తూంటుంది) ఆ పాట లతాయే పాడాలని హేమంత్‌కి పట్టుదల. లతాకు చెప్పిచూశాడు. కంపెనీతో పడకపోయినా, హేమంత్ మనసు కష్టపెట్ట కూడదనే సద్భావంతోనే ఆ స్టూడియోలో లతా అడుగుపెట్టింది. ఆమెతో గల మనస్పర్థ కారణంగా కొందరు ప్రముఖులు ఆ రికార్డింగుకు చాలా అవాంతరాలు కలిగించేందుకు శాయశక్తులా ప్రయత్నించారుట. ఎన్ని టేకులు ఆమె ఓపికతో పాడినా, మరోసారి టేకు చేస్తే మంచిది అంటూ విసిగించారుట.

అయినా సహనాన్ని కోల్పోకుండా పాట పాడడం ముగించి, బయలుదేరే ముందు హేమంత్‌కుమార్ తో "మీరు చాలా గొప్ప కళాకారులు. మీ మాటను కాదనడం ఇష్టపడకే, నేను ఏనాడూ రాకూడదనుకున్న ఈ కంపెనీ రికార్డింగుకి వచ్చాను. సెలవ్." అని అన్నది. ప్రొఫెషనలిజమ్, పెద్దలపట్ల గౌరవం, ఆత్మగౌరవం లతా ఎంత చక్కగా బేలన్స్ చేసుకున్నదో దీనివల్ల విశదమవుతుంది.

(ఇంకా ఉంది)

## లతా గానలహరి



కహీ దీప్ జలే, కహీ దిల్
జరా దేఖ్ లే ఆకర్ పర్‌వానే
తేరీ కౌన్‌సీ హై మంజిల్ ॥కహీ॥

మేరా గీత్ మేరే దిల్ కీ పుకార్ హై
జహా మై హూ వహీ తేరా ప్యార్ హై
మేరా దిల్ హై తేరీ మెహఫిల్ ॥జరా॥ ॥కహీ॥

నా మై సప్‌నా హూ నా కోయీ రాజ్ హూ
ఇక్ దర్ద్ భరీ ఆవాజ్ హూ
పియా దేర్ న కర్ ఆ మిల్ ॥జరా॥ ॥కహీ॥

దుశ్‌మన్ హై హజారోం యహ్ జాన్‌కే
జరా మిల్‌నా నజర్ పెహచాన్‌కే
కయీ రూప్ మే హై కాతిల్ ॥జరా॥ ॥కహీ॥

చిత్రం : బీస్ సాల్ బాద్
రచన : షకీల్ బదాయునీ
సంగీతం : హేమంత్‌కుమార్



## లతా వాయిస్ - పీపుల్స్ ఛాయిస్

"'లత' మా సంగీత సృష్టికర్తలందరికీ దేవుడి వరప్రసాదం!" ఆమె గళ ప్రయాణం అంతులేనిది కావడం వల్ల మా సృష్టికెక్కడా ఎల్లలేలేవు. ఎంతటి క్లిష్టమైన ట్యూన్నైనా 'లత' అతి సులభంగా పాడి మెప్పించి మెప్పొందడం, సంతృప్తి కారణం."

**- సంగీత దర్శకుడు అనిల్ బిశ్వాస్**

"నిరుపమాన గాయకి, దీనికి వేరే మాటే లేదు"

**- సంగీత దర్శకుడు సి.రామచంద్ర**

"ఆకాశ వైశాల్యం కూడా ఆమె గళ వైశాల్యానికి సాటి రాదు"-

**- సంగీత దర్శకుడు గులాం హైదర్**

"మేం ఇచ్చిన ఒక అణా విలువ చేసే ట్యూన్‌కి పదహారణాల పరిపూర్ణత సిద్ధింపజేసే సంగీత కళాదేవి 'లత' అనే సహోదరి"

**-లక్ష్మీకాంత్‌ప్యారేలాల్ (సంగీతదర్శకులు)**

"'లత' రాక మునుపు నటీమణులు పాడిన పాటలు పేరుకి మాత్రమే. 'లత' నేపథ్య గానం ప్రారంభమైన తరువాతే నిజమైన సంగీతం వినగలుగుతున్నాం.'

**- గాయకి, నటీమణి కానన్ దేవి**

"'లత' గానం వింటూనే నేను పెరిగి తెలుసుకున్నాను. భారతదేశ సంగీతం వినోద ప్రదం మాత్రమే కాదు, భగవంతుణ్ణి చేరుకోగలిగే మార్గం" అని!

**- కవితా కృష్ణమూర్తి**

సేకరణ - శ్రీని'వాయిస్'

# వామ్మో! వాపు!!

-వారణాసి రామకృష్ణ



**"అయ్యా బాబోయ్!"**

గట్టిగా భూనభోంతరాళాలు దద్దరిల్లేలా అరిచాడు సుక్కీత్!

సుక్కీత్ పేరుమోసిన ఫిలింస్టారు! తొలి రెండు చిత్రాలు అట్టర్ ఫ్లాపులు కాగానే జ్యోతిష్కులను సంప్రదించి వారి సలహా ప్రకారం సుకీత్ అన్న పేరుని కాస్తా సుక్కీత్ గా మార్చుకున్నాడు! అంతే - వరుసగా మూడు సిన్మాలు సూపర్ హిట్టయ్యాయి! దాంతో రాత్రికి రాత్రే పాపులర్ స్టార్ అయ్యాడు! అయితే ఇప్పుడిలా అయ్యబాబోయ్ అని అంత లావున అరిచింది ఏ సిన్మా షూటింగ్‌లోనో కాదు! అతని బెడ్రూమ్‌లోనే!

బారెడు పొద్దెక్కాక జరిగిందా సంఘటన! రాత్రి రెండు గంటలదాకా షూటింగ్‌లో పాల్గొని ఆ తర్వాత ఇంటికొచ్చి మంచం మీద వాలిపోయిన వాడల్లా బారెడు పొద్దెక్కాక మెలకువ వచ్చి కళ్ళు విప్పి మంచం దిగుదామని కాలు కింద పెట్టబోతే - ఇంకేముంది?

**ఎడమతొడ ఇంత లావున వాచిపోయింది! చూట్టానికి ఏనుగు కాలు సైజులో ఉబ్బెత్తున్న ఊరిపోయిందక్కడ.**

మిగతా శరీరం అంతా మామూలుగానే ఉండి కేవలం ఎడమ తొడ మాత్రం ఇంత లావున వాచిపోయి కాలు క్రింద పెట్టనీయకుండా అయిపోయిన పరిస్థితిని చూసి బెంబేలెత్తిపోతూ మళ్ళీ మరోసారి "అయ్యబాబోయ్! వార్నాయనోయ్!" అంటూ గట్టిగా అరిచాడు. ఆ అరుపులకి అసిస్టెంటు, పర్సనల్ మేకప్‌మ్యాన్ ఇద్దరూ పరుగు పరుగున వచ్చి "ఏమైంది సార్?" కంగారు పడ్డారు. ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో అర్థంగాక సుక్కీత్ ఏడుపు గొంతుతో "పక్కమీంచి లేవలేకపోతున్నాను! ఈ తొడ ఏంటో ఈ లావున వాచిపోయింది!" బాధగా చెప్పాడు. ఇద్దరూ నిలువు గుడ్లేసుకుని వింతగా, విచిత్రంగా ఉబ్బిన వాపుని చూశారు! మేకప్‌మ్యాన్‌కి ఈ వింత వాపు చూసి నవ్వొచ్చి - అయినా నవ్వటం బాగోదు కనుక ఆపుకునే ప్రయత్నం చేస్తూ-

"ఏం కుట్టిందో ఏమో! నొప్పి విపరీతంగా ఉంది! కాలు కదపలేకున్నాను!" అంటూ అప్పటివరకూ ఓపిక పట్టిన వాడల్లా ఒక్కసారిగా ఏడుపులంకించుకున్నాడు. అంత పెద్ద స్టార్ మరీ ఇంత బేలగా ఏడవటం చూసి అసిస్టెంట్ బిక్కచచ్చిపోయి తనూ ఏడ్చేశాడు. ఈలోగా మేకప్‌మ్యాన్ నవ్వాపుకుని డాక్టర్‌కి ఫోన్ చేసి పిలిపించాడు. డాక్టర్ వచ్చి చూశాడు కానీ అతనికేమీ పాలుపోలేదు! కేవలం ఎడమ తొడ మాత్రమే అంతలావున ఎలా వాచిందో అర్థం కాక

"ఇదేంటి సార్! ఇట్లాంటి వాపు ఎక్కడా చూడలేదు!" అన్నాడు.

"అదేనయ్యా బాబూ! నొప్పి అదిరిపోతోంది!" అంటూ బాధగా మూలిగాడు సుక్కీత్.

మేకప్‌మ్యాన్‌కి నవ్వు పొర్లుకొచ్చి ఆపుకోలేక అక్కడుండటం బావోదని కర్చీఫ్‌తో ముఖం కప్పుకుని బైటకెళ్ళిపోయి పడిపడి నవ్వసాగాడు. సుక్కీత్‌కి విషయం అర్థమయి కోపం వస్తున్నా ఒక ప్రక్క కాలు విపరీతంగా నొప్పితో లాగేస్తుంటే కుయ్యో మొర్రోమంటూ మూలగసాగాడు. అసిస్టెంటు కేమీ పాలుబోక వింతగా ఉబ్బిన తొడని చూసి-

"రాత్రి పురుగేమైనా కుట్టిందేమో సార్!" అన్నాడు అనుమానంగా!

ముట్టుకుని పరీక్షిద్దామని చేత్తో నొక్కి చూడగానే సుక్కీత్ కెవ్వుమని అరిచాడు. ఆ అరుపుకి డాక్టర్ అదిరిపోయి-

''నొప్పిగా ఉందా?'' అడిగాడు అయోమయంగా!

''నొప్పా? నొప్పిన్నరా? చిన్నగా అడుగుతారేంటి డాక్టర్... ప్రాణం పోతోంది!''

నొప్పి తగ్గేందుకు డాక్టర్ ఇంజక్షన్ ఇచ్చేడు. అయినా తగ్గలేదు! మరో గంటయినా పరిస్థితి అలాగే ఉంది! పైపెచ్చు వాపు మరింత పెరిగింది! కేసు అర్థంగాక బుర్ర గోక్కుంటూ జుత్తు పీక్కుంటూ డాక్టరు వెళ్ళిపోయాడు.

అవతల షూటింగ్ ఆగిపోయింది! ఈ వార్త దావానంలా ఫిల్మ్ ఇండస్ట్రీ అంతా పాకిపోయింది. అందరూ తలోరీతిన తోచిన విధంగా వాపు మీద విపరీత వ్యాఖ్యానాలు చేశారు! సాయంత్రం అయింది! మెల్లిగా స్ట్రెచర్ మీదకి చేర్చి అంబులెన్స్‌లో ఫిలిం స్టార్ సుక్కీత్‌ని మల్టీ స్పెషాలిటీ ఫైవ్ స్టార్ ఆస్పత్రిలో చేర్చారు! అప్పుడక్కడ ఎముకల వ్యాధి నిపుణుడు, కండరాల నిపుణుడు, చర్మవ్యాధుల నిపుణుడు, తొడ యెక్క రక్తనాళాల స్పెషలిస్టుతో బాటు కొత్తగా ఎవరో కుర్రడాక్టర్లు తొడల మీద రిసెర్చి చేస్తున్నారని తెలిసి వాళ్ళనీ పట్టుకొచ్చి పరిశోధనలు చేయించారు! అందరూ శల్య పరీక్షలు చేశారు! ఎవ్వరికీ ఏమీ అర్థం కాలేదు! ఎందుకలా కేవలం తొడ భాగంలోనే విపరీతంగా వాపు వచ్చిందో ఎన్నిపరీక్షలు చేసినా తేలలేదు! సుక్కీత్ బాధతో కెవ్వుకెవ్వున ఐదేసి నిముషాలకొకసారి అరుస్తూనే ఉన్నాడు.

ఆ రాత్రి బహిరంగ సభలో వీరావేశంగా స్పీచ్ ఇస్తుండగా - అధికార పార్టీ అధ్యక్షుల వారికి ఈ వార్త వచ్చింది! సుక్కీత్ వింత వాపు వ్యాధితో ఫైవ్‌స్టార్ ఆస్పత్రిలో ఉన్నాడని తెలీగానే అధ్యక్షుడికి క్షణం పాటు ఆశ్చర్యం కలిగినా వెంటనే లోలోన సంతోషం పుట్టుకొచ్చింది! లేకపోతే- పిల్లకాకిగాడు నిన్నగాక మొన్న సిన్మాల్లోకొచ్చి కాసింత నటన, కూసింత ప్రజాదరణ వచ్చిందో లేదో వెంటనే రాబోయే రోజుల్లో కాబోయే సీఎం తనేనన్న లెవెల్లో ఫోజు కొడతాడా? హన్నన్నా! ఏదో శత దినోత్సవ సభకి పిల్చేడు కదానని వెళితే- పదిమంది జనం కనబడగానే రెచ్చిపోతూ ప్రజా సమస్యలు- రాజకీయాలు అంటూ వీరలెక్చర్ దంచుతాడా? అధ్యక్షుడు మనసులోనే నవ్వుకుని పైకి మాత్రం- సభకొచ్చినవార్ని ఉద్దేశించి- ''ప్రియతమ ప్రజలారా! మీ అందరి సమస్యల్నీ ఇవాళే పరిష్కరించాలని ఈ సభకి వచ్చాను! కానీ ఇప్పుడే తెలిసింది- మన పాపులర్ స్టార్ సుక్కీత్ ఆస్పత్రిలో ఉన్నాడన్న సంగతి! ప్రజా సమస్యలు ముఖ్యమా? లేక సిన్మాస్టార్ ఆరోగ్యం ముఖ్యమా? మీరే చెప్పండి?" అంటూ అడిగే సరికి జనం కూడా గగ్గోలు పెడుతూ

"అవును! వెంటనే మీరు ఆస్పత్రికెళ్ళాలి అదే ముఖ్యం" అరుస్తూ వాళ్ళు కూడా లేచి నిలబడి "మా కంఠంలో ప్రాణం ఉన్నంత వరకూ మా సుక్కీత్‌ని బతికించుకుంటాం. మా రక్తం ధారపోసయినా సరే మా హీరోని కాపాడుకుంటాం!" అంటూ ఆస్పత్రి ఆవరణలో చేరి నినాదాలు పెడుతూ అక్కడి సిబ్బందిని చితకబాదుడు బాదుతూ కిటికీ అద్దాల్ని విరగ్గొట్టడం ప్రారంభించారు!

ఇదిలా ఇక్కడ సాగుతుండగా- అధ్యక్షుడు హుటాహుటిన ఆస్పత్రిలోకొచ్చి "వాట్ హేపెండ్ సుక్కీత్?" అంటూ ఆదుర్దా నటిస్తూ అడిగాడు. ఆయన ఆదుర్దాని ఎంత బాగా నటిస్తున్నాడో అంత బాధలోనూ సుక్కీత్‌కి అర్థమై రేపు ఎప్పుడైనా సిన్మా సన్నివేశాల్లో ఆదుర్దా చూపించాల్సి వస్తే ఇదే మేనరిజమ్ పెట్టాలనుకున్నాడు.

"ఏమోసార్- పొద్దున్నించి నొప్పి- చంపేస్తోంది!'' అంటూ లుంగీ పైకి జరిపి వాపు చూపించాడు. అసెంబ్లీ భవన స్తంభమంత లావున వాచిన వాపు చూసి అధ్యక్షుడు నిర్ఘాంతపోతూ ''డోంట్‌వర్రీ! అమెరికా నుండి స్పెషలిస్టుని పిలిపిద్దాం! రేపటికల్లా షూటింగ్‌లో పాల్గొందువుగాని! బీ బ్రేవ్ మై బోయ్! '' నవ్వుతూ చెప్పేసి వెళ్ళిపోయాడు.

ఆయన వెళ్ళిన కాసేపటికి- అతనెళ్ళిపోయాడని నిర్ధారించుకుని - ప్రతిపక్ష పార్టీ అధ్యక్షుడు బిరబిరమని పరుగులతో ఆస్పత్రిలోకొచ్చేసరికి ఒక ఫోటోగ్రాఫర్ "సార్! సుక్కీత్‌గారి వాపు మీద మీ స్పందన ఏంటి సార్?'' చిలిపిగా అడిగాడు. దానికి ఆయన జవాబివ్వకుండా లోనికెళ్ళిపోతూంటే-

"వాపు మీద స్పందన చెప్పకపోతే పోయారు కనీసం సుక్కీత్ ఆరోగ్యం బాగవగానే మీ పార్టీలో చేర్చుకుంటున్నారా? అదయినా చెప్పండి?" అడిగాడు.

లోనికెళ్ళబోతున్న అధ్యక్షుడు ''చూడు బాబూ! కొందరికి కాలు వాస్తుంది... కొందరికి చెయ్యి వాస్తుంది... కొందరికి మెడ వాస్తుంది... కానీ సుక్కీత్‌కి తొడ వాచింది! శరీరం అంటూ ఉన్నాక ఏదో ఒకటి వాస్తూనే ఉంటుంది!" అని నడుస్తూ చెప్తుండగానే మరికొంతమంది మరిన్ని ప్రశ్నలు సంధించసాగారు.

"మీరు నన్ను విడిచిపెట్టకుండా ఎడాపెడా






కొచ్చిన్లు సంధిస్తే నా తలవాస్తుంది!" అని ప్రతిపక్ష పార్టీ అధ్యక్షుడు అనగానే అందరూ పకపకమని నవ్వేరు!

సుక్కీత్‌ని పరామర్శించి బైటి కొచ్చేస్తుంటే మీడియా వాళ్ళు ప్రకటన చేయందే వదలేలా కనిపించలేదు! వెంటనే మొహం సీరియస్‌గా దీనంగా పెట్టి "సుక్కీత్ గొప్ప మానవతావాది! తెలుగు తెరకి ఒక గొప్ప నటుడు... బ్రహ్మాండమైన యంగ్ హీరో... దొరికాడని సంతోషిస్తున్న ఈ టైంలో ఇలా తొడ వాయటం దారుణం! నిజంగా ఈ వాపు దురదృష్టకరం! తొడ వాపు పట్ల నేను తీవ్ర దిగ్భ్రాంతిని వ్యక్తం చేస్తున్నాను! అతను తొందరగా కోలుకుని మరిన్ని గొప్ప గొప్ప చిత్రాల్లో నటించాలని, నటిస్తాడని ఆశిస్తున్నాను!"

ప్రకటన ఇచ్చి సీరియస్‌గా మొహం పెట్టి వేగంగా బైటికెళ్ళిపోయాడు. వారం రోజుల గడిచినా పరిస్థితిలో మార్పులేదు! వాపు తగ్గలేదు సరికదా నొప్పికి సుక్కీత్ ఏడ్చే ఏడుపు- పెట్టే హాహా కారాలతో ఫైవ్‌స్టార్ ఆస్పత్రి దద్దరిల్లి పోతోంది! ఏదో నాలుగు రోజులు విశ్రాంతిగా హాయిగా గడుపుదామని అలాంటి స్టార్ ఆస్పత్రుల్లో చేరే బిజినెస్ టైకూన్లకూ, 'పెద్ద' రోగులకూ ఇదో న్యూసెన్స్‌గా అనిపించింది!

ఓ పెద్ద మనిషి ఆస్పత్రి ఛైర్మన్‌ని పిలిపించి- "ఏంటయ్యా ఇది? మున్సిపల్ మార్కెట్టా? కార్పొరేట్ ఆస్పత్రా? వో మంచి స్పెషలిస్టుని పట్టుకొచ్చి ఆ కుర్రాడి రోగాన్ని తగ్గించండి! చేతకాకపోతే చెప్పండి - నేను మరో ఆస్పత్రి చూసుకుంటాను!" విసుగ్గా చెప్పాడు.

అమ్మో అంత పెద్ద టైకూన్‌ని వదులుకుంటే బిజినెస్ పోదూ? ఛైర్మన్ కాళ్ళా వేళ్ళా పడుతూ టైకూన్ 'టై' పట్టుకుని ప్రాధేయపడుతూ- "ఏం




చెయ్యాలో అర్థం కావట్లేదు సార్!" చెప్పాడు.

"ఆఫ్రికాలో డాక్టర్ ఏఆర్ నీల్కుమా అనే వాపు వ్యాధుల స్పెషలిస్టున్నాడు! అతనికి ఫోన్ చేసి పిలిపిస్తాను!" అంటూ సెల్‌ఫోన్ తీసి నెంబర్లు వొత్తేడు!

సదరు 'నీల్కుమా'ని ఆగమేఘాల మీద రప్పించేరు! ఆఫ్రికా డాక్టరంటే చింపాంజీకి చిన్నన్నలాగా, ఓరాంగ్‌టాంగ్‌కి పెద్దన్నలాగా ఇంతెత్తు అంతలావున ఒళ్ళంతా దట్టమైన జుత్తుతో ఉంటాడనుకుంటున్న వాళ్ళల్లా డాక్టర్ నీల్కుమాని చూసీ చూడగానే ఆశ్చర్యంతో బిక్కచచ్చిపోయారు! కారణం- అతను అందంగా తెల్లగా స్మార్టుగా ఉండటమే కాదు తెలుగు చకచకమని మాట్లాడేస్తున్నాడు కూడా!

సుక్కీత్ అసిస్టెంటు "సార్! మీకు తెలుగు..." అని ఆశ్చర్యంగా అడిగేసరికి నీల్కుమా పకపకమని నవ్వి "చూడు మిస్టర్! నా పేరు ఏఆర్ నీల్కుమా- అంటే అనిల్‌కుమార్! అందరిలా అమెరికాలో కాక వెరైటీగా ఆఫ్రికాలో ఉన్నాను కాబట్టి పేరు కూడా వెరైటీగా ఉండాలని పేరు చివర్లోని ఆర్‌ని, మొదట్లోని ఏ ని, ప్రక్కకి లాగి, ఏ.ఆర్.రెహమాన్‌లాగ ఉంటుందని ఏఆర్ నీల్కుమా అనే వెరైటీ పేరు పెట్టుకున్నా! తమాషా ఏంటంటే ఆఫ్రికాలో ఈ పేరు గలవాళ్ళు బోలెడుమంది! నిజానికి నేను తెలుగు వాడినే! పైగా నాకు తెలుగు సిన్మాలంటే పిచ్చ పిచ్చి! తెలుగు పాటలంటే చచ్చే ప్రాణం!"

చకచకమని మాట్లాడుతూ నీల్కుమా సుక్కీత్ తొడవాపు చెక్‌చేస్తూ వాపు మీద వేలితో రాసి చూసి "వో మైగాడ్! దిసీజ్ ఎయిడ్!" అంటూ అరిచాడు.

డాక్టరలా ఎయిడని అరవగానే అప్పటిదాకా అక్కడున్నవాళ్ళంతా తుపాకీ చప్పుడికి పిట్టలు ఎగిరిపోయినట్టు ఎగిరిపోయారు! సుక్కీత్ హడలిపోతూ-

"ఈ ఎయిడ్స్ నాకెలా వచ్చింది డాక్టర్? నాకసలు ఎవ్వరితోనూ సంబంధాలే లేవు డాక్టర్! ప్లీజ్ డాక్టర్!" వాపు చూస్తూ భయంగా అరిచాడు.

**"కూల్ మై బోయ్.. కూల్! ఎయిడ్‌కి ఎయిడ్స్‌కి చాలా తేడా ఉంది! నిజానికీ జబ్బు నటీనటులకే వస్తుంది! ఏ ఐ డి ఎయిడ్ అంటే యాక్షన్ ఇన్వాల్వ్‌డ్ డిసీజ్ అని అర్థం! ఈ వాపు వచ్చిన ముందు రోజు నువ్వే సన్నివేశంలో నటించావో కాస్త గుర్తు చేస్కుని చెప్పు!"**

సుక్కీత్ ఆరోజు తను నటించిన సిన్మా షూటింగ్‌ని ఫ్లాష్‌బ్యాక్‌లాగా రీల్స్ వెనక్కి తిప్పి చెప్పసాగాడు.

అది 'పిడికిలే పిడుగు' షూటింగ్! సుక్కీత్ మొదటిసారి వో ఫ్యాక్షన్ సిన్మాలో నటిస్తున్నాడు! అసిస్టెంట్ డైరెక్టర్ డైలాగ్స్ కాపీని సుక్కీత్‌కి అందించేడు. సుక్కీత్ డైలాగ్స్ చదువుకుని రెడీ అవుతుండగానే- డైరెక్టర్ "యాక్షన్" అని అరిచాడు.

సుక్కీత్ కళ్ళు ఎరుపెక్కేలా రౌద్రంగా చూస్తూ తన ఎడమ చేత్తో ఎడమ తొడ మీద ఫట్ ఫట్‌మని చరుస్తూ విలన్‌ని చూసి 'రేయ్! నేను పిడికిలి బిగిస్తే అది నీ పాలిట పిడుగవుతుందిరా" అంటూ గట్టిగా అరిచాడు. దర్శకుడు "కట్... ఓకే" అని మరో సన్నివేశానికి యాక్షన్ చెప్పాడు.



"నేను జబ్బ చరిస్తే జబల్పూర్‌లో అందరికి జలుబు చేస్తుంది! భోపాల్‌లో నేను పళ్లు కొరికితే ఆ సౌండ్ నేపాల్ దాకా వినిపిస్తుంది. కన్యాకుమారిలో నేను తొడ కొడితే కాశ్మీర్‌దాకా దద్దరిల్లిపోతుందిరా!"

"కట్! వెరీగుడ్!" దర్శకుడు చెప్పి "క్లైమాక్స్‌లో విలన్‌ని చంపేముందు మీ యాక్షన్ అదిరిపోవాలి! డైలాగ్స్‌కి జనం వూగిపోవాలి! కమాన్- టేక్!" అంటూ అరిచాడు.

సుక్కీత్ మీసాలు మెలేసి ఒక్క అరుపు అరిచి విలన్ పైబడి పొట్టమీద గండ్ర గొడ్డలి ఆనించి ఎడమ చేత్తో ఎడమ తొడని పటపటమని కొడుతూ రౌద్రంగా "నే నిలబడితే విప్లవం... కలబడితే ఉద్యమం! నా ఉచ్ఛ్వానం సుడిగుండం... నా నిశ్వాసం వాయుగుండం... నా కండరాలన్నీ కలిస్తే టోటల్‌గా నీకు యమగండం..." అంటూ పెద్ద ధ్వని వచ్చేలా తొడ చరిచాడు. దర్శకుడు కట్ చెప్పి

"సుక్కీత్ ఇంకా బాగా తొడ కొట్టాలి! అప్పుడు వచ్చే చప్పుడు బాగా రికార్డవ్వాలి!" అన్నాడు. అలా అలా ఆరోజు ఇరవై టేకులు తిన్నాక క్లైమాక్స్ వోకే అయింది.

"ఇదీసార్! ఆరోజు షూటింగ్ విశేషాలు!" సుక్కీత్ చెప్పి మళ్ళీ మరోమారు వాపు వంక చూస్కుని బావురుమన్నాడు.

నీల్కుమా గట్టిగా నవ్వి "వోకే! వోకే! కేసు మొత్తం అర్థమైంది! నువ్వలా ఫ్యాక్షన్ సిన్మా కోసం తొడ కొట్టి కొట్టి అదలా వాచిపోయింది! వీటిని ఫ్యాక్షన్ పిక్చర్ ఫ్రాక్చర్స్ అంటారు!" అంటూ తన దగ్గరున్న లాప్‌టాప్ కంప్యూటర్ వోపెన్ చేసి రెండు స్పీకర్లు కనెక్టు చేసి ఆన్‌చేశాడు.

"శివశంకరీ! శివానందలహరి!" అనే పాటతోబాటు మహానటుడి అభినయం కంప్యూటర్ స్క్రీన్ మీద రాసాగింది. నీల్కుమా ఆ దృశ్యాన్ని చూపిస్తూ.

"చూడు సుక్కీత్! నటనలో లీనం అవుతూ పాత్రకి జీవం పోస్తూ జీవితాన్నే కళకి అంకితం చేసిన మహానుభావులు వారు! అలాంటి ఆ వంశం వారు పండిత జనంతో బాటు పామరుల్ని కూడా రంజింపచెయ్యటానికి రకరకాల అభినయాలు చేస్తుంటారు! అందుకే ప్రేక్షకుల్ని మెప్పించ గలిగారు. అవన్నీ చూసి నువ్వుకూడా ఆ లెవెల్లో ఫీలై రెచ్చిపోతే- ఇదిగో ఇలాగే ఉంటుంది! ఎవడు పడితే వాడు తొడ కొడితే ఇంతే సంగతులు! ఇకపై ఇలాంటి పనులు చేయకు అర్థమైందా?" అంటూ వివరించి చెప్పి మహానటుల పాత చిత్రాల పాటల్ని, మహోన్నత ఆ నట వారసత్వాన్ని పుణికిపుచ్చుకున్న యువకిశోరాల కొత్త పాటల్ని వినిపిస్తూ కొన్ని దృశాల్ని చూపించేసరికి- ఆశ్చర్యం!! సుక్కీత్ వాపు కేవలం గంటలోపే క్రమక్రమంగా తగ్గిపోయింది.

"చూశావా సుక్కీత్! మన తెలుగు చిత్ర గీతాల మహత్మ్యం! గాయపడ్డ హృదయాలకే కాదు కండరాలకి కూడా అవి ఔషధంలా పనిచేస్తాయి! మన పదాల లాలిత్యం, భాషకున్న ఔన్నత్యం అమూల్యం... అజరామరం!" అంటూ వివరంగా విశదీకరించాడు నీల్కుమా.

నిర్ఘాంతపోయిన సుక్కీత్ తేరుకుని మంచం దిగి వంగి నేలని తాకి నమస్కరిస్తూ "కొద్దిపాటి విజయానికే గర్వం తలకెక్కి తలబిరుసు తనంతో తొడగొట్టే పాత్రలు చేసినందుకు ఆ కళామతల్లి ఈ విధంగా నన్ను శిక్షించి నా స్థానాన్ని గుర్తు చేసింది! నాది బలుపు కాదు వాపు అని అర్థమైంది! ఇకపై నటించబోయేముందు ప్రతిసారీ మహానుభావుల్ని స్మరించుకుంటాను!" అన్నాడు భావోద్వేగంతో.

చిరునవ్వుతో డాక్టర్ నీల్కుమా సుక్కీత్ భుజం తట్టేడు! ■

---

# బాణీ ముత్యాలు

సేకరణ :
ఎన్.అరవింద, హైదరాబాద్



ఊహల ఉయ్యాలవే... మనసా
మాయల దయ్యానివే
లేనిది కోరేవు, ఉన్నది వదిలేవు
ఒక పొరపాటుకు యుగములు పొగిలేవు

చిత్రం : గుప్పెడు మనసు
పాట పల్లవి : మౌనమె నీ భాష ఓ మూగమనసా

ఆత్రేయ



మర్రిచెట్టు ఎంత ఎత్తు పెరిగినా
తాను పుట్టిన మట్టిని
అది మరిచేనా
ఊడలనే చేతులతో
మొక్కుతుంది
తన కన్నతల్లి ఋణం
కాస్త తీర్చుకుంటుంది

చిత్రం : అమ్మ మనసు
పాట పల్లవి : ఎవరు ఎవరు ఎవరురా పెద్దవాళ్ళు

సి.నారాయణరెడ్డి



లేనిపోని కలలెందుకని
మేలుకుంటె అవిరావు అని
జన్మలోనె నిదరోకు అని
కంటి పాపలకు చెబుతామా

చిత్రం : నువ్వునాకునచ్చావ్
పాట పల్లవి : ఒక్కసారి చెప్పలేవా నువ్వు నచ్చావని

సిరివెన్నెల సీతారామశాస్త్రి



జీవితమే ఒక స్వప్నమహో
మన జననం కమ్మిన నిద్దురహో
ఇట మరణం ఆత్మకు వేకువహో

చిత్రం : ప్రాయశ్చిత్తం
పాటపల్లవి : పోతే పోనీ పోరా

అనిసెట్టి సుబ్బారావు



మంచిని తలపెట్టిన
మనిషి కడ్డులేదులే
ప్రేరణ దైవానిదైన
సాధించును నరుడే

చిత్రం : బాలభారతం
పాట పల్లవి : మానవుడే మహనీయుడు

ఆరుద్ర



# అంతేరా... బామ్మర్ది



ఆదివిష్ణు





## జరిగిన కథ

భాగ్యనగరంలోని ప్రముఖ పారిశ్రామికవేత్త బసవరాజు, జానకిల కూతురు ఉమ, కొడుకు మురళి. ఉమ ప్రియుడు వేణుకి నాగపూర్లో ఉద్యోగం వచ్చినా ఉమకోసం హైదరాబాదులోనే ఉద్యోగం కై చూస్తుంటాడు. అతని బావ రంగనాథం తన బాల్యమిత్రుడు బసవరాజును స్వయంగా కలిసి అడుగుతానంటాడు. ఈ లోపుల బసవరాజు పేపర్లో వార్తలు చదివి ఖంగారుపడి బావమరిదికై ఉద్యోగాలకోసం వచ్చే ఫ్రెండ్స్‌ను కలవకూడదని నిశ్చయించుకుంటాడు. అందుకే అతన్ని కలవడానికి వచ్చిన రంగనాథాన్ని చూడ నిరాకరిస్తాడు. కానీ తరువాత బాధపడతాడు. ఆ సంగతి తెలియని రంగనాథం బసవరాజుపై మండిపడుతూంటాడు. బావగారి పేరు చెప్పకుండా ఉద్యోగానికై వేణు డైరక్టుగా వెళతాడు. బసవరాజు అతన్ని చూసి ఇంప్రెస్ అయి ఉద్యోగం ఇస్తాడు. ఆ ఉద్యోగానికి ఒప్పుకున్నందుకు ఉగ్రుడైన రంగనాథం వేణుని ఇంట్లోంచి పొమ్మంటాడు. బసవరాజు అసిస్టెంట్ పాణీ ఇతర భాషా వార్తలు చదివి వినిపిస్తూ ఉంటాడు.

-(ఇక చదవండి)

"ఇదొక విచిత్రమైన వార్త సార్!" అన్నాడు పాణి

"లేకపోతే వార్త ఎందుకవుతుంది?" అన్నాడు బసవరాజు

"ఈ వార్త అస్సాంని కుదిపేసింది సార్!"

"అయ్‌సీ!"

"గోస్వామి అనే తండ్రిని - గాయత్రీ ప్రసాద్ అనే కొడుకు - స్వీట్స్‌లో విషం కలిపి చంపేసేడు సార్!"

అంత వార్తని తట్టుకోలేకపోయేడు బసవరాజు.

అంచేత బాధగానే అన్నాడు -

"కన్నతండ్రిని - కన్న కొడుకు - విషంపెట్టి చంపడమా?"

"ఆస్తి కోసం సార్! పాపిష్టి డబ్బు - ఎంతపనైనా చేస్తుంది!"

"నిజమే మిస్టర్ పాణీ! కోట్ల కొద్దీ డబ్బు సంపాదించి కన్న కొడుకు యిచ్చే విషం తిని చచ్చేకంటే - కూలి చేసుకుని గంజితాగి బతకడమే బెటరు! అయినా స్వీట్స్‌లో విషం ఎట్లా కలిపేడో?"

"ఆ కొడుకు ఒక పెద్ద డాక్టరు సార్!"

"మా అబ్బాయి లాగా!"

"అంత పెద్ద డాక్టరుకి స్వీట్స్‌లో విషం కలిపే పద్ధతి పెద్ద కష్టమవుతుందా సార్?"




"నిజమే మిస్టర్ పాణీ! అంచేత - కడుపున పుట్టిన బిడ్డల్ని పెద్ద పెద్ద డాక్టర్లని చేసి -వాళ్ల చేత మర్డర్లు చేయించుకుని ప్రాణాలు పోగొట్టుకునే కంటే - పిల్లలకి చదువు చెప్పించకుండా మూటలు మోసే లెవెల్లో పెంచడమే బెటరు!"

"వెరీగుడ్ డెసిషన్ సార్!"

"హు! స్వీట్స్‌లో విషం కలుపుతాడా! విషం!"

అని ఒకటికి పదిసార్లు అనుకుని - గ్లాసులో నీళ్లు తాగి సేద తీర్చుకుంటున్నాడు బసవరాజు!

* * *

సరిగ్గా అదే సమయంలో...

ఆ ఆసుపత్రిలో...

శస్త్ర చికిత్స అని బోర్డున్న గదిలోంచి డాక్టర్ మురళి చాలా హేపీగా హాల్లోకి వచ్చేడు!

హాల్లో వున్న పెద్ద మనిషితో ఆనందంగా అన్నాడు -

"నో వర్రీ! మీ ఆవిడకు ప్రాణ గండం తప్పింది! షి ఈజ్ ఆల్‌రైట్ నవ్!"

పెద్ద మనిషికి టెన్షన్ మటుమాయమైంది!

ఎంతో రిలీఫ్ పొందేడు.

అందుకే ఆనందంగా అంటున్నాడు -

"థేంక్యూ డాక్టర్! థేంక్యూ వెరీమచ్! మీకు ఏమిచ్చి రుణం తీర్చుకోవాలో తెలీకుండా వుంది! ఇది పర్సు! ఇవి స్వీట్స్! తీసుకోండి!"

"ఇప్పుడెందుకండీ - ఇవన్నీ?"

పెద్ద మనిషి డాక్టర్ మురళి చేతులు చొరవగా తీసుకున్నాడు. ఆ చేతుల్లో పర్సునీ స్వీట్సునీ వుంచేడు.

ఆ తర్వాత అన్నాడు -

"ప్రాణదాతకి ఏమిచ్చినా తక్కువే అవుతుంది డాక్టర్! పర్సు మీరుంచుకోండి! స్వీట్స్ - మీరు అపారంగా ప్రేమించే వ్యక్తికి యివ్వండి!"

"నేను అమితంగా ప్రేమించే వ్యక్తి ఈ భూమ్మీద ఒక్కరే వున్నారు?"

"ఎవరు?"

"మా నాన్న!"

* * *

ఆ నాన్నగారు తన ఆఫీసు గదిలో తలపట్టుక్కూచున్నారు!

అట్లా ఎప్పట్నుంచి వున్నారో గాని - ఇప్పుడు పాణితో అంటున్నాడు -

"మిస్టర్ పాణీ! ఈ దిక్కుమాలిన వార్తలు వింటున్నప్పుడు - నాకు బతుకు మీద రోత కలుగుతుంది!"

"మంచి మాటన్నారుసార్!"

"భవబంధాలు తెంచుకుని హిమాలయాలకు వెళ్ళిపోవాలని పిస్తోంది!"

"సూటబుల్ ప్లేసు సార్!"

"అక్కడ ఒంటరిగా బతకాలని పిస్తోంది!"

"గుండెకి గాయమైతే ఇల్లాంటి ఆలోచనలే వస్తాయి సార్!"

"నాకోసం - మా అబ్బాయి వస్తే - నా గదిలోకి పంపించవద్దని బంట్రోతు లందరికీ చెప్పు!"

"ఖచ్చితంగా చెబుతాను సార్!"

"ఇక నువ్వు వెళ్ళచ్చు!"

పాణి వెళ్లబోతుండగా - డాక్టర్ మురళి ఆ గదిలోకి వస్తున్నాడు!

అతని చేతిలో స్వీట్స్ పాకెట్టు కూడా వుంది!

డాక్టర్ మురళినీ, అతని చేతిలో స్వీట్సునీ చూచిన పాణి గాభరా పడిపోతూ - బసవరాజుతో అన్నాడు -

"సార్! అబ్బాయిగారు వచ్చేసేరు సార్!"

బసవరాజు సడన్‌గా లేచి నించున్నాడు!

గదిలోకి మురళి అడుగుపెడుతూ పాణిని సరదాగా ప్రశ్నించేడు -

"ఏమిటా ప్రకటన?"

పాణీ డాక్టర్ మురళి మాటని తీసిపారేసేడు.



బసవరాజుతో అన్నాడు -

"సార్! స్వీట్స్ కూడా తెచ్చేరు సార్!"

డాక్టర్ మురళికి ఇప్పుడు కోపం వచ్చింది!

పాణితో అంటున్నాడు -

"నీకేమైనా పిచ్చెక్కిందా? ముందు నువ్వు బయటకు వెళ్లు!"

పాణి బసవరాజుతోనే అంటున్నాడు -

"సార్! నన్ను బయటకు-"

"వెళ్ళమంటున్నాను! ప్లీజ్ గో అవే!" అన్నాడు మురళి కోపంగా

పాణి బసవరాజుని ఉద్దేశించి అన్నాడు-

"వస్తాన్ సార్! బయటకు వెళ్ళి మీ క్షేమం కోసం ఆ భగవంతుడ్ని ప్రార్థిస్తాను సార్!"

అని పాణి బయటకు వెళ్ళిపోయేడు!

డాక్టర్ మురళి కూచుంటో అన్నాడు -

"ఏమిటి నాన్నా అతని పిచ్చివాగుడు? నీక్షేమం కోసం భగవంతుడ్ని ప్రార్థించడ మేమిటి?"

బసవరాజు సమాధానం చెప్పలేదు. మళ్ళా మురళే అన్నాడు -

"అదేమిటి? నీ వాలకం అదో మాదిరిగా వుంది! ఎందుకంత నెర్వస్‌గా వున్నావ్?"

బసవరాజు బెదిరిపోతూ అడిగేడు -

"అవి - స్వీట్స్ తెచ్చేవా మురళీ!"

"పాకెట్ ఊడదీస్తూ అన్నాడు మురళి -

"నీ కోసమే తెచ్చేను నాన్నా! కమాన్ - హేవిట్!"

అతను ఇవ్వబోతుంటే బసవరాజు అరిచేడు భయంగా-

"వద్దురా వద్దు! తీసుకుపో!"

డాక్టర్ మురళి ఆశ్చర్యపోతూ అన్నాడు -

"నాన్నా?"

"నేను స్వీట్స్ తినను! తినకూడదు!"

"తినకూడదా?"

"అవున్రా! షుగర్ పేషెంట్‌ని గదా! తినకూడదు!"

"నీకు షుగరా. నేను డాక్టర్ని నాన్నా! నీకు షుగర్‌లేదు!"

ఇక తప్పదన్నట్టు కొంచెం కటువుగానే అన్నాడు బసవరాజు -




"అయినా సరే! నువ్వు తెచ్చిన స్వీట్స్ - నేను తినను గాక తినను! తిననంతే! తీసెయ్!"

తండ్రి వాలకానికి డాక్టర్ మురళి బాగా షాకు తిన్నాడు.

కోపం కూడా వచ్చింది.

కానీ ఆ కోపాన్ని దిగమించుకుని అన్నాడు -

"జోక్ చేస్తున్నావేమోనని యిప్పటివరకు సహించి కూచున్నాను! అయామ్ బిజీ డాక్టర్ యునో? అక్కడు బోలెడ్ పేషెంట్స్‌ని విడిచిపెట్టి - నీ చేత స్వీట్స్ తినిపించాలని వస్తే - వద్దంటావా? నే చేసిన తప్పేమిటి నాన్నా?"

బసవరాజు చెప్పదలుచుకున్నది స్పష్టంగానే చెప్పేడు -

"నాకోసం స్వీట్స్ తీసుకురావడం తప్పు! వద్దు వద్దంటున్నా - తినూ తినమని వత్తిడి చేయడం పెద్ద తప్పు! ఇంకో తప్పు చేయకుండా వెళ్ళిపో! సంతోషిస్తా!"

డాక్టర్ మురళి నడన్‌గా లేచి నించున్నాడు!

"ఆల్‌రైట్! ఆల్‌రైట్ నాన్నా! ఆల్‌రైట్!

నీకోసం స్వీట్సు తీసుకురావడమే అపరాధమైతే - సారీ! ఇకముందు ఇల్లాంటి పిచ్చిపని చేయనుగాక చేయను!"

అని విసురుగా ఆ గది విడిచి వెళ్లిపోయేడు డాక్టర్ మురళి!

అతను వెళ్లేక ఆ స్వీట్స్ పాకెట్‌ని కిటికీలోంచి బయటకు విసిరేసేడు బసవరాజు!

ఆ స్వీట్స్ పాకెట్ -

అక్కడే తచ్చాడుతున్న రంగనాథం నెత్తిమీద పడింది!

రంగనాథం తలెత్తి చూసేడు! కోపంగా గాలితో అంటున్నాడు -

"మేము రాళ్లతో కొడతాం! పేదవాళ్ళం గదా! రాళ్లే మాకు అందుబాటులో వుంటాయి

మీరు కోటీశ్వరులు! రాళ్లు మీకు సూటుకావు! అంచేత ఖరీదైన స్వీట్స్‌తో కొడతారు! ఒరే బసివీ - నిన్ను నీకంటే పైనున్న దేవుడు కూడా క్షమించడు! ఆ!"

అని ఆ స్వీట్స్ పాకెట్‌ని సైడు కాలవలో పారేసి ఒక చెట్టు కిందికి చేరేడు!

ఎందుకైనామంచిదని తలెత్తి చెట్టువేపు చూస్తున్నాడు!

* * *

డాక్టర్ మురళితో పాటు వేణు నడుస్తున్నాడు!

డాక్టర్ మురళి మవునంగా వున్నాడు! వేణు అంటున్నాడు -

"ఎంతో ప్రేమతో స్వీట్స్ తీసుకొచ్చేరు! అది తప్పెందుకవుతుంది? అన్నట్టు డాక్టర్ మురళీ - ఆ గదిలోకి మీరు వెళ్ళినప్పుడు అక్కడెవరున్నారు?"

"ఇంకా ఎవరుంటారు? మా నాన్నకి నీడలాంటి మనిషి - పాణి వున్నాడు!"

"అనుకున్నాను! అతను వున్నప్పుడే ఈ విచిత్రాలు జరుగుతున్నాయి! వదిలేయండి! మీరు నిశ్చింతగా వెళ్లండి! మీ నాన్నగారి చాదస్తానికి మూల కారణమేమిటో నేను కనుక్కుంటాను! ఓ.కె?"



అని డాక్టర్ మురళిని కారెక్కించి పంపించేసేడు!

తిరిగి ఆఫీసులోకి వెళ్లబోతుండగా - చాలా ఆత్మీయంగా - 'ఒరే వేణూ' అనే పిలుపు తియ్యగా వినిపించింది!

వేణు వెనక్కి తిరిగి చూసేడు!

అక్కడ రంగనాధమున్నాడు!

రంగనాధాన్ని చూడగానే వేణు కళ్లు చెమర్చేయి!

'బావ' అంటో అతన్ని చేరుకున్నాడు!

రంగనాథం చేతుల్ని తీసుకుని - ఆ చేతుల్ని కళ్లతో అద్దుకుని -

''బావున్నావా బావా!'' అన్నాడు ఆత్మీయంగా వేణు!

బామ్మర్ది పలకరింపుకి ముగ్ధుడయ్యేడు రంగనాధం!

''నా సంగతి వదిలెయ్! ఆ తిక్క సన్నాసి దగ్గిర నువ్వు ఎట్లావున్నావ్?'' రంగనాధం అడిగేడు!

''బసవరాజు గారు చాలా మంచివారు బావా! నువ్వే ఆయన్ని అపార్థం చేసుకుంటున్నావ్!''

ఆమాటతో రంగనాధానికి కోపం ముంచుకొచ్చింది!

తన చేతులు లాక్కున్నాడు. కోపంగానే అంటున్నాడు-




''అంతేరా! అంతే! నేను అమాయకపు ముండాకొడుకుని గదా? అందర్నీ అపార్థం చేసుకోవడం నా లక్షణం! శ్రీరామచంద్రుడ్నీ చీ పొమ్మంటాను! రామణాసురుడ్ని కావిలించుకుంటాను! మీలాగా మేము పెద్దపెద్ద చదువులు చదువుకున్నామా? లేదు! పలు కష్టాలు పడుతూ - వారాలవీ చేసుకుంటో - ఏడో తరగతి ఏడుసార్లు తప్పిన ఏబ్రాసి వెధవలం! మాకేం తెలుస్తుంది లోకం?''

బావగారి వరసకి వేణు భయపడ్డాడు!

తమ మాటలు ఎవరైనా వింటున్నారేమోనని చుట్టుపక్కల చూచి అన్నాడు -

''బావా! ప్లీజ్! గట్టిగా అరవకు! ఎవరైనా వింటారు!''

''విననివ్వు! ఎవరో వింటారనే భయంతో నోరు నొక్కేసుకోడం మాకు చేతకాదు! గంభీరమైన నిజాల్ని గట్టిగా చెబుతామే కాని - గుట్టుగా భోదించం! మేము కొన్ని సత్యాలు - జీవిత సత్యాలు చెబుతుంటాం! అంతేగా? జీవిత సత్యాలు చెప్పడం నేరమా? జైల్లో పెడతారా? సిద్ధంగా వున్నాం! ఉరిశిక్షలు వేస్తారా? రెడీగా వున్నాం! ఒరే వేణూ - నువ్వింత దగా చేస్తావనుకోలేదురా బామ్మర్దీ!''

వేణు ఆశ్చర్యంగా అడిగేడు -

''నేను - నిన్ను - దగాచేసేనా?''

''లేదురా! నేనే నిన్ను నిలువునా ముంచేసేను! వెన్న తినరా బామ్మర్దీ అంటో - నీ నోట్లో చిన్నప్పట్నుంచీ మైదా పిండి కుక్కి పెద్ద చేసేను! జేబులు కొట్టుకో బాగుపడతావని బుద్ధులు నేర్పేను! మూటలు మోసుకో కోట్లు సంపాయిస్తావని సలహాలిచ్చేను! అర్ధాకలిత్తో నీ కడుపు మాడ్చేను! రాత్రిళ్లు మురికి కాలవలపక్కనపడుకోమని ఆర్డర్లు వేసేను. ఒరే బామ్మర్దీ - నేన్నీకు చాలా చాలా ద్రోహాలు చేసేనురా! అందుకే నా యింటి నుంచి పారిపోయి - ఇదుగో - ఈ హరిశ్చంద్ర చక్రవర్తి, ధర్మదాత, దానకర్ణ, దాచేపల్లి పాండు - ఈపేరెందుకు వచ్చిందో రానివ్వు - ఆజాతి మనిషి దగ్గిర - ఆ పుణ్య పురుషుడి కొలువులో ఎంచక్కా సుఖపడిపోతున్నావ్? సుకం అనే వస్తువు బసివిగాడి దగ్గిర లేదురా? వాడి మేడల్లో లేదు. వాడి కరెన్సీ కట్టల్లో అస్సలు లేదు!''

వేణు - మరింత భయపడిపోతూ అన్నాడు -

''బావా! నీ కాళ్లట్టుకుంటాను. దయచేసి వెళ్లిపో!''

''నాకెళ్లెందుకు? పట్టుకున్నావ్ గదా గాడిద కాళ్లు! ఒరే బామ్మర్దీ - గాడిద కాళ్లు పట్టుకుని బాగుపడ్డవాడు ఈ భూమీమ్మీద లేడురా! ఎప్పుడో కొడుతుంది గాడిద! నువ్వు పట్టుకున్న కాళ్లతోనే - నీ దవడ పళ్లు రాలిపోయేలాగా ఫెడీల్మని కొడుతుంది! తెలుసునాకు!''

''సాయంత్రం మీ యింటికి వస్తాను బావా వెళ్లిపో!''

''మాకెందుకుంటాయిరా ఇళ్లు? మీకంటే ఇంద్రభవనాలుంటాయి! తాజ్‌మహల్లుంటాయి! మావి గుడిసెలు! పందుల పాకలు! వద్దు బాబూ! నువ్వు మా యింటికి రావద్దు! పెద్ద పెద్ద భవనాల్లో వుండే మీకు - మాయింటికొస్తే ముక్కులు పాడైపోతాయ్! మెదళ్లు చెడిపోతాయ్! ఇక్కడింత దరిద్రమా అని మూర్ఛపోతారు! బామ్మర్దీ! నువ్వు రావద్దు!''

''రానులే బావా! సరేనా?''

''నువ్వు వస్తావని ఎందుకనుకుంటా(న్రా నేను? నువ్వురావు! ఆ బసివిగాడు నిన్ను మీ బేవార్సు బావగారింటికి ఎందు పంపుతాడు. పంపడు! పైగా వాడ్ని రాయిచ్చుకొట్టేగదా! అసలు పంపడు! వాడు మమ్మల్ని స్వీట్సుతో కొడితే కేసుండదు! రాయిచ్చుకొడితేనే కేసు! ఈ తడవ కొడతానోరేయ్ - దెబ్బకి లా అంటాడు! వెళ్లెళ్లు! వెళ్లి వాడితో చెప్పు! జాగ్రత్త పడతాడు! పోలీసు రిపోర్టది అడ్వాన్సుగా రాసి పెట్టుకోమను! నన్ను జైల్లో పెట్టించమను! ఈ దగాకోరు ప్రపంచంకంటే - మాకు జైలే ఎంతో సుఖంగా వుంటుంది!'' అని ఏదేదో గొణుక్కుంటో - గాల్లో చేతులు ఊపుకుంటో - రంగనాథం వెళ్లిపోతున్నాడు!

బావ పరిస్థితికి జాలిపడి నిట్టూర్చేడు!

**-(ఇంకావుంది)**




చదువులాపు
సత్యమూర్తి
మా కోరికలు నెరవేరేదాకా ధర్నా చేయాలనుకుంటున్నాము
అలాగే. మా కోరికలు విడివిడిగా బోర్డుల మీద వ్రాసి తీసుకురండి. అప్పుడు ప్రిన్సిపాల్ గారికి ఈ విషయాలు మనం చెప్పకుండానే తెలుస్తాయి
మర్నాడు
అన్నీ రాసుకొచ్చారా? అవి పట్టుకుని కూర్చోండి. ప్రిన్సిపాల్ గారినే ఇటు రమ్మంటాను
మా స్టూడెంట్స్ బోర్డుల మీద రాసినవి చూసి యాక్షన్ తీసుకుని సాయం చేయండి సార్
పరీక్షలు రద్దు చేయాలి
ఈయన చేస్తున్నది సాయమా? లేక రచనా వ్యాససాయమా?
!!!
ప్రిన్సిపాల్ గారి దౌర్జన్యం నశించాలి
పరీక్షలు రద్దు చేయాలి

# సరిగపదమని

కూర్పు :
బి. బాలసుబ్రహ్మణ్యం

**2**



పంపినవారి పేరు : ______________________

వయసు : ______ వృత్తి : ______________

చిరునామా : ______________________

______________________

______________________

______________ ఫోన్ : ______________

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ నంబర్‌తోసహా పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

విజేతల ఎంపిక
ప్రతిసారి
ఓ సినీ ప్రముఖునిచే...



**ఆధారాలు: అడ్డం:**

1. పదకొండు అడ్డం లోని పాట పల్లవి గల చిత్రం పేరులో తిథి మాయం (4)
3. 'కొండలే రగిలే .............. నీ సిగలో నీ పూవేలోయ్' అన్నాడు దేవదాసు (4)
5. ఏఆర్ రెహమాన్ ని ఆస్కార్ దాకా తీసుకు వెళ్ళిన హిందీ చిత్రం (3)
7. 'అనగనగా ఆకాశం వుంది' అనే పాట గల చిత్రంలోని తొలి సగం (2)
8. 'బృందా .... మది అందరిది' అనే మిస్సమ్మ పాటలో మిస్సయిన అక్షరాలు (2)
9. 'అందమైన బావా ఆవు పాల.....' (2)
10. 'చెంగావి రంగు .......... కట్టుకున్న చిన్నది' అన్నాడు బంగారుబాబు (2)
11. సూర్యుని పై ఘంటసాల పాడిన పాట పల్లవి తొలిసగం (4)
13. శుక ...... ముఖ సుఖ రవములతో యమహానగరి (2)
14. 'లేరు కుశలవుల ...........' (2)
16. 'నీ అధరామృతం ........... రెడ్డి' అన్నాడు సింహాద్రి 21 అడ్డంలోని నాయికతో (2)
17. ............. చిగురు తినగానే కోవిల పలికేనా (2)
19. ఒక రాజు - ఒక రాణి లో పాటలు రాసిన మాటల రచయిత (4)
21. సన్నగా అర నవ్వు నవ్వి ఖుషీ చేసిన నాయిక (3)
23. ఏకాక్షర సంగీత దర్శకుడు, చక్రవర్తిగారబ్బాయి (1)
24. 'అన్నానా......' అన్నాడు సారంగధరుడు (3)

**నిలువు**

1. '........... ప్రియా కనుగొన్నానులే ప్రియా' (4)
2. .......... మాయే మదిలో నా మదిలో (4)
3. 'మామ' పేరులోని ఆఖరి రెండక్షరాలు (2)
4. విశాఖపట్నంలోని గాజువాక ప్రాంతానికి గుర్తింపు తెచ్చిన పాట (6)
6. సుశీల 'ఈ' కోకిల (2)
9. 'కోడి ఒక ....... లో పుంజు ఒక ..........లో' (2)
10. 'జీవితమే ఒక దీపావళి' అనిపించే వెలుగుల రంగేళి ముందుండేది (3)
11. 'దీని జిమ్మ.....' అన్నాడు పది అడ్డంలోని బంగారుబాబు (2)
12. ..... .... వచ్చావు చందమామ లేక లేక నవ్వింది కలువ భామ అంటోంది అర్ధాంగి (2)
14. 'అహ నా పెళ్ళియంట' పాటకు అభినయించిన అభినేత్రి (3)
15. గులాబీ సంగీత దర్శకునిలో చంద్రుడు కనబడకుండాపోతే? (3)
16. ............. నా దేశం నమోనమామి (4)
18. .....లక బేబి .....లక బేబి లవ్వు చెయ్యి తోచలేదా (2)
20. 'నీ విరహంలో బ్రతికాను ఈ..... మరణిస్తాను' అన్నాడు ప్రేమనగర్ కథానాయకుడు (2)
22. 'చిన్ని చిన్ని ఆశ' పాటను పాడిన గాయనిలో మొదటి, ఆఖరి అక్షరాలు (2)

**పజిల్, కూపన్ 15-9-2003 లోగా చేరాలి**

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

మొదటి బహుమతి(ఆల్ కరెక్ట్)



34 పాటలు గల
డబుల్ ప్యాక్ ఆడియో సి.డి.

రెండవ బహుమతి (ఒక తప్పుతో)




18 పాటలు గల
ఆడియో సి.డి.

మూడవ బహుమతి (రెండు తప్పులతో)




30 పాటలు గల
డబుల్‌ప్యాక్ ఆడియోక్యాసెట్

కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)




20 పాటలు గల
ఆడియో క్యాసెట్




సినిమాలో హాస్యానికి ప్రశంసనీయమైన స్థానాన్నివ్వడం వేరు, సంపూర్ణ హాస్య చిత్రాన్ని నిర్మించటం వేరు. అలా సంపూర్ణ హాస్యంతో నిర్మించబడిన చిత్రాలలోని హాస్యపు స్థానం గర్వించదగ్గదిగా ఉండటం అంతకన్నా వేరు. గర్వించదగ స్థాయిలో వున్న హాస్యంతో పాటు మానవతా విలువలున్న కథా కథనం - వాటికి జతపడే సంగీత సాహిత్యాలు - వీటన్నిటి కలయిక అతి అరుదుగా జతపడుతూవుంటాయి. అటువంటి చిత్రాల కోవలోకి వచ్చే చిత్రమే




ఈ చిత్రంలోని ఓ 5 పాటల గురించి గత సంచికలో చెప్పుకోగా మిగిలిన కొన్ని స్వరరచనల గురించి ఈ సంచికలో....

రఘు : మూగవైన ఏమిలే
నగుమోమే రాలులే
సైగలింక చాలింపుము
జాణ తనము తెలిసెనులే ॥మూగ॥
ఆపలేని అనురాగం చూపులలో తొణికెనులే ॥ఆపలేని॥
దొంగ మనసు దాగదులే ॥దొంగ॥
సంగతెల్ల తెలిసెనులే ॥మూగ॥
పలుకకున్న ఏమాయెను వలపు బాసలింతేలే ॥పలుక॥
ననుదయతో ఏలుకొనుము ॥నను॥
కనుసన్నల మెలిగెదలే ॥మూగ॥
అందాలే బందాలై నను బందీ చేసెనులే ॥అందాలే॥
కలవరమిక ఎందుకులే ॥కలవర॥
వలదన్నా వదలనులే ॥మూగ॥



ఈ పాటను ఎ.ఎమ్.రాజా పాడగా తెరపై జగ్గయ్య, జమున అభినయించారు. మాల్‌కౌస్ రాగంలో తిశ్రగతిలో సాగిన ఈ పాటను అత్యంత హుషారైన రీతిలో రాజేశ్వరరావు మలచారు. ఎ.ఎమ్.రాజా సంగీత జీవితంలో మరిచిపోలేని హిట్‌ని ఆయనకు ఇచ్చిన మరో మంచి పాట ఇది. ఈ పాటలో - ఉచ్ఛారణకు సంబంధించిన ఓ విశేషం వుంది 'అందాలే బందాలై నను బందీ చేసెనులే' అనే వాక్యంలో 'బందాలై' అనే పద ప్రయోగం కొంతమందికి ఆశ్చర్యం కలిగించవచ్చు. 'బంధాలై' అని వుండాలని అనిపించవచ్చు. 'బందాలై' అనే ప్రయోగం సరియైనదే. గాయనీ గాయకుల ఉచ్ఛారణను బట్టి భాషని, రచయితని తప్పుపట్టే రోజులు కావవి.

చిన్నారి చూపులకు ఓ చందమామా
ఎన్నెన్నో అర్థాలు ఓ చందమామ, నా చందమామా ॥చిన్నారి॥
తలుపుచాటున దాగి ఓరచూపులు చూస్తె
పిలిచినట్టె వెళ్ళి పలకరించాలంట ॥తలుపు॥
తప్పించుకొని పోయి జాలిగా చూస్తేను
తప్పించుకొని పోయి జాలిగా చూస్తేను
వలచినట్టే ఎంచి మురిసిపోవాలంట ॥చిన్నారి॥
కనుబొమలు చిట్లించి కోరచూపులు చూస్తె
తననింక విడువనని బాస చేయాలంట ॥కను॥
కొంగు సవరించుకొని కొరకరా చూస్తేను
కొంగు సవరించుకొని కొరకరా చూస్తేను
చెంగు వీడనటంచు చెంత చేరాలంట ॥చిన్నారి॥



ఈ పాటను ఎ.ఎం.రాజా పాడగా జగ్గయ్య, జమున అభినయించారు. సన్నివేశప్రాధాన్యంగా చివర్లో సి.యస్.ఆర్ కనిపిస్తారు. ట్యూన్‌ని పూర్తిగా మరిచిపోయి కేవలం సాహిత్యాన్ని మాత్రమే దృష్టిలో పెట్టుకుని చూస్తే - 'మిస్సమ్మ' సినిమాలోని 'ఆడువారి మాటలకు అర్థాలే వేరులే' అనే పాటకు ఈ పాట సెకెండ్ వెర్షన్‌లా కనిపిస్తుంది. ఇక సంగీతపరంగా చూసుకుంటే హరికాంభోజి రాగచ్ఛాయాలు కనిపిస్తాయి. 'పూజాఫలం' సినిమాలో బి.వసంత పాడిన 'వస్తావు పోతావు నాకోసం వచ్చి కూర్చున్నాడు నీకోసం యముడు వచ్చి కూర్చున్నాడు నీకోసం' అనే 'హాస్య - తత్వగీతం' ఈ పాటకు చెల్లెలులా అనిపిస్తుంది. రెండు పాటలకీ సంగీత దర్శకుడు యస్.రాజేశ్వరరావే కనుక 'ఏక మనోజనితాలు'గా అనుకోవచ్చు.

రఘు : చేయి చేయి కలుపరావె హాయి హాయిగా
నదురు బెదురు మనకింక లేదు లేదుగా ॥చేయి॥
లీల : పెద్దవారి అనుమతింకా లేదు లేదుగా
చేయి చేయి కలుపుటెలా హాయిహాయిగా ॥పెద్ద॥ ॥చేయి॥
రఘు : మగని మాట కెదురాడుట తగదు తగదుగా
నాతి చెంత విరహమునే తాళలేనుగా ॥మగని॥ ॥చేయి॥
లీల : వీలుకాని విరహమింకా వలదు వలదుగా
దాసి మీద వలపు మీకు తగదు తగదుగా ॥వీలు॥ ॥చేయి॥




'చేయి చేయి కలుపరావే హాయి హాయిగా' పాటను ఎ.ఎమ్.రాజా, పి.లీల పాడారు. తెరపై జగ్గయ్య, జమున అభినయించారు. చివర్లో సియస్‌ఆర్, యస్వీ రంగారావు కూడా కనిపిస్తారు. అన్యస్వరమైన నిషాదాన్ని ("ని' అన్న స్వరాన్ని) అక్కడక్కడ కలుపుకున్నా మోహన రాగానికుండే మాధుర్యాన్ని పాటంతా పరుచుతూ స్వరపరచిన ఈ పాట ట్యూనంతా మొదట్నించి చివరి వరకూ ఒకేలా ఉంటుంది. పల్లవికి చరణానికి తేడా ఉండదు. అదే ఈ పాట విశేషం. 1989లో కాంగ్రెస్ పార్టీ అధికారంలోకి తిరిగి రావటానికి ముందు జరిగిన ఎన్నికలలో తమ ప్రచారం కోసం ఈ పాట పల్లవిని తమ ఎన్నికల గుర్తుకు దగ్గరగా ఉందని మొత్తం పాటని ప్యారడీచేసి వాడుకోవటం, అప్పుడున్న పత్రికలన్నీ ఈ పద్ధతిని ఓ ప్రత్యేక ప్రక్రియగా పేర్కొనటం - ఇవన్నీ ఈ పాట సాధించిన పరోక్ష విజయాలే.

భజ : కాశీకి పోయాను రామాహరి
గంగతీర్థమ్ము తెచ్చాను రామాహరి
గంగ తీర్థము తెచ్చాను రామాహరి
ఉష : కాశీకి పోలేదు రామాహరి
ఊరికాల్వలో నీళ్ళండి రామాహరి
మురుగు కాల్వలో నీళ్ళండి రామాహరి
భజ : శ్రీశైలం వెళ్ళాను రామాహరి
శివుని వీభూది తెచ్చాను రామాహరి
శివుని వీభూది తెచ్చాను రామాహరి
ఉష : శ్రీశైలం పోలేదు రామాహరి
శివుని వీభూది తేలేదు రామాహరి
ఇది కాష్టంలో బూడిద రామాహరి
భజ : అన్నమక్కరలేదు రామాహరి
నేను గాలి భోంచేస్తాను రామాహరి
ఉత్త గాలి భోంచేస్తాను రామాహరి
ఉష : గాలితో పాటుగా రామాహరి
వీరు గారెలే తింటారు రామాహరి
నేతి గారెలే తింటారు రామాహరి
భజ : కైలాసమెళ్ళాను రామాహరి
శివుని కళ్ళార చూశాను
రెండు కళ్ళార చూశాను రామాహరి
ఉష : కైలాస మెళితేను రామాహరి
నంది తన్ని పంపించాడు రామాహరి
బాగ తన్ని పంపించారు రామాహరి
భజ : ఆలుబిడ్డలు లేదు రామాహరి
నేను ఆత్మయోగీనండి రామాహరి
గొప్ప ఆత్మయోగీనండి రామాహరి
ఉష : ఆ మాట నిజమండి రామాహరి
నేను అందుకే వచ్చాను రామాహరి
నేను అందుకే వచ్చాను రామాహరి



ఈ పాటను ఘంటసాల, స్వర్ణలత ఆలపించారు. రేలంగి, గిరిజ అభినయించిన ఈ పాటలో కస్తూరి శివరావు, నల్ల రామ్మూర్తి, బొడ్డపాటి కృష్ణారావు (వినాయక చవితి సినిమాలో వినాయకుడు), అల్లు రామలింగయ్య తదితరులు కూడా కనిస్తారు. మధ్యమావతి రాగంలో ఖండగతిలో సాగిన ఈ పాట రచనకు కాశికావడి ప్రదర్శకులు పాడుకునే జానపద గీతం మూలం. ఆ జానపద గీతం ఇలా ఉంటుంది.

కాశీకి పోయాను రామాహరీ - కాశితీర్థమూ తెచ్చాను రామాహరీ
కాశీకి పోలేదు రామాహరీ - వూరి కాలువలో నీళ్ళండి రామాహరీ
కాశీకి పోయాను రామాహరి - కాశి విభూతి తెచ్చాను రామాహరీ
కాశీకి పోలేదు రామాహరీ - వీడి కాష్ఠంబులో బూడిదండి రామాహరీ
పంచేంద్రియములూ రామాహరీ - నేను బంధించివున్నాను రామాహరీ
కొంచెము నమ్మినా రామాహరీ - కొంపముంచి వేస్తాడండి రామాహరీ.

ఇదీ ఆ జానపద గీతం ధోరణి. విలువలు పాటిస్తే హాస్యగీతమైనా సరే నాలుక్కాలాలు పాటు నిలబడుతుందని నిరూపించిన ఈ పాట కూడా ట్యూన్ పరంగా పల్లవికి, చరణానికి ఏ మాత్రం తేడా లేకుండా ఉంటుంది.

ఈ పాటలే కాక కొన్ని పద్యాలు కూడా ఉన్నాయిచిత్రంలో. అందులో ఓ సరదా పద్యమిది...

**సీ॥ నవకళా సమితిలో నా వేషమును చూసి
ఎచ్చటెచ్చటి జనుల్ మెచ్చవలదె!
నటరాజ నటరత్న నటకావతంసుడన్
బిరుదులు గొని విఱ్ఱవీగవలదె!
ప్రతి పట్టణ గ్రామ పల్లెపల్లెలు కూడా
ఈ భజగోవింద మేలవలదె!
ఊరూర గల కాఫి హెూటళ్లలో, కిల్లి
కొట్లలో మన కప్పు పుట్టవలదె!
ఆంధ్ర నాటక రంగమార్తాండు దనుచు సభలు కావించి ప్రేక్షకుల్ సత్కరింప
పెట్టుబడికోసమప్పు లిప్పించి, యిచ్చి, ఈ విశాలాంధ్ర నన్ను పోషింపవలదె!**



ఈ పద్యాన్ని ఘంటసాల ఆలపించగా రేలంగి అభినయించారు. నల్లరామ్మూర్తి, కస్తూరి శివరావు కూడా సన్నివేశ ప్రాధాన్యంగా కనిపిస్తారు. వేరొకరి రచనను పేరడీ చెయ్యడం కన్నా తన రచననే తిరిగి పేరడీ చేసుకోవటం నిజంగా చాలా గొప్ప విషయం. తన మీద తానే జోక్ చేసుకోగలిగిన వ్యక్తి గ్రేట్ హ్యూమరిస్ట్ కాకపోతే మరేమవుతారు? 'మాయాబజార్'లోని ఘటోత్కచుని పాత్ర ప్రవేశిస్తూ ఆలపించిన

'అష్ట దిక్కుంభి కుంభాగ్రాలపై మన
కుంభధ్వజము గ్రాల చూడవలదె!
గగన పాతాళ లోకాలలోని సమస్త
భూత కోటులు నాకె మ్రొక్కవలదె!
ఏ దేశమైన నా ఆదేశముద్ర పడి
సంభ్రమాశ్చర్యాల జరుగవలదె
'హైహై ఘటోత్కచ' 'జైహే ఘటోత్కచ'
అని దేవగురుడె కొండాడవలదె!
ఏనె ఈయుర్విసెల్ల శాసించవలదె
ఏనె ఐశ్వర్యమెల్ల సాధించవలదె
ఏనె మన బంధు హితులకు ఘనతలన్ని
కట్ట పెట్టిన ఘనకీర్తి కొట్టవలదె!

అనే పద్యాన్ని గుర్తుకు తెచ్చుకుంటూ ఈ పద్యాన్ని గమనించండి. పింగళి వారు తనను తాను పేరడీ చేసుకోవటంలో ఎంతటి ఔన్నత్యాన్ని, ఔచిత్యాన్ని పాటించారో అవగతమవుతుంది.

పైన ఉదహరించిన స్వరరచనలే కాక రామరామ శరణం, ఆనందం పరమానందం వంటి పాటలు ఆత్మత్యాగం అనే ఓ నృత్యనాటిక, నలదమయంతి అనే ఓ స్వప్న రూపకం, మరో పద్యం కూడా వున్నాయి.... ఉరుకులు పరుగుల హడావుడితో కూడిన ఫాస్ట్‌ఫుడ్ కల్చర్‌తో కాకుండా తెలుసుకుందామన్న కుతూహలంతో అధ్యయనం చేయడానికి తగిన ఏకాగ్రతతో చూస్తే 'అప్పుచేసి పప్పుకూడు' చిత్రం తవ్వుతున్న కొద్దీ బైటపడే ఓ గని.... ◆


ALL TIME SOUTH INDIA RECORD
దక్షిణభారత చలన చిత్ర చరిత్రలో 191 కేంద్రాల్లో డైరెక్ట్‌గా అర్ధశతదినోత్సవం జరుపుకుంటున్న మొట్టమొదటి చిత్రం!
50 th Day
వి.దొరస్వామి రాజు సమర్పించు
VMC
విజయమారుతి క్రియేటివ్స్
సింహాద్రి
వి.విజయ్‌కుమార్ వర్మ
ఎస్.ఎస్.రాజమౌళి
యమ్.యమ్.కీరవాణి
www.ntr2ntr.com
SURESH BUJJI POSTERS

